# మణిపూసలు

(ఏర్చి కూర్చిన సూక్తులు, లోకోక్తులు)

**A Book of Telugu Quotations**

సంకలనం :

మన్నవ గిరిధరరావు, ఎం. ఏ.
(Ex. M. L. C.)

ప్రచురణ :

యువభారతి ఎడ్యుకేషనల్ సొసైటీ (రిజి.)

శ్రీకృష్ణనగర్ గుంటూరు-522 006



మూల్యము ముప్పది రూపాయలు

ప్రథమ ముద్రణ : 1976 నవంబరు
రెండవ ముద్రణ : (అదనపు విషయములతో) 1977
మూడవ ముద్రణ : ( ,, ,, ) : 1979
నాలుగవ ముద్రణ : ( ,, ,, ) : 1983
ఐదవ ముద్రణ : ( ,, ,, ) : 1986
ఆరవ ముద్రణ : ( ,, ,, ) : 1991

ముఖచిత్రం :
శ్రీ 'త్రిగుణ్' హైదరాబాదు

ముద్రణ :
శ్రీ లక్ష్మి ప్రెస్
14/2 అరండల్ పేట, గుంటూరు-2.

డిస్ట్రిబ్యూటర్స్ :
1. M/s. సాహిత్య నికేతన్
3-4-852 బర్కత్‌పూరా,
హైదరాబాద్-27
2. M/s. సాహిత్య నికేతన్
ఏలూరురోడ్డు సెంటర్,
గవర్నరుపేట,
విజయవాడ - 2.

పిడతల రంగారెడ్డి,
అధ్యక్షులు,
యువభారతి ఎడ్యుకేషనల్ సొసైటీ.



# మాటల మాధుర్యం

"ఏదో సామెత చెప్పినట్లు........ అని పలువురు మాటల మధ్య అంటూ వుంటారు. ఆ సామెత ఏమిటో చెప్పరు. చెప్పాలనే వుంటుంది గాని గుర్తుకు రాదు. సమయానికి మనస్సులో మెదిలితే దాన్ని ప్రయోగించి ఒక పాయింటు గెలిచినంత ఆనందపడుతూ వుంటారు.

నిజానికి మాటలమధ్య మెరుపుతీగెల్లాంటి చెణుకులను అక్కడక్కడ చొప్పించగలిగితే ఆ ప్రసంగం వినడానికి జనం చెవికోసుకుంటారు. ఎంతో లోక పరిశీలన, జీవితానుభవం, బహుగ్రంథపఠనం ఉంటేగాని అలాంటి నేర్పు అలవడదు.

సామాన్యుని జీవితం మధురాతిమధురంగా గడవాలంటే అతని పలుకుల్లో మణిపూసల్లాంటి మాటలు తొంగిచూడడం వాంఛనీయం. అవి లోకోక్తులు కావచ్చు. ప్రసిద్ధ పురుషుల సూక్తులు కావచ్చు. కవి పండితుల విశిష్టభావాలు కావచ్చు. ఏమైనప్పటికీ నిరంతరం పెరుగు చున్న ప్రపంచ సారస్వతం నుండి ఏరిన రత్నాలను విరివిగా వినియోగించగలిగితే సంభాషణకు శోభ చేకూరుతుంది.

మాటలంటే మాటలా? వాటికి ఎంతో ప్రాధాన్యం వున్నది. "మంచి మాటలకు ఖర్చులేదు; విలువ అధికం" అని ఒక ఆంగ్ల

రచయిత అన్నాడు. మాటల్నిబట్టే మనిషి పోకడ తెలుస్తుంది. మాటల వల్లనే స్నేహము. విరోధము ఏర్పడుతాయి. అందుకే "గొడ్డలిచే నరికినచెట్టు చిగురించును. కాని మాటలచేత చెడిన కార్యము చక్కబడదు" అని విదురుడు అంటాడు. నోరు మంచిదవుతే ఊరు మంచిదవుతుందనే సామెత వుండనే వున్నది.

ఇలా మాటలలో మాధుర్యాన్ని చొప్పించడానికి ఈ "మణిపూసలు" ఉపకరిస్తుంది. ఇందు వివిధ అంశములను గురించి పేర్కొనబడిన సూక్తులు లోకోక్తులు విద్యార్థులకు, వక్తలకు, రచయితలకు మరింత ఉపకరించగలవని నా విశ్వాసం.

దీని సంకలనకర్త శ్రీ మన్నవ గిరిధరరావు రచయితగా, గుంటూరు హిందూకళాశాల అధ్యాపకులుగా, కొంతకాలం రాష్ట్ర విధానపరిషత్తు సభ్యులుగా పాఠకులకు పరిచితులే. యువకులకు, విద్యార్థులకు ప్రబోధాత్మకము, నిర్మాణాత్మకమగు భావములను అందించే లక్ష్యంతో శ్రీ కంచికామకోటి పీఠాధిపతులు శ్రీ జయేంద్ర సరస్వతీస్వామివారి ప్రోద్బలంతో మేము ప్రారంభించిన యువభారతి ఎడ్యుకేషనల్ సొసైటీయొక్క ప్రచురణలలోనిది మూడవది.

గిద్దలూరు — పిడతల రంగారెడ్డి
1-11-1976

# ఇందులో

# మణిపూసలు

## అందం

* అందం బలప్రయోగం చేయని రాజు — సూక్తి

* నలుపు తెలుపులలోన లేదు అందం
తలపు తీరు లోనే ఉంది అందం.
— చల్లా రాధాకృష్ణశర్మ

* యోగులూ సన్యాసులూ సన్నగా ఉంటేనూ,
చతుష్పాద జంతువులు బలిష్ఠంగా ఉంటేనూ,
పురుషులు జ్ఞానవంతులైతేనూ,
స్త్రీలు వివాహితలైతేనూ సుందరంగా వుంటారు.
—బర్మా సామెత

* చక్కనమ్మ చిక్కినా అందమే, సన్నచీరె మాసినా అందమే.
—సామెత

* కాంతయొక్క కుంతలములు
మనల్ని లాగినంత బలంగా
పది జతల ఎడ్లుగూడ లాగలేవు. —లాంగ్ ఫెలో

* అందమైనవేవీ పుష్కలంగా ఉండవు. — ఎమర్సన్

* అందంలోతు చర్మం వరకే. — ఆంగ్ల సామెత

* అందం భగవంతుని దస్తూరి. —ఎమర్సన్

* అందానికి కొలబద్ద దృష్టి. — ఉమాపతి పద్మనాభశర్మ

* అందరు అందులైన రంభలుకాని రమణులుందురే?

— కట్టమంచి రామలింగారెడ్డి

* పాతచేటకు పూత అందం. — సామెత

* అందమైన బాహ్యరూపం
ప్రళయానికి ఒకప్పుడు హేతువవుతుంది
అందమైన అంతరంగం
ప్రణయానికి సేతువవుతుంది ఎప్పుడూ.

— చల్లా రాధాకృష్ణశర్మ

* అందమైన వస్తువు
నిరంతర ఆనందహేతువు. —కీట్స్

* అందమె ఆనందం
ఆనందమె జీవిత మకరందం.

—"బ్రతుకు తెరువు" సినిమా

* అందం తొందరగా కంటికి పాతబడిపోతుంది
సౌశీల్యానికి మాత్రమే ఎప్పుడూ నశించని ఆకర్షణ వుంది.

— గురజాడ అప్పారావు

**అంధుడు**

* కన్నులు లేనివాడు అంధుడు కాడు;
విద్యా విహీనుడు అంధుడు. — క్షేమేంద్రుడు

**అజ్ఞానం**

* అజ్ఞానమిచ్చిన ధైర్యాన్ని విజ్ఞానమివ్వదు.

—పోలాప్రగడ సత్యనారాయణమూర్తి

* నా కోడి కుంపటీ లేకపోతే తెల్లవారదన్నట్లు — సామెత

* గొడ్రాలికేమి తెలుసు బిడ్డనొప్పులు? — సామెత
* చదువునేర్తువా వ్రాయనేర్తువా అంటే చదువా వ్రాయనేరనుగాని, చించనేర్తునన్నాడట — సామెత
* అజ్ఞాన మనేది మనస్సుకు రాత్రివంటిది
ఆ రాత్రిలో తారాచంద్రులు గూడ వుండరు.
—కన్ఫ్యూషియస్

## అత్త

* అత్తలేని కోడలు గుణవంతురాలు
కోడలు లేని అత్త ఉత్తమురాలు — సామెత

## అత్తరికం

* అత్త కొట్టినకుండ అడుగు ఓటికుండ, కోడలు కొట్టిన కుండ కొత్తకుండ. — సామెత
* ఆకలివేస్తున్నదే అత్తాఅంటే రోకలిమింగవే కోడలా అన్నదట.
— సామెత
* కోడలి పిల్లకు పనిలేకపోతే బర్రెదూడనెత్తుకు నుంచోమన్నదట అత్త. — సామెత

## అతి

* కన్నుపోయేటంత కాటుక పెట్టుకుంటారా? — సామెత
* అతి సర్వత్ర వర్జయేత్ — సంస్కృతసూక్తి
* పిచ్చుకపై బ్రహ్మాస్త్రమా? — సామెత

## అతిజాగ్రత్త

* పట్టుచీరె అరువిచ్చినమ్మ పీటపుచ్చుకు తిరిగిందట.
— సామెత

## అతిథి

* అతిథులు వేరైనా బుద్ధు లొకటే. ఎదుటివారిసొమ్ము లెల్లవారికి తీపి - ఇదే మూలసూత్రం. —పుచ్చా పూర్ణానందం
* అతిథి పరాన్నభోజీ, పరచేలధారీ. —పుచ్చా పూర్ణానందం
* 'అతిథి' అంటే అయిదున్నర అడుగుల మానవుడేననీ, బ్రాహ్మణుడే ననా నీభావం? వేళకు ఆకలిగొని వచ్చిన ఏప్రాణి అయినాసరే- పక్షయినా, పురుగైనా అతిథే. ఆకలిగొన్నవన్నీ ఆహారం కోసం అన్వేషిస్తాయి. నిజమైన ఈ అతిథులను నీవు గుర్తించవు.

  కాక బలికి సమృద్ధిగా అన్నం ఇంటి వెలుపల విడిచిరా. వేటినీ పిలువవద్దు. తరుమవద్దు. "తినడానికే జంతువు వచ్చింది" అని ఆలోచించవద్దు. అలాచేస్తే లక్షలాది అతిథులను సత్కరించినట్లే. —షిర్డీసాయిబాబా

## అదృష్టం

* అదృష్టము సాహసము అక్కచెల్లెళ్ళు
  అడుగు కలిసి నడచిన అద్భుతమే యగు.
  —యార్లగడ్డ రంగనాయకులు చౌదరి
* కలిసివచ్చే రోజువస్తే నడిచివచ్చే కొడుకు పుడతాడు. —సామెత
* గండం గడిస్తేగాని యోగం పట్టదు. —సామెత
* అదృష్టవంతుడిని సముద్రంలోపారవేస్తే నోట చేపను కరచుకొని పైకివస్తాడు. —అరబ్బీసామెత
* అదృష్టంగల డాక్టరుకు ఆయుస్సుగల రోగి దొరుకుతాడు! —సామెత

**అద్దం**

* అద్దం అబద్ధమాడదు. —సామెత

**అధికారము**

* ఇతర మనుష్యుల మనస్సులమీద, చర్యలమీద ఆధిపత్యము కలిగియుండడమే అధికారము.

—హాన్స్ జె. మార్గెంథో

* కిరీటాన్ని ధరించే శిరస్సు సుఖానికి దూరమవుతుంది.

—షేక్స్పియర్

* అధికారం ధనంవెంట పడుతుంది.[1] —ఆంగ్లసామెత

* అధికారానికి విస్తరించుకొనే దుర్లక్షణం వుంది. ఎన్ని అవరోధాలనైనా దాటుకుపోగలదు. దానికంటే ఉన్నతమైన శక్తి ప్రతిబంధకమైనపుడు మాత్రమే ఆగుతుంది.

—జస్టిస్ హెచ్. ఆర్. ఖన్నా

* అధికారము మనిషిని చెడగొడుతుంది; అడ్డులేని అధికారం పూర్తిగా చెడగొడుతుంది.[2] —లార్డుయాక్టన్

* స్వార్థానికి పరిమితులుంటాయిగాని అధికారానికి అవధులుండవు. దేశంలో వున్న ఆఖరు వ్యక్తి సహితం తన ఆధిపత్యానికి తల యొగ్గేవరకు అధికార కాంక్ష తీరదు.

—హాన్స్. జె. మార్గెంథో

---

1 **"Power goes with Purse".** — Proverb

2 **Power corrupts man and absolute power corrupts absolutely.** —Lord Acton

* అధికారాంతమునందు చూడవలె ఆ అయ్య సౌభాగ్యముల్.

—నానుడి

* పదవీ అధికారం పోయిన తర్వాత ఎవరూ ఎవరికీ ఏమీకారు

—వసంత నాగేశ్వరరావు

* పదవిపోయిన మంత్రి పంచరైన సైరు

—నార్ల వెంకటేశ్వరరావు

## అధికార దుర్వినియోగం

* నా యింటికి నేనే పెద్దను, పిల్లికి పెట్టరా పంగనామం!

—సామెత

## అద్వైతం

* తనకంటె వేరగు వస్తువు ఒక్కటి యున్నదని తలంపుకల్గిన వెంటనే, భయము, కోపము, ఆశ అన్నియు కలుగును. ఆవస్తువు నుండి కష్టము కలుగునేమోయను భీతిచేత కోపము, భయము, ద్వేషము ఏర్పడును. ఆ వస్తువుపై అభిలాష కల్గినచో ఆశ యేర్పడును. 'అంతా ఒక్కటే రెండు అనునదియే లేదు' అని మనసుకు నిశ్చయము కల్గినచో రాగములేదు, ద్వేషములేదు. ఒక్కటి యనునది సత్యము, రెండు అనునది మాయ.

—కంచికామకోటి జగద్గురువులు

* ప్రపంచములోని ప్రతిపదార్థమునందును, ప్రతిప్రదేశమునందును భగవత్కళ నిండియున్నదను యెరుకయే అద్వైతము.

—సత్యసాయిబాబా

* అన్నిటిలోను ఒక్కటే చూడటం అద్వైతం.

—మాతృశ్రీ అనసూయాదేవి

## అనవసరం

* తలకోసుకు పోకుంటే
చెవిపోగుల కేడ్వెందుకు —కాళోజీ నారాయణరావు

* గేదె ఉడాయించినాక
దేని కింక పలుపు? —దేవీప్రియ

* అవిటివానికేల అభినయశాస్త్రమ్ము
చెవిటివానికేల కవులగోష్ఠి —నార్ల వెంకటేశ్వరరావు

* కొండంత దూదికి కొండంత నిప్పెందుకు? —సామెత

* ఆయనేవుంటే మంగలెందుకన్నట్లు. —సామెత

## అనవసర ప్రమేయం

* ఆవును దూడయు నుండగా నడుమ గుంజ అరచెనన్నట్లు
—సామెత

## అనుకరణ

* పాశ్చాత్యులను మనము అనుకరిస్తే మనము వాళ్ళనీడ అన్న మాట. నీడకు నామరూపాలు లేవు. నీడను ఎవరు గౌరవిస్తారు?
—విశ్వనాథ సత్యనారాయణ

* లోటివాడు తొడకోసుకుంటే తాను మెడ కోసుకున్నట్లు
—సామెత

* ఊరంతా వడ్లెండబెట్టుకుంటే నక్క తోకెండ బెట్టుకున్నదట.
—సామెత

* ఒక కుక్క దేన్నోచూచి అరిస్తే మిగతా కుక్కలు దాన్నిచూచి అరవడమారంభిస్తాయి. —చైనా సామెత

## అనుభవం

* అనుభవం జ్ఞానానికి జనకుడు. —ఆంగ్ల సామెత

* చిన్నవాడి చదువుకన్న పెద్దవాడి అనుభవం గొప్పది.
—ఉమాపతి పద్మనాభశర్మ

* తరులు గిరులు ఝురులు కాల
తరంగాల తాకిడితో
మారునట్లు; మనిషిమారు
అనుభవాల రాపిడితో
—ఖలీల్ జిబ్రాన్ (అనువాదం : సి.నా.రె)

* తడిసిగాని గుడిసె కప్పదు —సామెత

* పుస్తకంబులోని మాటలు
విస్తరించుచు, అనుభవమ్ముల
తత్త్వమెరుగక, శుకములగుదురు
వొట్టి శాస్త్రజ్ఞుల్. —గురజాడ అప్పారావు

* పాతరోగి సగం వైద్యుడు. —సామెత

* అనుభవం ఉత్తమ బోధకుడు, అయితే బడిజీతంమాత్రం అధికం.
—ఆంగ్ల సామెత

## అనుమతి

* చింతకాయల కాజ్ఞగాని గుటకలకాజ్ఞా? —సామెత

* తుంగభద్ర స్నానానికి కొండుభొట్లు అనుజ్ఞ ఎందుకు?
—సామెత

## అపజయము

* అపజయాలు వాస్తవాలను వెల్లడి చేస్తాయి;
విజయాలు వాటిని దాచివుంచుతాయి —హోరెస్

* ఏపనిలో నైనా విజయం సాధించలేమని ముందుగానే ఒక నిర్ణయానికి వచ్చే వ్యక్తులు ఎన్నడూ విజేతలు కాలేరు.
—సర్ ఆర్థర్ కాటన్

## అపరిగ్రహము

* దేహధారణకు కావలసిన వస్తువుకంటె అధికముగా మనము గ్రహించిన అది దొంగతనముతో సమానము. మనకు కావలసిన దానికంటె అధికముగా గ్రహించకుండుటయే అపరిగ్రహము. ఇట్టి నియమమున్ననే సత్యవస్తు దర్శనమబ్బును. భగవదను గ్రహము కలుగును. —కంచికామకోటి జగద్గురువులు

## అప్పు

* అప్పు ! అప్పు అనగానేమి ? మన చేతిలో డబ్బుని కాస్సేపు మరొకడ్ని పట్టుకోనియ్యడం. అంతే.
—ముళ్ళపూడి వెంకటరమణ

* అప్పుచేసేవాడు స్వేచ్ఛనమ్ముకొంటాడు.[1] —జర్మన్ సామెత

---

[1] He who borrows sells his freedom.

—German Proverb

* బాగా అప్పుల్లో మునిగినవాణ్ణి "ఏమయ్యా! ఇన్ని అప్పులు చేశావుగదా రాత్రిళ్లు నిద్రపడుతున్నదా" అని అడిగారు. "నిద్రపట్టంది నాకుగాదు - అప్పులిచ్చినవాళ్ళకు" అని అతని జవాబు!

* అప్పు చేయువాడు అప్పిచ్చిన వానికి దాసుడు.

—బైబిలు. సామెతలు 22-7

* ఋణము తీసుకోనూ వద్దు, ఇవ్వనూ వద్దు
ఎందుకంటే, తరుచుగా
ఇచ్చిన అప్పు తిరిగిరాదు, స్నేహితుడూ మిగలడు[1]

—షేక్స్పియర్

* అప్పులు, పాపాలు మనం అనుకొనేదానికంటె ఎక్కువగా ఉంటాయి. —ఆంగ్ల సామెత

* అప్పు : పరపతిని కొలిచే కొలబద్ద.

—గోళ్ళమూడి గోపాలకృష్ణమూర్తి

* ఒకణ్ణి వదిలించుకోవాలంటే అతనికి అప్పివ్వు.

—ఆంగ్ల సామెత

* అప్పు ఇచ్చిచూడు, ఆడ పిల్లనిచ్చిచూడు —సామెత

* అప్పు ఇచ్చినవాడు బాగుకోరును, తీసుకొన్నవాడు చెడుకోరును.

—సామెత

---

1 Neither a borrower nor a lender be
For loan often loses both itself and friend

—Shakespeare.

* "........లోకమందప్పులు తప్పులున్నెఱుగనేరని వారెవరైన నుందురే ?" —ముళ్ళపూడి వెంకటరమణ

* సూర్యుడు సముద్రుడిదగ్గిర అప్పు తీసుకుంటున్నాడు ; ఆయన దగ్గర నుండి భూమి అప్పుతీసుకుంటోంది. దాన్ని సముద్రుడు వడేసుకుంటున్నాడు. మళ్ళీ పైవాడికి అప్పులిస్తున్నాడు. ఋణ భ్రమణం దారుణంగా సాగిపోతోంది.

—ముళ్ళపూడి వెంకటరమణ

* ఆస్తి కలిగి తీరుపలేని యప్పెయప్పు
నూరుగాని వేయికైన వ్రాయు నోటెనోటు

—కాళ్ళకూరి నారాయణరావు

* సమర్థులైనవారు ఋణం తీసుకొని ఆదాయం పెంచుకుంటారు. అసమర్థులు అప్పులు చేసి దివాలా తీస్తారు. లోపం మనిషిలో వుందిగాని అప్పులో లేదు.

—ఇండియన్ ఎక్స్‌ప్రెస్ సంపాదకీయం

* సామాన్యంగా అప్పు ఇవ్వకు. ఒకవేళ ఇవ్వవలసి వస్తే ఈ డబ్బు నాది కాదనుకొని మరీఇవ్వు.

—మోపిదేవి కృష్ణస్వామి

## అప్పు చేయువాడు

* ఋణదత్తుడు అసాధ్యుడు, అప్పులనేవి ఉండగా కష్టపడి సంపాదించడమేమిటని నవ్వుకొనేవాడు. పైగా అప్పుతీర్చడానికి అప్పుదబ్బే ముఖ్యమని అతని నమ్మిక.

—ముళ్ళపూడి వెంకటరమణ

## అభివృద్ధి

* వృద్ధిలోకి పోయినకొద్దీ ఇంకా జాగా ఉంటూనే ఉంటుంది.[1]

—వెబ్‌స్టర్

1 "There is always room at the top" —Webster

* అభిమానం లోపల ప్రవేశిస్తే అభివృద్ధి బయటకు పోతుంది.[1]
—దత్తోపంత్ ఠేంగ్డీ

## అమాయకత్వం

* వెన్న పెడితే మింగలేదు, వేలు పెడితే కొరకలేదు. —సామెత

## అల్పుడు

* అల్పబుద్ధివాని కధికారమిచ్చిన
దొడ్డవారినెల్ల దొలగగొట్టు
చెప్పుతినెడి కుక్క చెఱకు తీపెరుగునా —వేమన

* అల్పుని కధికారమిస్తే అర్ధరాత్రిపూట గొడుగు తెమ్మన్నాడట.
—సామెత

* నీచుని హోదా పెరిగిన
నిక్కు ఎక్కువగుట నిజము
బంటు మంత్రికాగానే
వక్రించదె అతని నడక —హిందీకవి రహీమ్
(చూడుడు :దుర్జనులు)

## అల్లుడు

* అల్లుని మంచితనంబును....
తెల్లని కాకులును లేవు తెలియర సుమతీ —సుమతీశతకము

---

1 "When prestige is in, progress is out"
—Dattopant Thengadi

* అల్లుడని పేరుపెట్టి పుల్లవిరిస్తే ఎగిరిపడిందట. —సామెత

* అల్లుడూ అంటే వంకరబ్రాడే లేచి నిల్చుంటుంది. —సామెత

* జామాతా దశమోగ్రహః —సంస్కృతసూక్తి

**అవకాశవాది**

* దాసరివా జంగమవా అంటే 'ముందరిఊరు కొద్దీ' అన్నాడట.
—సామెత

**అవివేకి**

* వివేకహీనునికి శాస్త్రజ్ఞానము గ్రుడ్డివానికి స్వహస్తదీపమువలె నిష్ఫలము. —నీతిచంద్రిక

* బుద్ధిహీనుడైతేగాని ఒకేగోతిలో రెండుసార్లు పడడు.
—టర్కీ సామెత

* రథచక్రంమీద కూర్చున్న ఈగ "అబ్బ! నేను ఎంత దుమ్ము రేపుతున్నాను" అనుకుంటుంది. —లే ఫోంటెన్

**అశ్రద్ధ**

* కాచి కాచి కోతలు వచ్చేసరికి కునుకు తీసినట్లు
—మళయాళ సామెత

* ఏడుస్తూ వ్యవసాయం చేస్తే కాడిమోకులు దొంగలెత్తుకెళ్ళారట.
—సామెత

## అసత్యం

* సత్యం చెప్పులు తొడుక్కొనేలోగా అసత్యం భూప్రదక్షిణం చేసివస్తుంది.[1] —సి. హెచ్. స్పర్ గోన్

* అసత్యము చెప్పువాడు అందరి విశ్వాసాన్ని పోగొట్టుకుంటాడు. అందువల్ల ఉసత్యమాడటం మంచిదికాదు.
—వర్ధమాన మహావీరుడు

* ఆపత్కాలంలో మనకు సహాయంచేసి తరువాత తనకు బానిసగా చేసుకొనేమాట-అసత్యం
—గోళ్ళమూడి గోపాలకృష్ణమూర్తి

* కల్ల లాడువాని గ్రామకర్త యెరుగు
సత్యమాడువాని సామి యెరుగు —వేమన

* బొంకరా బొంకరా పోలిగా అంటే 'టంగుటూరిమిరియాలు తాటి కాయలంతేసి' అన్నాడట. —సామెత

## అసమర్థత

* ఆడలేక మద్దెల ఓడు అన్నట్లు —సామెత

## అస్పృశ్యత

* నన్ను తాకకు అనేది మానసికమైన జబ్బు. జ్ఞాపకముంచుకోండి. వ్యాప్తియే జీవనము, సంకుచితమంతా మరణము. ప్రేమద్వారా అందరినీ నిలో ఇముడ్చుకో. —స్వామి వివేకానంద

---

[1] A lie travels round the world, while truth is putting on her boots. —C H Spurfeon,

* మీ దేశకులమంచు ప్రశ్న వెలయించి చివుక్కున లేచిపోవుచో
బాకున క్రుమ్మినట్లగును పార్థివచంద్ర వచింప సిగ్గగున్
-గుర్రం జాషువా

* అన్యజనుల నెవరి నంటక ముట్టక
తొలగి తొలగి విడిగ మెలగుచుండ
ఆవలద్రోసి మిమ్ము అవని ముందుకు సాగు
—నార్ల వెంకటేశ్వరావు

* పాషాణపు చుక్కపాలను విషము చేయునట్లు అస్పృశ్యత హిందూమతమును కలుషితము చేయుచున్నది. అదొక రోగ చిహ్నము. ఈ పుణ్యభూమిలో మనం ఎదుర్కొనే కష్టాలకు అది గూడ ఒక కారణము. —మహాత్మాగాంధీ

## అసూయ

* అసూయ మనసు నావరించిన కామెర్ల వ్యాధి
—స్వామి సుందర చైతన్యానంద

* పరుల కలిమికి పొర్లి యేడ్చే
పాపికెక్కడ సుఖముకలదోయ్
ఒకరిమేల్ తన మేలనెంచే
నేర్పరికి మేల్ కొల్లలోయ్ —గురజాడ అప్పారావు

* ఇతరుల ధనమునకు, విద్యకు, తేజమునకు, బలమునకు మనస్సు తపించగా అసహ్యపడు నరుడు రోగము లేకుండగనే వేదన పడును. —భారతములో విదురనీతి

## అహంకారము

* అహం ఎక్కువ వున్న వ్యక్తి అందరి ద్వేషానికి పాత్రుడవు తాడు. —వర్ధమాన మహావీరుడు

* అందమూ చదువూ డబ్బూ ఈ మూడింటిలో ఏ ఒక్కటి ఉన్నా చాలు అహంకారం రావటానికి. అన్నీ వుంటే వేరేచెప్పాలా ?
—పోలాప్రగడ సత్యనారాయణమూర్తి

* అహంకారము అవగుణములకు పుట్టిల్లు; జీవునకు దేవునకు నడుమనున్న తెరయే అహంకారము. —సత్యసాయిబాబా

(చూడుము : గర్వము)

## అహింస

* జీవహింసలేక జీవించు నవ్వాని
కాలయముడు గూడ కనికరించు —తిరుక్కురల్

* అహింస అనేది సర్వప్రాణులకు మేలుకోరే మాతృమూర్తి వంటిది. —వర్ధమాన మహావీరుడు

## ఆంధ్రత్వం

* ఆంధ్రుడు అనంతవాది. —భమిడిపాటి కామేశ్వరావు

* అచ్చుతప్పులేని యాంధ్రభాషాగ్రంధ
మతిశయోక్తిలేని యాంధ్రకవిత
అదిరిపాటు లేని యాంధ్రత్వమును లేవు.
—బండ్లమూడి సత్యనారాయణ

* మంచి మనసెదు రైన మాలలిచ్చేవాడు
భాయి భాయీ అన్న చేయికలిపేవాడు
తిక్క రేగిందంటె డొక్క చీల్చేవాడు
చిక్కు లెరుగనివాడు చిత్తాన పసివాడు
ఎవడయ్య ఎవడువాడు
ఇంకెవ్వడయ్య తెలుగువాడు ! —సి. నారాయణరెడ్డి

## ఆచరణ

* ఆచరణగా పరిణమించకపోతే ఆలోచనకు పరిపూర్ణత్వం సిద్ధించదు. ఆచరణ మానవుని ఆలోచనలకు హద్దు లేర్పరుస్తుంది. ఆలోచనకు, ఆచరణకు నడుమ పొంతన ఉన్నపుడే జీవితానికి పూర్ణత్వమూ సహజత్వమూ సిద్ధిస్తాయి. —మహాత్మాగాంధీ

## ఆకలి

* పని చేయకుండా సులభంగా సంపాదించగలిగేది
ఒకటున్నది-అది ఆకలి. —గోళ్ళమూడి గోపాల కృష్ణమూర్తి

## ఆత్మ

* పువ్వునందు సువాసన, నువ్వులందు నూనె, వంటచెరుకు నందు అగ్ని, పాలలో నెయ్యి, చెరకులో బెల్లం దాగిఉందని వివేకంతో తెలుసుకొనునట్లే దేహమునందు ఆత్మను భావించవలెను.

—సంస్కృత సూక్తి

* మనుజుడు పాతబట్టలను విడిచి యితరములగు క్రొత్త బట్టల నెట్లు ధరించుచున్నాడో, అట్లే ఆత్మయు పాత శరీరములను వదలి క్రొత్త శరీరములను ధరించుచున్నది.

—భగవద్గీత (2-22)

* ఈ ఆత్మ ఛేదింపబడ జాలదు, దహింపబడ జాలదు, తడుపబడ జాలదు, ఎండింపబడజాలదు. ఇతడు నిత్యుడు, సర్వవ్యాపి, స్థిర స్వరూపుడు, నిశ్చలుడు, పురాతనుడు. —భగవద్గీత (2-24)

* ఈ ఆత్మయొక్క స్వరూపములో మూడు విషయాలను గుర్తు పెట్టుకొనవలెను. ఒకటి : ఆత్మ ఎల్లప్పుడు మార్పులేక ఒకే రీతిలో నుండుట. దీనినే 'సత్' స్వరూపమందురు. రెండు:ఆత్మ సర్వము తెలుసుకొని జ్ఞానరూపములో నుండును. దీనినే 'చిత్' స్వరూపమందురు. మూడు: ఆత్మ సంపూర్ణమైన సుఖరూపములో నున్నది. దీనినే ఆనంద స్వరూపమందురు.

—బ్రహ్మచారి ప్రసన్న చైతన్య

* నిద్ర మనస్సునకే గాని ఆత్మ కెలాకాదో, చావు దేహానికేగాని ఆత్మకు అంటదు. — స్వామి సుందర చైతన్యానంద

## ఆత్మజ్ఞానం

* పేదవారిలోకెల్ల పేదవారితో ఐక్యభావం అలవరచుకొని వారికి సేవ చేయుట ద్వారా తప్ప ఆత్మజ్ఞానం సిద్ధింపజాలదని నా నమ్మకం. —మహాత్మాగాంధీ

* నీవు ఆత్మతో ఒకటి కాగానే దేహమంతా కేవలం శక్తిరూపమై కనిపిస్తుంది. నీ జీవితం బ్రహ్మాండమైన అయస్కాంతం వైపుకు ఆకర్షించబడిన సూది మాదిరిగా అవుతుంది. ఇంకా లోతుకు దిగిన కొద్దీ నీవు స్మృతి రూపాన్ని ధరిస్తావు. ఇచ్చట ఆలోచనలుగాని, బాధ్యతలుగాని ఏమీలేవు. అవి అన్నీ గుమ్మం దగ్గరే జారిపోతాయి. ఒక అఖండ మహా ప్రవాహంలో నీవొక గడ్డి పరకవు. అందులో నీవు గుటకాయస్వాహా అయిపోతున్నావు.

కాని అది అత్యంత ఆనందకరమైన మహాస్థితి. నిన్నులోనికి తీసుకుపోతున్న ఆవస్తువే నీవైపోతున్నావు. అంటే ఆ వస్తువును "నేను"గా అనుభవం పొందుతావు. —రమణమహర్షి

* ఒక దేశపు చిత్రపటం చూచిన దానికీ అసలు ఆ దేశాన్నే చూడడానికీ ఎంత తేడాఉందో, మత గ్రంధాలు పఠించడానికీ ఆత్మ సాక్షాత్కారం కలగడానికీ అంత అంతరం వుంది.

—స్వామి వివేకానంద

* పొగచే నిప్పు, దుమ్ముచే అద్దము, మావిచే గర్భమునందలి శిశువు ఏలాగున కప్పబడి యున్నవో ఆలాగున కామముచే ఆత్మజ్ఞానమున్ను కప్పబడి యున్నది. —భగవద్గీత (3-38)

(చూడుము మోక్షము)

## ఆత్మవిశ్వాసం

* స్వశక్తి యందలి ప్రగాఢ విశ్వాసం వలన ఏర్పడిన మానసిక ప్రశాంతతయే అనంత శక్తికి ప్రోతస్సు. కాని మనం ఆత్మ విశ్వాసం పేరిట అహంకారానికి లోను కాకూడదు. వినయం పేరిట ఆత్మవిశ్వాసహీనులం కాగూడదు.

—గురూజీ గోల్వాల్కర్

## ఆత్మవిమర్శ

* నీకంటిలోనున్న దూలాన్ని మొదట తీసుకొని నీ ఎదుటివాని కంటిలోనున్న నలుసును తీసుకొమ్మని చెప్పు. మొదట నిన్ను నీవు పరీక్షించుకో. —ఏసుక్రీస్తు

## ఆత్మస్తుతి

* ఇంద్రుడైనను తనను తాను స్తోత్రము చేసికొనినచో గడ్డిపరకకన్న తేలిక యగును. —మహామంత్రి చాణుక్యుడు

* మనిషిని చులకనచేసేది 'తన గొప్ప తానే చెప్పుకోవడం'
—ఉమాపతి పద్యనాభశర్మ

* నిన్ను గురించి నీవు చెప్పకోకు. ఎందుకంటే మంచి చెప్పు కుంటే ఎవరూ నమ్మరు; చెడు చెప్పుకుంటే ఇంకెంత వున్నదో ననుకుంటారు.[1]
—ఆంగ్లసామెత

## ఆత్మహత్య

* ఆత్మహత్య జీవిత సమస్యను పరిష్కరింప జాలదు. తాను పరిష్కరింపజాలని గణిత సమస్యను విద్యార్థి పలకమీద లేకుండ చెరిపి వైచినచో సమస్య పరిష్కారమగునా ?
—స్వామి రామతీర్థ

## ఆత్రేయ

* రాసి పాఠకులనూ రాయక నిర్మాతలనూ ఏడిపిస్తాడు.
—ఆత్రేయపై వ్యాఖ్య

## ఆదర్శం

* స్వార్థపరత్వాన్ని అదుపులో ఉంచడానికి మార్గం ఒకటే. వ్యక్తికి పనిచేయడానికి, జీవించడానికి, మరణించడానికి అతని ముందు ఒక ఆదర్శాన్ని ఉంచాలి. ఆ ఆదర్శంపై గల శ్రద్ధ ద్వారా అతడు తన స్వార్థ ప్రవృత్తులను అదుపులో పెట్టుకొన గలుగుతాడు.
—గురూజీ గోల్వాల్కర్

---

1 Neither speak well or ill of yourself. If well, men will not believe you. If ill they will believe a great deal more than you say. —Proverb

### ఆనందం

* ఇది కావాలని లేకపోవడమే ఆనందం.

—మాతృశ్రీ అనసూయాదేవి

### ఆయుధం

* కట్టులేని వాణ్ణి గొడ్డె అయినా కరుస్తుంది. —సామెత

### ఆరోగ్యసూత్రం

* తక్కువ భుజించి, ఎక్కువ కాలం జీవించు అనేది మంచి ఆరోగ్య సూత్రం. —డాక్టర్ పి. దక్షిణామూర్తి

* 'Drink solids and eat liquids'- ఘనపదార్థాలను త్రాగు ద్రవ పదార్థాలను నమలు అనేది ఒక ఆరోగ్య సూత్రం. అంటే ఘనపదార్థాలను ద్రవంలాగా మారువరకు నమలాలి. ద్రవ పదార్థాలను నిదానంగా లాలాజలంతో నమిలి మ్రింగాలి.

—జంధ్యాల విశ్వనాధ్

* కాస్త చీకటి ఉండగానే లేచి ప్రాణాయామం చేస్తే ఏ జబ్బులూ వుండవు. —కొడవటిగంటి కుటుంబరావు—"ఐశ్వర్యం" నవల

### ఆలశ్యం

* మందుకు పోయి మాసికానికి వచ్చాడట. —సామెత

* ఆలస్యాదమృతం విషం. (ఆలస్యము వలన అమృతము విషమగును.) —సామెత

* కొంపలంటుకుంటే బావి త్రవ్వినట్లు. —సామెత

* చీర సింగారించేలోగా ఊరు మాటు మణిగిందట —సామెత

## ఆశనిరాశలు

* ఆశావాది ప్రతి కష్టంలోనూ ఒక అవకాశాన్ని చూస్తాడు. నిరాశావాది ప్రతి అవకాశంలోను ఒక కష్టాన్ని చూస్తాడు.[1]

—అజ్ఞాత ఆంగ్లకవి

* చెట్టు తొఱ్ఱలోని అగ్ని చెట్టునువలె, హృదయ మందలి ఆశ సర్వ అనర్థములకు మూలమును. అట్టి ఆశను దిగనాడి ప్రాప్త లాభమున సంతసించువాడె కృతార్థుడు.

—యక్షుని ప్రశ్నకు ధర్మరాజు జవాబు

* గొప్ప వ్యక్తులు ఆశయాల కొఱకు జీవిస్తే, దుర్బలులు ఆశల కొరకు జీవిస్తారు. —చైనాసామెత

* బ్రతుకు నేర్పిన చక్కని పాఠమొకటి
ఆశ పడవద్దు నీకు నిరాశ లేదు. —ఆత్రేయ

* పాటిమీద బూర్లెమూకుడు బోర్ల పడిందనగానే ఊరు పూరంతా పాటిమీదికి పరిగెత్తారట. —సామెత

(బూర్లెమూకుడు ఎంతది, బోర్లపడిన దాంట్లోని బూరెలు ఎందరికి సరిపోతాయి అనేవిషయమే ఎవరూ ఆలోచించకుండా ఆశపడ్డారు.)

---

1 An optimist sees an opportunity in every difficulty
A pessimist sees a difficulty in every opportunity.

—Anon

* ఆశావాది చూసేది ముళ్ళనుకాదు, గులాబీని.
నిరాశావాది చూసేది ముళ్ళనే, కాదు గులాబీని.
—ఖలీల్ జిబ్రాన్ (అను : సి. నా. రె.)

* ఆశకంటె దుఃఖ మతిశయింపగ లేదు. —వేమన

* ఆశకు మించిన జూదం, వడ్డీకి మించిన వేగంలేవు. —సామెత

* ఇరువురు వ్యక్తులు చెఱసాల కమ్మీల నుండి
బయటకు చూస్తూ నిలిచారు
ఒకడు బురదను చూచాడు,
నక్షత్రాలను చూచాడు రెండోవాడు[1] —జాన్ డ్రైడెన్

* ఆస్తి మూరెడు, ఆశ బారెడు —సామెత

* ఆశ లేని ప్రాణి అణగారిపోవును
ఆశ జంపుకొనుట ఆత్మహత్య
ఆశవలయు ; కూడదత్యాశ మాత్రమే
—నార్ల వెంకటేశ్వరరావు

* సమాజానికి ఆశావాదులు, నిరాశావాదులు గూడ అవసరమే.
ఆశావాది విమానాన్ని కనిపెడతాడు; నిరాశావాది
పేరాచూట్ కనిపెడతాడు ! —జి. యస్.

---

[1] Two men looked out of the prison bars
One saw the mud, and the other stars.
—John Draiden

* గులాబీలకు ముళ్లున్నాయని కొందరు వాపోతారు. ముళ్ల గులాబీలను కలిగి యున్నందుకు నేను కృతజ్ఞత తెల్పుతాను.[1]

—అల్ఫోన్సో కారు

## ఆశ్రయం

* ఆశ్రయించినను ఫలచ్ఛాయా సమన్వితంబగు మహా వృక్షమునే ఆశ్రయింప వలెను. ఒకవేళ దైవికంబుగ ఫలములు లభించక పోయినను అనివార్యంబగు దానినీడ పొందవచ్చును. అందుచేత ప్రబలుల నాశ్రయింప వలెను.

—పంచతంత్రములోని "విగ్రహము" నుండి

## ఆస్తి

* ఆస్తి ఎక్కువైన యడల దానిని భక్షించువారును ఎక్కువ గుదురు. — బైబిలు-ప్రసంగి

* యజమాని శ్రమించకుండా అతని ఆస్తి పెరుగుతూవున్నట్లయితే ఆ పెరుగుతున్న ఆస్తి అతనిది కావడం తప్పు. కష్టపడకుండా ఆదాయం పొందరాదని పేదలకు మనం చెప్పినట్లయితే, భాగ్య వంతులకు గూడ అదేసూత్రం వర్తింప చేయాలి.

—జాన్ స్టూవర్ట్ మిల్

---

[1] Some people are always grumbling that roses have thorns. I am thankful that thorns have roses.

—Al Phonso Karu.

## ఆహారం

* రాళ్ళు రప్పలు తిని హరించుకోగల రోజున మరమరాలు గూడా దొరకవు. తీరా వజ్రాలు వైఢూర్యాలు పోగేసుకున్నాక మరమరాలు కూడా అరగవు.

—రేలంగి వెంకటరామయ్య

* మితిమీరిన తిండి మెదడనూ ఆత్మనూ చంపివేస్తుంది
చాలీచాలని కూడు శరీరాన్ని నశింపచేస్తుంది.[1]

— బైబిలు

## ఇంగ్లీషు

* ఏ ఇంగ్లీషు అక్షరమైనా దాని ఇష్టం వచ్చినచోట దాని ఇష్టం వచ్చినట్లు పలుకుతుంది తప్ప నీ ఇష్టం వచ్చినట్లు పలకనే పలకదు. —విశ్వనాథ సత్యనారాయణ

## ఇంద్రియాలు

* ఇంద్రియములు తమకు కనిపించినట్లు తెలుపునేగాని ఉన్నట్లు చూపలేవు. —సత్యసాయిబాబా

* కుండలోనున్న నీరు యావత్తూ ఒకే ఒక రంధ్రము గుండా కారిపోగలదు. అట్లే మానవుడు తన యొక్క ఇంద్రియములలో ఒక్కదానిని అదుపులో ఉంచుకొనక పోయినను అతని పతన మచటినుండియే ఆరంభమగును. —మనువు

---

1 **Too much bread kills the mind and the spirit as surely as too little destroys the body. — Bible**

* శబ్ద, స్పర్శ, రూప, రస, గంధము లను నైదింటిలో శబ్దమునకు లోబడి లేడి, స్పర్శమునకు లోబడి ఏనుగు, రూపమునకు లోబడి మిడత, రసమునకు లోబడి తుమ్మెద, గంధమునకు లోబడి చేప నశించుచున్నవి. మానవుడీ అయిదింటికి లోబడి నశించుననుటలో అచ్చెరువేమియు లేదు.

—మహామంత్రి చాణక్యుడు

* ఇంద్రియలోలుని ఆ ఇంద్రియాలే ఆరగిస్తాయి.

—భారతములో విదురనీతి

**ఇల్లాలు**

* అలయాన వెలసిన ఆ దేవునిరీతి
ఇల్లాలే ఈ జగతికి జీవనజ్యోతి —"దేవత" చిత్రంనుండి

* నారిలేని యిల్లు
నారిలేని విల్లు —పెద్దబాల శిక్ష

**ఇష్టము**

* తన కంపు తన కింపు. —సామెత

* నీకిష్టమైన పని లభించకపోతే, లభించిన పనిని ఇష్టమైనదిగా చేసుకో.[1] —ఆంగ్లసూక్తి

---

[1] If you cannot get the work you love, love the work you get.

* శబ్ద, స్పర్శ, రూప, రస, గంధము లను నైదింటిలో శబ్దమునకు లోబడి లేడి, స్పర్శమునకు లోబడి ఏనుగు, రూపమునకు లోబడి మిడత, రసమునకు లోబడి తుమ్మెద, గంధమునకు లోబడి చేప నశించుచున్నవి. మానవుడీ అయిదింటికి లోబడి నశించుననుటలో అచ్చెరువేమియు లేదు.

—మహామంత్రి చాణక్యుడు

* ఇంద్రియలోలుని ఆ ఇంద్రియాలే ఆరగిస్తాయి.

—భారతములో విదురనీతి

**ఇల్లాలు**

* ఆలయాన వెలసిన ఆ దేవునిరీతి
ఇల్లాలే ఈ జగతికి జీవనజ్యోతి —"దేవత" చిత్రంనుండి

* నారిలేని యిల్లు
నారిలేని విల్లు —పెద్దబాల శిక్ష

**ఇష్టము**

* తన కంపు తన కింపు. --సామెత

* నీకిష్టమైన పని లభించకపోతే, లభించిన పనిని ఇష్టమైనదిగా చేసుకో.[1]

—ఆంగ్లసూక్తి

---

[1] If you cannot get the work you love, love the work you get.

* గొప్పవారికి వ్రతమే సుఖము ; తుచ్ఛులకు సుఖమే వ్రతము.
—కట్టమంచి రామలింగారెడ్డి

(చూడుము : సజ్జనులు. మహాత్ములు)

## ఉత్సాహం

* అగ్నిపర్వతం లాంటిది ఉత్సాహం
మొలవదు దానిపై ఏ సందేహం
—ఖలీల్ జిబ్రాన్ (అనువాదం : సినారె)

* హుషారు అనేది అగ్నిహోత్రం వంటిది. దానిని ఎప్పుడూ ఎగసన తోస్తూవుండాలి, ఒకకంట కనిపెడుతూ వుండాలి.
—ఆంగ్లసామెత

* చూచిరమ్మంటే కాల్చివచ్చినట్లు. —సామెత

## ఉద్రేకములు

* ఉద్రేకములు నిప్పు, నీరు వంటివి. చక్కని సేవకులు, కాని చెడ్డ యజమానులు. —ఆంగ్లసామెత

## ఉద్యోగులు

* ఉద్యోగులంతా ఫస్టుతారీకు గోత్రీకులు.
—రావూరు సత్యనారాయణరావు

* స్వేచ్ఛగల జైలు ఉద్యోగం.
—ఉమాపతి పద్మనాభశర్మ

## ఉన్నతలక్ష్యం

* గురిచూసి గుంటనక్కను కొట్టేకన్నా గురితప్పినా పులినేకొట్టు.
—సత్యసాయిబాబా

* చావుకు పెడితే గాని లంఖనాలకు దిగదన్నట్లు.
—సామెత

## ఉపకారం

* మానవులకు సహాయము చేయుము ; కాని వారి స్వీయ శక్తి నశింపచేయకుము. —అరవింద ఘోష్

* ఉపకారం చేయలేనివాడు గూడ చేయగల గొప్ప ఉపకారం అపకారం చెయ్యకపోవడం.
—ఉమాపతి పద్మనాభశర్మ

* మంచివారికి స్వల్పమైన మేలు చేసినను ఉత్తమమైన ఫలితం వస్తుంది. దుష్టులకు అధికమైన ఉపకారం చేసినను దాని వలన ప్రమాదకరమైన దుష్ఫలితమే వస్తుంది. ఆవుకు గడ్డివేసినను మధురమైన క్షీరము నిస్తుంది. సర్పమునకు పాలు తెచ్చి పోసినను అది విపత్కరమైన విషాన్నే యిస్తుంది. అందుచేత అర్హత అనర్హతలను పరిశీలించి మేలు చేయవలెను.
—సంస్కృతసూక్తి

* అపకారికి నుపకారము
నెపమెంచక చేయువాడు నేర్పరి సుమతీ
—సుమతీ శతకము

* కూడు పెట్టక పోతేమానె కుక్కను కట్టెయ్యమన్నట్లు
—సామెత

## ఉపన్యాసం

* ఉపన్యాసాలివ్వడం బిడ్డల్ని కనడంలాంటిది. సంకల్పించడం తేలిక, వెలువరించడం కష్టం.[1]
—ఒక ఆంగ్లరచయిత

## ఉపాధ్యాయుడు

* జన్మనిచ్చినందుకు తల్లిదండ్రులకు ఋణపడ్డాను; ఆ జన్మ సార్థకతకు దారిచూపిన ఉపాధ్యాయునికి మరింత ఋణపడ్డాను.[2]
—అలెగ్జాండర్ చక్రవర్తి

* బుద్ధి చెప్పువాడు గ్రుడ్డితే నేమయా ? —వేమన

* విద్యార్థులకు ప్రశ్నలు వేయడం నేర్పిన గురువే ఈ కాలంలో నిజమైనగురువు. తరగతికీ జీవితానికీ వారధికట్టే టీచరే టీచరు.
—కొండముది శ్రీరామచంద్రమూర్తి

* ఉపాధ్యాయుడు ఇస్తాడు; విద్యార్థి స్వీకరిస్తాడు. అయితే మొదటి వానివద్ద ఇవ్వటానికంటూ ఒకటుండాలి, రెండవవాడు స్వీకరించడానికి సిద్ధంగా వుండాలి. —స్వామి వివేకానంద

---

1 Speeches arc like babies – easy to conceive and difficult to deliver. —Anon

2 I am indebted to my parents for my living and to my teacher for living well. — Alexander

* ఉపాధ్యాయుడు తానింకా నేర్చుకుంటూవుంటేతప్ప యదార్థంగా చదువు చెప్పలేడు. దీపం తాను వెలుగుతూ ఉజ్జ్వలంగా వుంటే తప్ప మరొక దీపాన్ని వెలిగించలేదు.

—రవీంద్రనాథ్ టాగోర్

* ఒక విద్యార్థి చెడిపోతే దానివలన అతడే పాడౌతాడు. ఒక ఉపాధ్యాయుడు క్రమశిక్షణతో విధి నిర్వర్తించకపోతే వేలమంది విద్యార్థులు చెడిపోతారు. —శ్రీ సత్యసాయిబాబా

* ఈ శతాబ్దంయొక్క దురదృష్టమేమిటంటే, నేర్చుకోవడం మాని వేసిన వాళ్ళు బోధించడ మారంభిస్తున్నారు.

—జార్జి బెర్నార్డుషా

* బడిపంతులుకి స్థిరాస్తి భార్య, చరాస్తి తనే ... బడిపంతులికి నమ్మకంగా వచ్చే సాలాదాయం ఒక అదశిశువు, కొండొకచో కవలలు ! ..... ..... సన్యాసి అయినవాడు మేష్టరీకి తంగున సరిపోతాడు. —భమిడిపాటి కామేశ్వరరావు

* చెఱసాలవలె, శత్రువువలె, ఆకలి గూడ ఉత్తమ బోధకుడు.[1]

—బెనిటో ముస్సోలినీ

* ఎట్టి అధ్యాపకుడో అట్టి విద్యార్థి తయారవుతాడు.

—శ్రీ సత్యసాయిబాబా

---

[1] Hunger, like prison and enemy, is a good teacher.

—Benito Mussolini

## ఉపాయం

* పిల్లి నక్కకు అన్నీ చెప్పి చెట్టెక్కడం చెప్పలేదట.

—సామెత

* శతకోటి దరిద్రాలకు అనంతకోటి ఉపాయాలు. —సామెత

* పై పంటలకు పన్నంటే వేరుశనగ వేశాడు, కింది పంటలకు పన్నంటే ధాన్యం వేశాడు. —సామెత

## ఎక్కువ తక్కువలు

* శరీరంలో తల పైభాగంలో వున్నది కాబట్టి ఎక్కువా కాదు. పాదాలు నేలను తాకుతూవుండడంవల్ల తక్కువా కాదు.

—మహాత్మాగాంధి

## ఐకమత్యం

* మనదు శక్తి యైకమత్యము బొందక
యలతి పగతునైన నణచు టెట్లు
'లెన్ను'నందు బడక రెండుజాముల యెండ
కడగి దూదినైన గాల్పఁ గలదె?

—ఆదిభట్ల నారాయణదాసు

* కలిసివుంటే కలదు సుఖం
చీలివుంటే చితికిపోతాం. —సూక్తి

* కసులు పోవువాడు కాళ్ళుపోయినవాడు
ఉభయులరయ గూడియుండునట్లు
పేద పేద గూడి పెనగొనియుందురు. — వేమన

* ఐక్యత మరియు స్వేచ్ఛ
  ఇపుడు మరియు ఎల్లపుడు
  ఏకము మరియు అవిభాజ్యము.[1]
  (అమెరికను అంతర్యుద్ధకాలంలో సమైక్యవాదుల నినాదం)

* కష్టసాధ్యమయిన కార్యమ్ము నెరవేర్చ
  నైకమత్యమే మహాబలము
  పావురములు వలను పైకెత్తుకొని పోవె —కరుణశ్రీ

* నీరు కొడితే రెండవుతుందా ? —సామెత
  (నీటిని కొట్టి విడదీయలేము. కలిసిమెలిసి వున్న వారిని విడదీయలేము.)

### ఐక్యరాజ్యసమితి

* ఐక్యరాజ్యసమితి ప్రపంచ రాజ్యాలచేత మాట్లాడిస్తూ వుంటుంది. అవి ఎంత దీర్ఘకాలం ప్రసంగాలతో గడిపితే ప్రపంచానికంత క్షేమం. ఎందుకంటే యుద్ధం అంతకాలమూ దూరంగాపోతుంది.
  —డాక్టర్ రాల్ఫ్‌బంచ్

* ఐక్యరాజ్యసమితి ప్రభుత్వాలనడుమ సంప్రదింపులకు ఉపకరణం; జాతుల నడుమ విరోధమను ఖడ్గపుటంచులను మొద్దుబారచేసే పరికరం: సామరస్యాన్ని సానుకూల పరచే సాధనం ; విరుద్ధ రాజకీయశక్తుల నడుమ వారధి. —ఆంథోని ఈడెన్

---

1 Unity and liberty
Now and forever
One and inseperable. —American Slogan

* రెండు చిన్న దేశాల నడుమ వివాదమేర్పడితే వివాదమంతరిస్తుంది; ఒక పెద్దదేశానికీ మరొక చిన్నదేశానికీ నడుమ వివాదముత్పన్నమైతే చిన్న రాజ్యమంతరిస్తుంది: ఒక పెద్ద రాజ్యానికీ మరొక పెద్దరాజ్యానికీ నడుమ వివాదం చెలరేగితే ఐక్యరాజ్యసమితి అంతరిస్తుంది.

(ఐక్యరాజ్యసమితి పనిచేయు తీరు తెన్నులను గురించి ఒక ఆఫ్రికన్ ప్రతినిధి వ్యాఖ్య)

**ఓటు**

* సీటు సంత సరుకైతే
ఓటు బూతు మరుగెందుకు ? —కాళోజి నారాయణరావు

* నోటున కోటు నమ్ముకొని నోటికి తాళము వేసికొన్న మా బోటి దరిద్ర మానవుల పొట్టన పెట్టుకొనంగవచ్చు.

—దాశరథి

* బ్రూటు కేసిన ఓటు
బురదలో గిరవాటు
కడకు తెచ్చును చేటు. —ఆరుద్ర

**కందుకూరి వీరేశలింగం పంతులు**

* తనదేహము తన గేహము
తనధనమును విద్యయు తన తపమును బలమున్
జనులకు వినియోగించిన
ఘనుడీ వీరేశలింగకవి జనులారా !

— చిలకమర్తి లక్ష్మీనరసింహం

## కట్నము

* వెండినాణెంబె పెనిమిటి వేశ్య ; కటులె
కట్నములె భార్యలిప్పటి కర్కశులకు !
వేశ్య వెలయాలనంబడె వెల గ్రహించి
కట్నముంచేత వెలమగల్ కారెపీరు ?

—కాళ్ళకూరి నారాయణరావు

## కథ

* కథ సాహిత్యంలో ఏ ప్రక్రియా చేయలేని సేవచేసింది. అది అపారం. అదే గనుక లేని పక్షంలో సంఘంలో జరిగే సంఘటనలకు, మానవ మనస్తత్వంలోని కొన్ని ఘట్టాలకు, జీవితంలోని కొన్ని విరుపులకూ సాహిత్యంలో చోటు వుండేదికాదు.

—త్రిపురనేని గోపీచంద్

* కథ కేవలం కల్పనైతే దేవకన్యకల కథ మాత్రమే అవుతుంది. కథ కేవలం వాస్తవికమైతే వార్తాపత్రికలలోని వార్తమాత్రమే అవుతుంది. రెండింటి సమ్మేళనమే ఉత్తమ కథా శిల్పం.

—ఎస్. సంజీవదేవ్

* ఒక్కొక్క కొత్తకథ చదవటం ఒక కొత్తవ్యక్తిని పరిచయం చేసుకోవడం లాంటిది. —కొడవటిగంటి కుటుంబరావు

* కథకు ఘటనా ప్రాధాన్యం ప్రాణం. ఘటనలేకుండా పాత్రల ద్వారా తమ సంభాషణలగుండా రచయిత చెప్పదలచుకున్న దానిని చెప్పించడం నాటిక అవుతుందేగాని కథకాదు.

తాను చెప్పదలచుకొన్నదేదో సంఘటనలద్వారా వ్యక్త పరచడమే నిజమైన కథాలక్షణం. సంభాషణల స్థానం కథలో రెండవదిగా వుంటేనే బాగుంటుంది. మొదటిదిగా వుండవలసినది ఘటనా వైశిష్ట్యమే. —ఎస్. సంజీవ్‌దేవ్

## కర్తవ్యం

* విధి నిర్వహణయే ఘనతకు మార్గము[1] —బైబిలు

* ప్రేమ నేలపై కనబడే పచ్చిక బయళ్ళలాగ మెత్తనిది. కాని కర్తవ్యం అడుగున దాగిన కఠినశిలలవలె నిష్ఠురమైనది.
—రవీంద్రనాథ్ టాగోర్

* నీవంతు పని నీవు చేయుము
అందులోనే యావత్తుగౌరవం ఇమిడియున్నది. —పోప్

* నీపని కేవలం తెలు ప్లాసింగును ఊడ్చడం మాత్రమేకావచ్చు. కాని ప్రపంచంలో మరెవరూ ఏ తెలు ప్లాసింగునూ ఉంచలేనంత పరిశుభ్రంగా నీవు దాన్ని ఉంచాలి. అది నీ కర్తవ్యం.
—మోక్షగుండం విశ్వేశ్వరయ్య

## కవి

* ఎవని బొమ్మలు మాటలో యతడు చిత్రకారుడగునట్లే, యెవని మాటలు బొమ్మలో యతడు కవి.
—పానుగంటి లక్ష్మీనరసింహారావు

---

[1] The path of duty is the way to glory —Bible

* మట్టి వి త్తనమంత చిన్న పద్యంలో మహావృక్షమంత అనుభవా న్నివ్వగలవాడు మహాకవి. — బైరన్

* ఋషికానివాడు కావ్యనిర్మాణం చేయజాలడు
(నానృషిః కురుతే కావ్యమ్)
— వేదము

* కవులు ప్రపంచం యొక్క గుర్తించబడని శాసనకర్తలు.
— షెల్లీ

* ఒక వట్టికర్ర ఫిడేలు కావాలంటే, ముందు అది ఎన్ని బాధలు పడాలి కత్తిచేతిలో! కవికి జీవితమే కత్తి.
— గుంటూరు శేషేంద్రశర్మ

* అందమైన అబద్ధం చెప్పేవాడు కవి. — ప్లేటో

* ఏ కవికైనను అతని సాహితీ సర్గమునకు ప్రధానములైన యుపాధులు నాలుగు : ఊహాశాలిత (**imagination**) అనుశీలనము (**observation**), విషయజ్ఞత (**information**), అనుభవము (**experience**). — డా॥ యస్వీ జోగారావు

* కవియు ఋషియు నొక్క గతినుందు; రిద్దఱు
నిర్వి కారులయ్యు దుర్వికార
దళిత లోకమునకు ద్రష్టలై బోద్ధలై
లగ్గు గూర్తురని తలంతునేను
— తుమ్మల సీతారామమూర్తి

* కవి ప్రాశస్త్యము సముచితోపమా సంఖ్యను బట్టి గ్రహింప వచ్చును. —పానుగంటి లక్ష్మీనరసింహారావు

* కవి వాక్కు నిలిచినంతకాలం తన కీర్తి నిలవదని ప్రతి రాజుకు చక్కగా తెలుసు. అందువల్లనే విజయస్తంభాలు ఎత్తించడం తోను, నగరాలను నిర్మించడంతోను సంతృప్తిచెందక కవులను దగ్గరికితీస్తాడు.... "భోజునివంటిరాజు కలిగితేకాళిదాసువంటి కవి అప్పుడే ఉంటాడు" అనడంతప్పు. కాళిదాసు కలిగితేనే భోజుడు ఉండడం. —నార్ల వెంకటేశ్వరావు.

* రాజు చేతి కత్తి రక్తంబు వర్షించు
సుకవి చేతి కలము సుధలు గురియు
అత దేలగలుగు యావత్ప్రపంచంబు
నీత దేలగలుగు నిహము పరము. —గుర్రం జాషువా

* కవి ఎవడు ? కళ్ళతో వినేవాడు. వేటిని ? పూల చిరునవ్వులను, వెన్నెలల నవ్వాదులను, వరదల ఆవేశాలను, తుపానుల ఉద్రేకాలను, అగ్ని అరుపులను, రక్తం పిలుపులను. ఇంతేనా మరి ? కవి అంటే ఇంకెవడు ? చెవులతో చూచేవాడు - గీతాలలో మండే దీపాలను, స్వరాలలో అంటుకునే రూపాలను, కాలిమువ్వల ఝుంకారాలలో కణకణ మండే జ్వాలలను.

—సి. నారాయణరెడ్డి

* ధైర్యమూ నీతీ రచయితకు రెండు నేత్రాలు. ఇవిలేని రచయిత గ్రుడ్డివాడు. గ్రుడ్డివాడి వ్రాతలు లోకానికి ఏ ఉపకారం చేయ గలవు ? —గుంటూరు శేషేంద్రశర్మ

* తత్త్వవేత్త కాకుండా ఏ వ్యక్తీ మహాకవి కాలేదు.[1]

—కోల్ రిడ్జి

* కవి నిరంకుశుఁ డనుటచేఁ గట్టుదప్పి
విఱ్ఱవీగు నటంచు భావింపరాదు
లాఁతు లేమందురో యన్న భీతిలేక
ధర్మమును జాటువాఁడని తలఁపవలయు

—తుమ్మల సీతారామమూర్తి

* పద్యం శబ్ద అర్థ ఛందస్సుల త్రివేణి అయితే, పాట సంగీత సాహిత్య రాగ లయ తాళముల పంచకళ్యాణి.

హృదయంలో నుంచి కదలటం, హృదయాలను కదిలించడం ఈ రెంటికీ సమాన ధర్మం. —'కరుణశ్రీ'

* సామ్యపరిజ్ఞాని కవి. భేదపరిజ్ఞాని వేదాంతి. సామ్యము తెలియనిదే భేదము తెలియకపోవుట నిజమే. భేదము తెలియనిదే సామ్యము తెలియకపోవుటయు నిజమే. కాని కవియందు సామ్యజ్ఞానము విశేషముగ నుండును. వేదాంతియందు విభేదభావము విశేషముగనుండును. ఇది స్థూలమైన నిర్వచనమని యెఱుగవలెను. —పానుగంటి లక్ష్మీనరసింహారావు

---

1 **No man was ever yet a great poet without being at the same time a profoundphilosopher–Coleridge**

* కవులూ రచయితలూ బతికినంతకాలం చచ్చినట్లు పడుంటి
చచ్చింతర్వాత బతకడమారంభిస్తారు.

—మునిమాణిక్యం నరసింహారావు

* కవులు ప్రజల చైతన్యానికి కరదీపికలు. ఆ కవి ఋషి గూడ
అయితే భావానికి నిండుతనం, మంగళమయ భావన ఏర్పడ
తాయి. —బండారు సదాశివరావు

* కవితకు మెప్పు, కాంతకు కొప్పు ఉండాలి. —సామెత

* కవుల కసలు లేదు బుద్ధి
అన్నవాడు మహాసుబుద్ధి
వ్యవహార జ్ఞాన శూన్యులు
అలౌకిక శిఖామణులు
ఆకాశ హర్మ్య నిర్మాతలు
గగన కుసుమ ఆఘ్రాతలు —కాళోజీ నారాయణరావు

* కవుల జీవితమ్ము కాంతారమగు, నందు
తేనెటీగ సుకవి, తేనె కవిత,
తేనె గ్రోలి పోవు తెరువరి ధన్యుండు.

— బండ్లమూడి సత్యనారాయణ

* కవి లోకమునకు శాసకుడు ; సనాతన ధర్మ బోధకుడు. ధర్మ మార్గమునుండి తప్పినపుడు, జనులను హెచ్చరించి సరియైన త్రోవకు త్రిప్పవలసిన బాధ్యత కవులకు ఉన్నది.

కవిని "క్రాంతదర్శి" యందురు. క్రాంతదర్శి యనగా ఇంద్రియాతీతములైన విషయములు తెలుసుకొనగలవాడని అర్థము.

—సత్యసాయిబాబా

* పదవులకును పెదవులకును మదిరా మాణిక్యములకు
లొంగిపోయి అమ్ముడువడు లోలుడెంత కవియైనా
ప్రవక్తయై భవ్యధర్మ భావన నిర్మింపలేడు
జాతిని కదిలించు అగ్ని గీతమ్ములు పలుకలేడు.

—డా॥ ప్రసాదరాయకులపతి

* ఆలోచనా సంగీతమే కవిత్వం. దాన్ని మనకు భాషా సంగీతం అందిస్తుంది.

—చాటిఫీల్డు

* నినాదాలకు జెడిరేవాడు చస్తే కవికాడు. వాడికి ఒకటేనినాదం-అంతరాత్మ నినాదం.

నినాదాన్ని వదలి నాదాన్ని ఆశ్రయించినవాడే కవి కవికి బయట ఎంత ప్రపంచం ఉందో, లోపల అంత ప్రపంచం ఉంది. కవి అన్నవాడు ఈ రెండు ప్రపంచాల్ని మోస్తూ, తన జీవయాత్ర చేస్తాడు, చెయ్యాలి. ఈ రెంటిలో దేన్ని చంపుకున్నా వాడు కవి కాడు, దొంగ అవుతాడు.

—గుంటూరు శేషేంద్రశర్మ

* కవులు పుడతారు, వక్తలు తయారవుతారు. —ఆంగ్లసామెత

* పాపము! కవియగు వానికేమి కావలయును? ధనమా? ఆ వ్రాత బ్రహ్మ యాతని నెత్తిపై వ్రాయనేలేదు. రాజ్యమా? ఏ రాజున కంత రాజసమున్నది? అతనిక్షి జ్వరితునివలె భోజనమక్కఱ లేదు. పిచ్చివానికివలె, పిపీలికకు వలె, నిద్రయైన నక్కఱలేదు.

అతనికి గావలసిన దొక్కటియే యున్నది. స్వగ్రంథ స్తుతి తప్ప మరేదియు నాతని కక్కఱలేదు. దానితో బాటు పరగ్రంథ నిందకూడ నున్నయెడల నింక గావలసినదేమున్నది? ఆవడలలో గొత్తిమిఱపు గమగమ యున్నట్లు, పానకములో మిరియపుబొడి చురుకున్నట్లు, ఆ గాలి యున్నంతసేపాతని కాకాశ గమనము. అది లేనియెడల నధఃపతనము. అతడు వట్టిగాలితిత్తి.

—పానుగంటి లక్ష్మీనరసింహారావు

* కవికీ కమ్మరికీ సీసం తేలిక. —సామెత

* 'కష్టజీవి'కి ఆచివర ఈచివర కాపుకాసేవాడే కవి.

—శ్రీరంగం శ్రీనివాసరావు

* "కవిః ఋతస్య పద్మభిః"

(కవి సత్యమను రథమునకు కట్టబడిన అశ్వము.)

—సంస్కృతసూక్తి

## కవిత్వము

* మనసు మల్లెపొదల్లోంచి పసందయిన వాసనలు పీచి, అవి పద్యాల సీసాల్లో అనంతకాలం నిలిస్తే కవిత్వం.

—దాశరథి

* బాధనుంచి కవిత ప్రభవించు - అందుకే
అక్షరమ్ము రాక ఐతి కవిని. —ఆత్రేయ

* శ్రావ్యమైన శబ్దము ద్వారా రమ్యమైన అర్థమును హృద్యమైన అనుభూతిగా పరిణమింప జేయునది కవిత్వము.
—డా॥ యస్వీ జోగారావు

* కవిత్వం అబద్ధానికి పుట్టిన ఆడపిల్ల. —అజ్ఞాత ఆంగ్లకవి

* కవిత్వం ఒక మెరుపు
కాదది పొడిమాటల కూర్పు
—ఖలీల్ జిబ్రాన్ (అనువాదము : సి. నా. రె)

* నగ్నసత్యం వేదాంతం
అలంకృత సత్యం కవిత్వం. —బోయి భీమన్న

* భావన కొకవిధమైన భ్రాంతిని కలిగించునట్లు పదముల నుపయోగించు కళయే కవిత్వము.[1] —గోల్డ్‌స్మిత్

* సాగి కమ్మెచ్చునన్ వచ్చు తీగ కరణి
సాలెపురుగు కడుపులోని నూలువలెను
దబ్బునన్ దొర్లిపడు కొండధార మాడ్కి
సహజకవిత బయల్వెడి సన్నుతిగను —ఆదిభట్ల నారాయణదాసు

---

[1] Poetry is the art of employing the words in such a manner as to produce an illusion on the imagination. —Goldsmith.

* అగ్ని జల్లినా అమృతం కురిసినా
అందం ఆనందం దాని పరమావధి
—దేవరకొండ బాలగంగాధరతిలక్

* కల నిజమతచటం కాదు కవిత్వం
నిజాన్ని కలగనడమే దాని తత్వం —ఆరుద్ర

* కవిత్వం రంగు రంగుల కలలకు రమణీయాక్షర కలాపం.
—మిరియాల రామకృష్ణ

* ఉత్తమ కవిత్వం ఆవిధంగా తప్ప మరో రకంగా వ్రాయడానికి
వలను పడనిది. —ఎమర్సన్

* అక్షరరూపము దాల్చిన
ఒకే ఒక్క సిరా చుక్క
లక్ష మెదళ్ళకు కదలిక. —కాళోజీ నారాయణరావు

* ఆవేశ మప్రయత్నముగా మూర్తీభవించియుండు పదములును
భావములునుగాక కవిత్వమనగా నింకేమి?[1] —జాన్ స్టువర్ట్ మిల్

* కవిత్వం వ్రాసేవాడికి **Constipation** ; చదివేవాడికి
**Perspiration**. —శ్రీ జి.వి.ఎన్. కామేశ్వరరావు

---

[1] **What is poetry but the thoughts and words in which emotion spontaneously embodies itself.**

**—John Stuart Mill.**

* ఎప్పుడూ కవిత్వం జ్ఞాపకానికి నిలవాలి. కాగితం చూచి చదవకుండా నోటితో చెప్పబడగలగాలి. ఒక మాటలగుంపు కవిత్వం కావడానికి అత్యవసరమైన లక్షణాల్లో ఇదొక ప్రధానమైన లక్షణం.

మరి ఈ జ్ఞాపకం పెట్టుకోబడే శక్తి ఎలావస్తుంది కవిత్వానికి? చెప్పదలచుకుంది సంగ్రహంగా, విశిష్టంగా, వింతగా ఉండాలి. సంగ్రహతలో బంధం వస్తుంది. విశిష్టతతో పోల్చుకో దగిన వ్యక్తిత్వం వస్తుంది. వింతలో 'వా' అనే వైచిత్రివస్తుంది.

ఇన్ని రాగానే దాన్నించి నీవు తప్పించుకోలేవు ; నీ నాలికెక్కి నాట్యంచేస్తుందది. కనకనే కవిత ఛందస్సుల నాశ్రయించింది, తొలి స్రష్టల ద్రష్టల వాక్కుల్లో. దాని చూడబడే రూపం కాగితమూ కలమూ ఇచ్చేదికాదు ; ద్రష్ట అయిన స్రష్టయొక్క తురీయస్థాయిలో ఆవిర్భవించేది. ఆ రూపాన్నే అక్షరాలద్వారా చూస్తున్నాడు ఇప్పుడు పాఠకుడు.

—గుంటూరు శేషేంద్రశర్మ

* కప్పి చెప్పేది కవిత్వం
విప్పి చెప్పేది విమర్శనం. —సి. నారాయణరెడ్డి

* కదిలేదీ కదిలించేదీ
మారేదీ మార్పించేదీ
పాడేదీ పాడించేదీ
పెనునిద్దర వదిలించేదీ

మునుముందుకు సాగించేదీ
పరిపూర్ణపు బ్రతుకిచ్చేదీ
నవకవనానికి ధ్యేయం కావాలి. —శ్రీరంగం శ్రీనివాసరావు

* గొప్ప కవిత్వం ప్రధాన లక్షణ మేమిటంటే, ఎవరి తాహతును బట్టి వారికి ఎంతో కొంత అనుభూతిని అందించగలగడం.
—చలం

* కవిత్వం అంటే "The pains of turning the blood into ink" అంటాడు టి ఎస్. ఇలియట్. రక్తాన్ని సిరాలోకి మార్చే బాధ. కవితారచన అంటే. ఉర్దూలోగూడ ఇదే మాదిరి వాక్యం వున్నది. "కాగజ్‌పై రఖ్ దియాహై కలేజా నికాల్ కే" అని. గుండెకాయను తీసి కాయితం మీద వుంచేశాడట కవి. ఈ పద్ధతి ప్రకారం చూస్తే కవితకు ఆవేశంతో గూడిన అనుభూతి ప్రధానమని తెలుతుంది. —ఎస్. సంజీవదేవ్

* రసం కొఱకు కాదు కవిత రతివర్ణన కొఱకు కాదు
తూగుటుయ్యలపై వ్రాసే దసలే కవితకాదు-
సగం తిన్న కడుపుతోడ చెట్టుక్రింద కౌపీనపు
బట్టమాత్రమే ధరించి భ్రాంతిదాటి క్రాంతి దృష్టి
విశ్వాసానికి సందేశం విన్పించే ఋషి వయ్యని
'ధ్వని' పరివేషంగాగల ధర్మంచే 'కావ్యాత్మ' గ,
వ్రాయబడ్డవే నిజమగు విశ్వకావ్యమ్ములని చాటెద.
—ముదిగొండ శివప్రసాద్

* వ్యుత్పత్తి, భావనాబలం, శిల్పం ఈ మూడూ నిరాకారాలకు ఆకారాలు పోస్తాయి. సొంత అనుభవం సాహిత్యానికి పునాది. నమ్మాలి తప్పదు. అనుభవాలకు రెక్కలు వస్తాయి. —దాశరధి

* కవితా యద్యస్తి రాజ్యేన కిమ్
(కవిత్వమున్నవో రాజ్యమెందుకు ?) —సూక్తి

* సమస్తలోక మంగళకరమైన సత్యమును కమ్మని వాక్కుల నిర్భయంబుగా పలుకునదే కవిత్వము —గుఱ్ఱంజాషువ

* ప్రశాంతిలో జ్ఞాపకం చేసుకొనే ఆవేశంనుంచి మంచి కవిత్వం ప్రభవిస్తుంది. అది శక్తిమంతమైన భావాల సద్యః స్రవంతి[1]
— వర్డ్స్‌వర్త్

* కావ్యం ఏదైనా సరే కనీసం ఒక రిక్వైర్‌మెంట్
కావాలి కవిత హృదయానికి నరిష్మెంట్
కారాదు ఏనాడు మెదడుకి పనిష్మెంటు. —ఆరుద్ర

* అమృతానికి ఆమ్రేడితం కవిత్వం అని తెలిసిఉంటే రాక్షసులు దేవతల్తో తగాదా పడేవాళ్ళే కాదు. మానవుల్తో మైత్రి నెరపి, కవిత్వాన్ని అనుభవించేవాళ్ళు ....ఇక్కడ అకాలంలోనైనా వసంతం చివుళ్ళెత్తుతుంది. ఆకురాలిన అంతరాల్లో పునఃనవత్వం మొగ్గ తొడుగుతుంది. —దాశరధి

---

1 Poetry is the spontaneous over flow of powerful feelings. It takes its origin from emotion recollected in tranquility. —Words Worth

* బాధకు పర్యాయ పదం కవిత్వం. —శ్రీరంగం శ్రీనివాసరావు

* స్థూలంగా చెప్పదలిస్తే ఉత్కంఠ రేపి, హృదయాన్ని స్పందింప జేసి, తన్మయత్వం కలిగించి కళాత్మకమైన మరపురాని ఒక శాశ్వత ముద్రను వేయగలిగే భావ సౌందర్యమే కవిత్వం.
—ఉమాపతి పద్మనాభశర్మ

* అన్యభాషల్లోకి అనువదించడం సాధ్యం కానప్పుడే అది గొప్ప కవిత. —బేకన్

* నాగరికత అభివృద్ధి చెందినకొద్దీ కవిత్వం దాదాపు తప్పని సరిగా క్షీణిస్తుంది. — మెకాలే

* కవిత్వం సైన్సు,
కారాదు కవిరచన కఠినమైన ధీసిస్సు,
కావాలి అది ఎడారిలో ఒయాసిస్సు,
అనుభవాల తేట సరస్సు. —ఆరుద్ర

* అంత్య ప్రాసలు వేసినంత మాత్రాన ప్రోజైక్ భావం పొయెట్రీ అవదు. కవిత్వం ఒక ఆల్కెమీ, దాని రహస్యం కవికే తెలుసు.
—దేవరకొండ బాలగంగాధరతిలక్

* కవిత లేని నోళ్లు
చవియు లేని కూళ్ళు. —పెద్దబాలశిక్ష

* పాపిష్ఠిరాజుల పాలి దయ్యమ్ము సం
ధ్యావందనమునకు బావగారు
పరదేశ సంచార కరణమ్మునకు రైలు
జపతపమ్ముల కెల్ల సవతి తల్లి
ముక్తికాంతా సంగమునకుఁ దారువుకత్తె
సద్యశో వ్యాప్తికిఁ జాటుదప్పు
ఆనందమునకు దివ్యాంగనా సంగంబు
రాజసంబునకు గారాలకూచి
భాగ్య భోగ్యమ్ములకు నెల్ల బట్టుకొమ్మ
అఖిల వేతృత్వమునకు దివ్యాంజనమ్ము
సరస జనులకుఁ గర్ణ రసాయనంబు
కవిత యిట్టిదియని చెప్పఁగా దరంబె? —తిరుపతి వేఁకటకవులు

* కవిత్వమునకు జీవకళ భావము, పద్యము శరీరమాత్రము.
—కట్టమంచి రామలింగారెడ్డి

## కష్టాలు

* మంచికై పాటుబడే వారిని కష్టాలు తప్పక ఎదుర్కొంటాయి. మునిగిపోతున్న వ్యక్తిని రక్షించడానికి ప్రయత్నించే వాడిని గూడ మునిగిపోయేవ్యక్తి బలవంతాన తనబరువుతో అట్టడుగుకు తీసుకొని పోతాడు. —గురూజీ గోల్వాల్కర్

* కష్టమునకు తగిన ఫలము లభించిన కష్టము తెలియదుగదా.
— కాళిదాసు

(క్లేశః ఫలే నహి పునర్నవతాంవిధత్తే—కుమారసంభవం)

* కష్టాలు ఒంటరిగా రావు. అవి అవకాశాలను వెంటతీసుకొస్తాయి[1]
—దాదారావ్ పరమార్థే.

* ఉక్కు—మనిషి యెవడొ ఊకమూట యెవడొ
కష్టకాలమందె స్పష్టపడును
ఉత్తవేళలందు ఉత్తము లందరు. —నార్ల వెంకటేశ్వరావు

* దురదృష్టాలు రెక్కలతో ఎగురుకుంటూ వస్తాయి. కాళ్ళతో నడుచుకుంటూ పోతాయి. —ఆంగ్లసామెత

* ప్రతి వ్యక్తికి ఎల్లప్పుడూ కొన్ని బాధలు, కష్టాలు అవసరం. ఓడలో అడుగున కొంత బరువు వెయ్యనిదే అది తిన్నగా నిలకడగా ప్రయాణం చేయలేదు. —షోపన్ హోవర్.

* పగటి ప్రొద్దు మిగుల ధగ ధగమని వెల్గు
కారుమబ్బు తెరలు కరగినంత :
కష్టమోర్చు పిదప కాంతి వర్షించురా
—బండ్లమూడి సత్యనారాయణ

* కష్టంనుండి బయటపడే ఏకైక మార్గం కష్టంగుండానే.[2]
—ఆంగ్లసామెత

---

[1] Difficulties do not come singly, but they come with opportunities. —Dadarao Paramardhe

[2] The only way out of a difficulty is through it.
—Proverb

* ఇష్టంలేనిదే కష్టం. —మాతృశ్రీ అనసూయాదేవి

* అసలే మూగ, అందులో మూర్ఛ అన్నట్లు. —సామెత

* కొంతకాలం మనిషికి కష్టాలు రావడం ఒకందుకు మంచిదే. తనమేలు కోరేవారెవరో, కీడు తలపెట్టే వారెవరో తెలుసుకో కల్గుతాడు. —అక్బరుకాలపు కవి రహీమ్‌ఖాన్

* కష్టాలు బలహీనుణ్ణి పడగొడతాయి, బలవంతుణ్ణి అభివృద్ధి పరుస్తాయి. —బి సి. ఫోర్బ్స్

* సంపదవల్ల అవగుణాలు బయటపడతాయి, కష్టాలవల్ల సుగుణాలు వెల్లడవుతాయి. —ఆంగ్లసామెత

* నిప్పు దేన్నయినా కాలుస్తుంది. కాని భార్యతో ఎడబాటు, జనుల వల్ల కలిగిన అపవాదు, తీర్చకుండా మిగిలిన అప్పు, చెడ్డవాని వద్ద కొలువు, దారిద్ర్యంలో వున్నపుడు తనకు ఇష్టమైనవారు రావటం-ఈ ఐదూ నిప్పులేకుండా దేహాన్ని, మనసును దహించి వేస్తాయి.[1] —సంస్కృతసూక్తి

* రత్నమును రాపిడిలేకుండా మెరుగు దిద్దలేము, ఏ మనుష్యుడు కష్టాలు పడకుండా ఉత్తముడు కాలేడు —చైనాసామెత

---

1 భార్యావియోగశ్చ జనాపవాదో
ఋణశ్చ శేషః కుజనస్య సేవా
దారిద్ర్యకాలే ప్రియదర్శనంచ
వినాగ్ని నా పంచ దహంతి కాయమ్ (చిత్తమ్)

* సులభం కాకపూర్వం అన్ని పనులూ కష్టమైనవే. —సామెత

* కాలిన లోహం కలిసిపోయినట్లు కష్ట సమయంలో మనుష్యుల మనస్సులు ఒక్కటవుతాయి. —కోల్టన్

* మన కష్టాలు మనకి ఉన్నంత బాధగా ఆవతలినుంచి చూసే వాళ్ళకి వుండవు. —ఇచ్ఛాపురపు జగన్నాథరావు

* దరిద్రుడు తల కడగబోతే వడగళ్ళవాన కురిసిందట.—సామెత

* తాలుధాన్యమేదో, మేలుధాన్యం బేదో
పంటకళ్ళ మెరుక పరచు భంగి
ఎవడు హితజనుండో యిబ్బంది బోధించు
—బండ్లమూడి సత్యనారాయణ

* కాలే కడుపుకు మండే గంజి. —సామెత

* పెద్దవారివల్ల చెప్పుదెబ్బలు తినవచ్చుగాని మంచివారివల్ల మాట కాయడం కష్టం. —గురజాడవారి 'కన్యాశుల్కం' నుండి

## కళ

* కళకు అనుకరణము సాధనము ; సాధ్యము చిత్తైకాగ్రత ; దాని ఫలము శాంతి. —రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ

* ఎరుకను కలుగజేయునది విద్య. అందము గొలుపునది కళ. ఈ అర్థమున విద్యలు మానవునకు జ్ఞానప్రదములు కాగా కళలు వాని జీవితమును సుందర మొనర్చునవి. —పింగళి లక్ష్మీకాంతం

* లలిత కళలందు ఏ విధమైన ప్రవేశం గాని, కనీసం ఆసక్తి గాని లేనివాళ్ళు మనుష్యులైనా, తోకలు కొమ్ములు లేని జంతువులే. —అరవింద ఘోష్

* భావన రూపం దాలిస్తే కళ అవుతుంది. —ఎస్. సంజీవదేవ్

* ప్రతి కళయును కొన్ని భావములను జూపి మఱి కొన్నింటిని మీరే యూహించుకొనుడని తనకు చేతకాక మనకు వదలిపెట్టును.
—రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ

* సహజత్వానికి అతి దగ్గరగానూ,
అసహజత్వానికి అతి దూరంగానూ ఉండేదే నిజమైన కళ.
—అక్కినేని నాగేశ్వరరావు

* ప్రకృతికి అద్దము పట్టుటకాదు కళయొక్క పని. ప్రకృతి పునాదిపై నిర్మితమైన సౌందర్య భావసౌధములో నున్నది కళయొక్క వైభవము. —డా॥ యస్వీ జోగారావు

* కనిపించేదానికీ కనిపించనిదానికీ నడుమ వంతెనయే కళ.
—బందా కనకలింగేశ్వరరావు

* కళ యేదో నన్నడుగు
వ్యక్తంనుంచి అవ్యక్తంలోకి
వేసే ఒక అడుగు —ఖలీల్ జిబ్రాన్

* ప్రకృతిలో భగవంతుడు భాసిస్తాడు, కళలో మనుష్యుడు.
—లాంగ్‌ఫెలో

* ఈ పరిగెత్తే జీవితాన్ని నిమేషమాత్రం అద్దంలో చూపగలగడం కళ. —మాలతీచందూర్

* మనుష్యునియొక్క చెయ్యి, మెదడు, హృదయం - ఈ మూడూ కలిసి నడుచుకొనే తావు 'కళ'[1] —రస్కిన్

**కళాకారుడు**

* తన మనస్సుకు స్వేచ్ఛనివ్వడం కోసమే కళాకారుడు సృష్టికర్త అవుతున్నాడు. కళాకారుడు ఒక్కడే ప్రపంచంలో స్వేచ్ఛాజీవి. —సోమర్ సెట్ మామ్

* తన జీవితములో కళను సృజించువాడే నిజమైన కళాకారుడు —స్వామి సుందర చైతన్యానంద

**కాపట్యం**

* నోరు మాట్లాడితే నొసలు వెక్కిరిస్తుంది. —సామెత

* కడుపులో కత్తెర, నోటిలో చక్కెర. —సామెత

**కాఫీ**

* పౌడిత్రయంలో కాఫీ జ్యేష్ఠురాలు. అన్నం ఆప్షనల్, కాఫీ కంపల్సరీ, అన్నాదొక కాఫీకారుడు. అప్పుడేనైనా అరకప్పు కాఫీత్రాగాలి అని ఒక కాఫీరాయుడు శాసించాడు. అన్నప్రాశనమాని కాఫీప్రాశన చేయాలి పాపాయిలందరికీ నన్నాడొక కాఫీ

1 Fine art is that in which the hand, the head, and the heart of man go together. —Risnku

ప్రియుడు. అన్నమో రామచంద్రా అని అరవటం మాని కాఫీ కాళహస్తీశ్వరా అని కాఫ్యార్తుల నిరంతర నినాదం.

—పుచ్చా పూర్ణానందం

## కామము

* కామాతురాణాం న భయం న లజ్జా
(కామాతురునికి భయముండదు, సిగ్గుండదు.) —సూక్తి

* కామవ్యాపారము దోషములను చూడదు.
(న కామ వృత్తిః వచనీయం ఈక్ష్యతే) —కాళిదాసు

* ఆడదాని జూడ నర్థంబు జూడ
బ్రహ్మకైన బుట్టు రిమ్మ తెగులు — వేమన

* ఒక సన్యాసిని "మీరు కామమును ఎట్లు జయించితిరి ?" అని ఎవరో అడిగిరట "కామము నా మనోద్వారము కడకువచ్చి తలుపు తట్టినపుడు ఏదో కార్యమున నిమగ్నుడనై యుండుటచే దానికి విసుగుబుట్టి తిరిగిపోయెడిది" అని ఆయన బదులు చెప్పెనట. —కంచి కామకోటి స్వామివారు

* వలపు సిగ్గెరుగదు. —సామెత

## కార్యసాధకుడు

* చేతనగువాడు కార్యము
కై తగ్గును వంగుగాక యల్పుండగునా ?
ఏతము చడి దా వంగును
బాతాళము నీరు దెచ్చి బయలం జల్లున్. —పూర్వకవి

* అగ్నిని తలక్రిందుగా పట్టుకొనినను దాని జ్వాలలు పైకే ప్రసరించును. అట్లే కార్యశూరునికి ఇక్కట్టులు కలిగినను వాని ధైర్యగుణము సడలదు. —భర్తృహరి

* పుష్పమాలికలు గట్టువాడు పువ్వులను కోయు విధమునను, తుమ్మెదలు పువ్వులలోని మకరందమును గ్రహించునట్లు ఎదుటి వానికి బాధలేకుండ పనులు సాధింపవలెను బొగ్గుల కొరకు చెట్టును నరికినట్లు మొదలంట పొడుచుట తగదు

—భారతంలో విదురనీతి

* కార్యసాధకుడు తన పనిని సాధించుకొనుటలో అల్పుల సహకారము పొందుట తప్పుకాదు. కృష్ణుడు జన్మించినపుడు వసుదేవుడు ఓండ్రపెట్టవలదని గాడిద కాళ్ళు పట్టుకొనలేదా ?

—భాస్కర శతకము

* కార్యసాధకుడైన వాడు శరీర సుఖముల కొరకు ప్రాకులాడడు. కష్ట సుఖములను లక్ష్యపెట్టడు. అతనొకప్పుడు నేలమీద పరుంటాడు; లేదా మృదువైన శయ్యపై నిద్రిస్తాడు. రుచిలేని ఆకులలములు తింటాడు; లేదా రుచికరమైన మృష్టాన్నాన్ని ఆరగిస్తాడు. ఒకమారు చింపిరిగుడ్డలు ధరిస్తాడు; లేదా మరొకమారు పట్టు పీతాంబరాలు ధరిస్తాడు. కార్యశూరుడు కష్ట సుఖాలను లెక్కచేయడు. —భర్తృహరి

* నిజంగా విలువైన పని ఏది చేయవలెనన్నా కేవలం హేతువును మాత్రమే సంతృప్తి పరిస్తే చాలదు. హృదయాన్ని గూడ కదిలించాలి. —మహాత్మాగాంధీ

* తొందరపడి యేపనియు చేయరాదు. అవివేకము సకలఆపదలకు నిలయము. సంపదలు గుణవంతుని నభిమానించును. విమర్శ చేసి కార్యము నాచరించువానిని సంపదలు వానియంతట నవియే వచ్చి వరించును.[1] —భారవి-కిరాతార్జునీయము

* అనాసక్తుడును, గర్వోక్తిరహితుడును, ధైర్యోత్సాహ సమన్వితుడు, లాభనష్టములచే హర్షవిషాదములను చెందనివాడును అగు కర్త సాత్త్వికుడు. —భగవద్గీత 18 అధ్యా-26 శ్లో

* ఈగది చీచటిగావున్నది, ఒక కిటికీ తెరుద్దామని మామూలుగా చెపితే మనుషులు ఒప్పుకోక ప్రతిఘటిస్తారు. గదిమీద కప్పు ఊడపీకేస్తామని హెచ్చరిస్తే రాజీబేరానికి వచ్చి కిటికీ తెరవడానికి అంగీకరిస్తారు —రూసిన్ అను చైనాతత్త్వవేత్త

* "క్రియా సిద్ధి స్సత్వే భవతి మహతాం నోపకరణే" (గొప్పవారు పొందెడి కార్యసాఫల్యము వారు గ్రహించిన ఉపకరణములవలనగాక కేవలము వారిసత్వమువలననే సిద్ధించును.)

* మనుష్యుడు తననుతాను ఎంతగా మరచిపోతాడో. అతనిలోని శక్తులు అంతగా వెలువడుతాయి. —ఏకనాథ రానడే

(చూడుడు : పని)

---

[1] సహసా విదధీత న క్రియా
మవివేకః పరమా పదాం పదం
వృణుతే హి విమృశ్యకారిణం
గుణలుబ్ధాః స్వయమేవ సంపదః

కాలము

* నీకోసం కాలం ఆగదు అని తెలియజేసే సాధనం గడియారం.
—గోళ్ళమూడి గోపాలకృష్ణమూర్తి

* కాలమును బోలిన ఘనబోధకు డుండబోడు.
—పర్షియన్ సామెత

* నేను రాజ్యాలను కోల్పోవచ్చుగాని కాలమును కోల్పోజాలను.
—నెపోలియన్ బోనాపార్టి

* గంగానది మొదట 'ఒకదేవత', తర్వాత పడవల రస్తా, పిదప మన పొలాల్లోకి పారే ఒక పంటకాలువ ! కాలం చేతుల్లో దేవతల రూపాలుకూడా మారుతాయి.
—గుంటూరు శేషేంద్రశర్మ

* కోతల కాలంలో ఎలుకకు ఏడుగురు భార్యలున్నా ఫరవాలేదు.
—సామెత

* కాలమెప్పుడూ సత్యనిరూపణకు మారుపేరు.
—మాలతీ చందూర్

* బంగారులేడియొక్క పుట్టుక అసంభవమైన విషయము. అయినను శ్రీరాముడు మృగము కొరకు లుబ్ధుడయ్యెను. విపత్సమయము సంప్రాప్తించినచో పురుషులయొక్క బుద్ధులుగూడ మలినములగును.
—ఒక సంస్కృతకవి

* నిరీక్షకులకు కాలగమనం అతిమందం
భయసంశయాత్ముల కది కడువేగం

వ్యధాభరితులకు కాలం దీర్ఘాతి దీర్ఘం
ఆనందపరవశుల కది స్వల్పాతి స్వల్పం
కాగా, ప్రేమ స్వరూపులకు కాలం అనంతం

—ఒక అజ్ఞాత కవి

* కాని కాలంవస్తే పైబట్ట పామై కరుస్తుంది. —సామెత

* కాలం చెఱసాలలో ప్రతివాడూ బందీ అయిన అస్వతంత్రుడు.
—పేర్వారం జగన్నాథం

* మనం కాలాన్ని కొలవగలిగింది మార్పుతోనూ, నూతనానుభవాలతోనూ మాత్రమేగద. —కొడవగంటి కుటుంబరావు

* మనిషిలో ఒక సర్పం ఉంది - కాలం. బయటవాడు జీవితంతో పోట్లాడుతూ ఉంటే, ఇది లోపల మృదువుగా కాటువేస్తూ ఉంటుంది. విషం మెల్లగా ఎక్కుతూ ఉంటుంది. ఒకచేత్తో వాడు గెల్చింది మరొకచేత్తో కోల్పోతాడు, చివరికి.
—గుంటూరు శేషేంద్రశర్మ

* కాలాన్ని మించిన నియంత లేదు. —గోల్డ్‌స్మిత్

* లేడికి కాలంవచ్చి కట్టుబడిందేగాని కాళ్ళులేక కట్టుబడలేదు.
—సామెత

* మానవుడు ఉదయము కాగానే ద్రవ్యసంపాదనకై తిండిసౌఖ్యమునకై ఆతురతపడుచుండును. రాత్రికాగానే పడక సౌఖ్యమునకై సంతోషించుచుండును. కాని తన ఆయువులో ఒక పగలు, ఒక రాత్రి తగ్గుచున్నదని విచారించుటలేదు. —కబీరు

* కృష్ణుడు ఎవని మేనమామో, ధనంజయుడు ఎవని తండ్రో, అట్టి అభిమన్యుని ప్రాణములు పోయినవి. కాలము ఎట్టి కుటిలగమనము కలది !
—సంస్కృతకవి

* కాలం అనే చిత్రకారుడు ఋతుచిత్రాలు గీయడానికి అడవి ఒక కాన్వాసు.
—గుంటూరు శేషేంద్రశర్మ

* కాని కాలంలో పైబట్ట పక్షులెత్తుకు పోయాయి.
—నలమహారాజునుగురించిన సామెత

* కాలానికి ఒకరూపం లేదు, దానికి పాపంలేదు
కాలం అద్దంలాంటిది
అంధయుగమైనా స్వర్ణయుగమైనా అది మన ప్రతిబింబం.
—దేవరకొండ బాలగంగాధరతిలక్

* కాలముకంటె విలువైనదిలేదు; అంతకంటె విచ్చలవిడిగా వృధా చేయబడేదిలేదు.
—ఆంగ్లసామెత

* ఆహా, కాలమా !
మరణించిన వారికి ఘనత చేకూర్చుతావు
శిథిలమైన వాటికి అలంకరణ కలిగిస్తావు
గుండెవిచ్చి రక్తం వరదలై పారేటపుడు
సేదదీర్చి పిపుతట్టి ఆశ చిగురింపజేస్తావు
మా నిర్ణయాలు తప్పయినపుడు సరిదిద్దేది నీవే.
— బైరన్

## కీడు

* అప్పుచేసి చేయు వైభవము, ముసలి భర్తకు వయసు భార్య, మూర్ఖుడుచేయు తపస్సు, తప్పు అరయని రాజుయొక్క పాలన, కీడు తెచ్చి పెడుతాయి. —సుమతీశతకము

* అజ్ఞానం కన్న నిర్లక్ష్యం ఎక్కువ కీడుచేస్తుంది.
—బెంజమన్ ఫ్రాంక్లిన్

## కీర్తి

* మనిషికి కీర్తి రావడమైతే క్రమక్రమంగా వస్తుంది గాని అపకీర్తి మాత్రం ఉప్పెనలా వచ్చి పడుతుంది.
—మధురాంతకం రాజారాం

* వీరకార్యములయొక్క పరిమళమే కీర్తి. —సోక్రటీస్

## కుమారుడు

* కుమారుని ఐదేళ్ళ ప్రాయము వరకు ప్రేమతో పెంచవలెను. పదిహేను సంవత్సరముల వరకు కొట్టియైనను శిక్షణలో ఉంచవలెను. పదహారేళ్లు వచ్చాక స్నేహితునివలె హితవు చెప్పుచుండవలెను. —చాణక్యుడు

## కుమార్తె

* కుమార్తె జీవితాంతం కుమార్తెయే. కుమారుడు అతని భార్య వచ్చేవరకే కుమారుడు.[1] —సూక్తి

---

1 **A daughter is a daughter all her life**
**A son is a son till he gets his wife.**

## కులము

* కులవ్యవస్థ సార్వజనీన భావనను. సార్వజనీన హితానికై కృషిని చంపివేసింది. ప్రజాభిప్రాయాన్ని సంకుచిత పరచింది. వ్యక్తియొక్క విధేయతను కులానికి పరిమితం చేసింది. నీతి నియమాలకు మంచితనానికి కులమే గీటురాయి అయింది. వేతే కులంలోని వ్యక్తిలోని ప్రతిభను కులం గుర్తించదు.

—డా॥ బి.ఆర్. అంబేద్కర్

* తెగువ జంపి, జాతితెలివి తేటలు చంపి,
చెలిమి జంపి, బ్రతుకు విలువ చంపి,
నిలువున దిగమింగు కులవిభేద పిశాచి

—నార్ల వెంకటేశ్వరరావు

* మన కాలం ఇలాంటిది. అనుమానాలు మెండు. ఎవరూ ఎవణ్నీ నమ్మరు. కంట్లో చల్లుతాడని భయపడి కొట్టువాడు యింకో కులానికి కారం అమ్మడు. —కుందుర్తి ఆంజనేయులు

* కసరి బుసకొట్టు నాతని గాలిసోక
నాల్గు పడగల హైందవ నాగరాజు —గుర్రం జాషువా

* మంచి చెడ్డలు మనుజులందున
యెంచి చూడగ రెండె కులములు
మంచి యన్నది మాలయైతే
మాలనే యగుదున్ —గురజాడ అప్పారావు

* బురదలో ఉద్భవించిన కమలం సుందర పుష్పం గావించబడి భగవంతుని సన్నిధిలో వుంచబడుట లేదా? అట్లే ప్రతివానికి

పుట్టుకతో నిమిత్తం లేకుండా ఉన్నత స్థితిని సాధించే హక్కు ఉన్నది. —డా॥ ఎస్. రాధాకృష్ణన్

* జాతినడుగరాదు సాటి మానవునెప్డు
గరిమ నరయు మతని జ్ఞాన మెరిగి
యొరను గూర్చి మిగుల నరయ లాభం బేమి
కత్తిగుణము దెలియ ఘనము కాదె —కబీరు

* గుణముబట్టి తప్ప కులగోత్రముల బట్టి
విలువ గట్టరోయి విబుధజనులు
గాలి దేకులమ్ము గంగ దేగోత్రమ్ము
—బండ్లమూడి సత్యనారాయణ

* చక్కని కవితకు కులమే
యెక్కువ తక్కువలు నిర్ణయించినచో, నిం
కెక్కడి ధర్మము తల్లీ
దిక్కుం జర వేదికా ప్రతిష్ఠతగాత్రి —గుర్రం జాషువా

* పాలకడలిలోన ప్రభవించు మాత్రాన
హాలహలము మధుర మగుట కలదె
కులము ననుసరించి గుణములు రావురా —కరుణశ్రీ

* ముసలివాడైన బ్రహ్మకుఁ బుట్టినారు
నలువురు కుమారులనుట విన్నాముగాని
పసరముకన్న హీనుఁడభాగ్యుడైన
యైదవ కులస్థుఁ డెవరమ్మా సవిత్రి! —గుర్రం జాషువా

* కులముచేతను పుట్టుకచేతను గాదు, కార్యముల చేతనే బ్రాహ్మణుడగును. ఓ యుధిష్ఠిరా! మంచి నడవడిగల వాడు చండాలుడైనను వాడే బ్రాహ్మణుడు.

—భారతం అరణ్యపర్వంలో వైశంపాయనుడు

## కూడదు

* కుట్టేవాళ్ళకు కుడి చేతికింద, ఏడ్చేవాళ్ళకు ఎడంచేతికింద కూచోకూడదు. —సామెత

## కొబ్బరిచెట్టు

* కొబ్బరిచెట్టు గుణమెంత
గొప్ప? చెప్ప నలవికాదు
ఉప్పునీరు అల్లన చప్పరించి
యిచ్చు మనకు తీయని జలంబు

—యార్లగడ్డ రంగనాయకులుచౌదరి

## క్రోపము

* కోపమునకు ఘనత కొంచెమైపోవును. —వేమన

* క్రోధము తమోగుణ లక్షణము. క్రోధపరవశుడగువాడు వివేకమును కోల్పోవును. హనుమంతుడు లంకకు నిప్పంటించెనే గాని సీతయున్న అశోక వనమునుగూడ అది తగులబెట్టునేమోయని యూహించునంతటి వివేక మతనికి లేక పోయెను.

—శ్రీ రామకృష్ణ పరమహంస

* ఆగ్రహం వివేక శూన్యతతో ప్రారంభమై పశ్చాత్తాపంతో అంత మవుతుంది. —పైథాగరస్

## కోరికలు

* ఎల్లలుండవు కోరికల వెల్లువలకు —ఆదిభట్ల నారాయణదాసు

* కోర్కెలను మనం తినుటలేదు ; కోర్కెలు మనలను తిని వేస్తున్నాయి. —భర్తృహరి

* కోరికె తప్ప నీకుఁ బగవాఁ డెవడు
నీ రూపు కోరిక, నీకు నీ వెదిరి
అద్దముఁగను పిచ్చుకటు తమకమున
నీ నీడ తోడనే నీవె పోరెదవు. —ఆదిభట్ల నారాయణదాసు

* కోరిక లెవ్వారికైన గుర్రమ్ముల వంటి వెపుడు
కళ్ళెమ్మును పట్టి లాగగల మొనగాళ్ళెంత మంది?
—డా॥ ప్రసాదరాయకులపతి

* జగమునకు మేలు సలిపెడు కోర్కె
చెలగుట తగు మానసికి మఱియాద....
కోరిక చేతనే కోరికన్ గొట్టు
వెరవున విసముచే విసమూడ్చవలయు.
—ఆదిభట్ల నారాయణదాసు

* డబ్బుదాహమూ. కామేచ్ఛా, మనిషివాపీ, సరైన తరుణంలో తీరకపోతే దయ్యాలల్లే పట్టుకు పీడిస్తాయి.
—కొడవటిగంటి కుటుంబరావు

* మనస్సులో పెద్దపెద్ద కోర్కెలు ఉదయిస్తే చిన్నచిన్న కోర్కెలు మొదట ఉపేక్షించబడి తరువాత అణగిపోతవి. అధికార వ్యామోహం ప్రబలంగా వుంటే కామవాంఛలు అణగిపోతవి. అట్లే ఆధ్యాత్మిక జిజ్ఞాస ప్రబలంగా ఉంటే అధికార వ్యామోహాన్ని గూడ త్యజిస్తాడు. ఉదాత్తమైన లక్ష్యాన్ని జీవితానికి ఏర్పాటు చేసుకోవడమే అల్పమైన కోరికలను నిగ్రహించడానికి రాజమార్గం. —స్వామి చిన్మయానంద

* మానవ ప్రవర్తనను విశ్లేషించి చూస్తే నాలుగు ప్రధానమైన కోరికలు మనుష్యునిలో అంతర్భూతంగా వుంటాయని చెప్పవచ్చు. అవి : 1. క్రొత్త పరిస్థితులను అనుభవించాలని 2. ఇతరులచే గుర్తింపు పొందాలని. 3. భద్రత కలిగి యుండాలని. 4. తన ఎడల ఇతరుల ప్రతిక్రియ ఏమిటో తెలుసుకోవాలని.
—డబ్ల్యు. ఐ. థామస్

## గర్వము

* మనిషిని గ్రుడ్డివానిని చేసేది, తప్పుదారి పట్టించేది గర్వం.
—పోప్

* కన్నులందు మదము గప్పి కానరుగాని
నిరుడు ముందటేడు నిన్న మొన్న
దగ్గులైనవారు తమకంటె తక్కువా ? —వేమన

* బొటన వ్రేలికి సున్నమైతే బోర్లపడతాడు. —సామెత

* ఎనుబోతును పొగిడితే కామధేనువు ననుకొని గంగడోలు వూగించి గర్వపడుతుంది. —సామెత

* పొంగినదెల్ల పొయ్యి పాలు —సామెత

* ఏమీలేని విస్తరి ఎగిరెగిరి పడుతుంది, అన్నీఉన్న విస్తరి అణిగి వుంటుంది. —సామెత

## గాంధీమహాత్ముడు

* గౌతమబుద్ధుని అనంతరం భారతదేశంలో ఇంతటి మహా వ్యక్తి జన్మించలేదు. జీసస్ క్రీస్తు అనంతరం ప్రపంచ మింతటి మహనీయుని చూడలేదు.

—రివరెండ్ డాక్టర్ జె. హెచ్. హోమ్సు

* ఈ భూమి మీద అట్టి మహనీయు లొకరు రక్తమాంసాలు కలిగిన శరీరంతో మనుగడ సాగించారంటే ముందుతరాలవారు బహుశా నమ్మను గూడ నమ్మకపోవచ్చును.

—ఆల్బర్టు ఐన్‌స్టీన్

* పొగడ్తలకు పొంగడు, ప్రలోభాలకు లొంగడు. శారీరకభోగాలు అక్కరలేదు. సుఖాలంటే లెక్కలేదు. మంచిదనుకొంటే చాలు ఏపని చేయడానికైనా జంకడు. ఎప్పుడు కావాలనుకుంటే అప్పుడు అతడి జీవంలేని కట్టెను పాదాక్రాంతం చేసుకోగల మేమోగాని అతడి ఆత్మమాత్రం మన వశంకాదు. అందుకే అతడు ప్రమాదకరమైన శత్రువు. అందుకే అలాంటివాళ్ళతో జాగ్రత్తగా మెలగాలి సుమా.

—గాంధీనిగూర్చి ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీ ప్రొఫెసర్ గిల్బర్ట్ మరే చేసిన వ్యాఖ్య

## గుంపు

* గుంపుకు అనేక శిరస్సులుంటాయి, మెదళ్ళుండవు.

—ఆంగ్లసామెత

* గుంపు శక్తివంతుల్ని ప్రేమిస్తుంది
గుంపు స్త్రీ లాంటిది.[1] —బెనిటో ముసోలినీ

## గురువు

* తల్లియే మొదటి గురువు; గృహమే మొదటి పాఠశాల

—విశ్వయోగి విశ్వంజీ

## గుణములు

* ప్రేమచే క్రోధమును, పవిత్రతచే మోహమును, దాతృత్వముచే పేరాసను, వినయముచే గర్వమును, ఆత్మార్పణచే అహంకారమును జయింపుము. —స్వామి శివానంద

* గొప్పతనము సుందరివలె ఆకర్షించును
మంచితనము మాతవలె పోషించును.

—ఎక్కిరాల కృష్ణమాచార్య

* గుణంలేని గుండె వెలుతుర్లేని గుడిసె ఒకటి.

—గుంటూరు శేషేంద్రశర్మ

* ఆవు నలుపైతే పాలు నలపా ? —కన్నడ సామెత

* గణం కన్న గుణం ప్రధానం
రాశి కన్న రమ్యత శ్రేష్ఠం. —సి. నారాయణరెడ్డి

---

1 The mob loves strong men
The mob is like a woman —Mussolini

* తన కోపమె తన శత్రువు
తన శాంతమె తనకు రక్ష దయ చుట్టంబౌ
తన సంతోషమె స్వర్గము
తన దుఃఖమె నరకమండ్రు తథ్యము సుమతీ.

—సుమతీ శతకము

* ప్రియవచనముల తోడి దానము, గర్వసహితము గాని జ్ఞానము, క్షమాసహితమైన శౌర్యము, త్యాగయుక్తమైన విత్తము అనెడి నాలుగును లోకమందు దుర్లభములు. —నీతిచంద్రిక

* కుట్టకున్న వృశ్చికముఁ గుమ్మరి పుర్వని యందురేగదా !

—సామెత

* క్షమయే కవచము; క్రోధమే శత్రువు; జ్ఞాతియే అగ్ని; మిత్రుడు తగిన ఔషధము: దుర్జనులు దారుణమైన సర్పములు; మంచి విద్యయే ధనము ; తగుమాత్రమగు లజ్జయే అలంకారము ; ఉత్తమ కవిత్వమే రాజ్యము. ఈ క్షమాది గుణములున్నచో కవచాదు లనవసరము. —భర్తృహరి

* చెరకు వంకరైతే తీపిపోతుందా ? —కన్నడ సామెత

* అపనింద, సత్కీర్తి అనేవి రెండూ వస్తేపోవు. ఎప్పుడూ వస్తూపోతూ వుండేవి కలిమిలేములు. ఒక మారు నరుని వదిలి పెట్టి పోతే తిరిగి రానివి ప్రాణము, మానము అనే రెండూ.

—రఘురామ శతకము

* పుట్టుకతో పుట్టిన బుద్ధి పుడకలతోగాని పోదు. —సామెత

* "ద" "ద" "ద" అని మూడుసార్లు ఈశ్వరవాణి మేఘములో నుండి పలికినది. అనగా "త్యాగముచేయుడు, ఇంద్రియ నిగ్రహము కలిగియుండుడు, దయకలిగియుండుడు"అని. కనుక ప్రతి వారును దానము అనగా త్యాగము, దమము అనగా ఇంద్రియ నిగ్రహము, దయ అనగా ప్రేమ అను మూడు సద్గుణములను అభ్యసింపవలెను. —బృహదారణ్యకోపనిషత్తు

* సజ్జనులూ దుర్జనులూ భూమిమీద కలిసే జన్మిస్తారు. కాని తామర పువ్వుకూ జలగకీ ఉన్నట్లు గుణాలు మాత్రం వేరుగాఉంటాయి. —తులసీదాసు

* చెప్పుతినెడి కుక్క చెఱకు తీపెరుగునా? —వేమన

* క్రోధమే యమధర్మరాజు; ఆశయే వైతరణీనది, విద్యయే కామధేనువు; సంతోషమే నందనవనము. కనుక క్రోధము ప్రాణమును హరించును ఆశ దాటరానిది. విద్య కోరికలనొసంగును. సంతోషము సుఖము కలిగించును. —ఒక సంస్కృతకవి

* దుష్టుడు విద్యచేత వితండవాదము చేయును; ధనముచేత పొగరుబోతు అగును; బలముచేత ఇతరులను పీడించును. ఈగుణములే సజ్జనునికి కలిగినచో అతడు విద్యచేత జ్ఞానమును పొందును; ధనముతో దానముచేయును; బలమును ఇతరులను రక్షించుటకై వినియోగించును. —సంస్కృత సూక్తి

* గుణంకంటె మించిన బలంలేదు. —సత్యసాయిబాబా

## గృహము

* ఏడంస్థుల రత్నసౌధమైనను బిడ్డలు తిరుగనిది గృహమని చెప్పకోతగదు. —చాణక్యుడు

* నీగృహం ప్రేమకు స్థానం కావాలి. కాని ప్రేమను బంధించే సరిహద్దు ఆవరణం కాకూడదు.

—స్వామిరామతీర్థ

## గొప్పతనం

* గొప్పవారు కావడానికి రెండు మార్గాలున్నాయి. ఒకటి అందరూ నేలమీద వుండగా తానువెళ్ళి కొండశిఖరం ఎక్కడం. రెండు: తాను నేలమీద నిలబడి మిగతావారిని గోతుల్లోకి త్రోయడం.

—జి. కె. రెడ్డి

* మన అద్భుతమైన ఘనత ఎన్నడూ పతనం కాకపోవడంలో లేదు - పతనమైన ప్రతిసారీ మరల పైకి లేవడంలో వున్నది.

—ఆలివర్ గోల్డ్‌స్మిత్

## గ్రంథాలయాలు

* శరీరంలో రక్తప్రసరణానికి నరాలు ఎలా తోడ్పడతాయో, దేశంలో భావప్రసరణకోసం గ్రంథాలయాలు అలా కృషి చేస్తుంటాయి. —ఇరివెంటి కృష్ణమూర్తి

## గ్రామము

* పెద్ద స్థలంలో కొద్దిమంది మాత్రమే కలసి పల్చపల్చగా ఉండే లాగున నివాసం అయివుంటే దాన్ని గ్రామం అనీ, కొద్ది స్థలంలో చాలమంది కలిసి ఒత్తిడిగా నివసిస్తే దాన్ని బస్తీ అనిన్నీ అంటారు. —భమిడిపాటి కామేశ్వరరావు

## గ్రుడ్డితనం

* గ్రుడ్డివాడవడం విషాదకరంకాదు: గ్రుడ్డితనాన్ని భరించే శక్తి లేకపోవడం విషాదకరం. —జాన్ మిల్టన్

## చదువు

* చదువు రావటానికి అభ్యాసంతో పాటు సహజమైన తెలివితేట లుండాలి. చదివిందిగాని, చెప్పిందిగాని వెంటనే అర్థంచేసుకొని అర్థంచేసుకున్న విషయాన్ని తిరిగి తనమాటల్లో చెప్పగలిగే నేర్పుండాలి....చదువుకంటె సంస్కారం ముఖ్యం.

—నవీన్

## చదువుట

* చదవడమంటే, తనబుర్రతో ఆలోచించే బదులు మరొకరి బుర్రతో ఆలోచించడ మన్నమాట. —స్కొపెన్‌హీర్

* పుస్తకాలు చదవకపోతే పుడమి పురుగు అవుతారు. చదవడమే పరమావధిగా పెట్టుకుంటే పుస్తకాల పురుగు అవుతారు.
—గొర్రెపాటి వెంకటసుబ్బయ్య

* ప్రజలు చదవడం మానేస్తే క్రమంగా వక్రమార్గానపడి పెరగడం మానివేస్తారు. —జవహర్లాల్ నెహ్రూ

* సమన్వయశక్తి ఉన్నవారికే గ్రంథావలోకనం ఉపయోగిస్తుంది. అది లేనివారిని సందేహాలలో ముంచి నిరర్థకులను చేస్తుంది.
— అనుభవానందస్వామి

## చర్చ

* గొప్పవారు ఆశయాలను గురించి చర్చిస్తారు ;
సగటు మనుషులు సంఘటనల గురించి చర్చిస్తారు ;
అధములు వ్యక్తుల గురించిచర్చిస్తారు.[1] —ఆంద్ర మారోయిస్

## చరిత్ర

* గతం నాస్తికాదు నేస్తం
అది అనుభవాల ఆస్తి
గతాన్ని స్వగతం చేసుక
భావికి స్వాగతం పలకాలి. —వే. నరసింహారెడ్డి

* ఆత్మవిశ్వాసపూరితులగు కొందరు వ్యక్తుల చరిత్రయే ప్రపంచ చరిత్ర. —స్వామి వివేకానంద

* గడచిపోయిన రాజకీయములే చరిత్ర ; వర్తమాన చరిత్రయే రాజకీయాలు. —సీలీ

---

[1] Great men discuss ideals ; average men discuss events ; and less than average men discuss personalities. —Andre Maurios

చరిత్రకు అంతరాత్మ సత్యము.

—నండూరి రామకృష్ణమాచార్య

చార్లెస్ బియర్డ్ అను చరిత్రకారుడు చరిత్రయొక్క మౌలికమైన గుణపాఠాలను ఇలా పేర్కొన్నాడు :

1. దేవతలు ఎవరినైతే నాశనం చేయదలచారో అతనిలో మొదట అధికార పిచ్చ ఎక్కిస్తారు.

2. దేవునియొక్క యంత్రాలు అతినిదానంగాను, చాల కొద్దికొద్దిగాను శిలలను పొడిచేస్తుంటాయి.

2. తేనెటీగ పుష్పంనుండి మధువును దొంగిలిస్తుంది. కాని ఆ పువ్వును ఫలవంతం చేస్తుంది.

4. బాగా చీకటి అలముకొన్న తర్వాతనే ఆకాశంలో నక్షత్రాలు కనిపిస్తాయి. —'ఆర్గనైజర్' నుంచి

ఏజాతి చరిత్ర చూచినా ఏమున్నది గర్వకారణం
నరజాతి చరిత్ర సమస్తం పరపీడన పరాయణత్వం

—శ్రీరంగం శ్రీనివాసరావు

* చరిత్రను అభ్యసిస్తే అది మనుష్యులను వివేకవంతులుగనొనర్చగలదు. —బేకన్

* మనిషికి మనిషి చేసే అన్యాయమే మానవ చరిత్ర - చెట్లుకాదు, మృగాలు కాదు, మనిషే ! —గుంటూరు శేషేంద్రశర్మ

* కాలరాక్షసి విందులు కుడిచిన చిహ్నాలను
భద్రంగా దాచిఉంచే చోటు చరిత్ర
—ఉమాపతి పద్మనాభశర్మ

* చరిత్ర లోలకము వంటిది. అది ఒక చివరనుండి మరొక చివరకు కదులుతూ వుంటుంది. —విల్ డ్యూరెంట్

* గతముమీద మనకుగల ఆసక్తి ఏమంటే, అది భవిష్యత్తునకు మార్గదర్శిగా ఉంటుంది.[1] —ఎడ్వర్డ్ హైడ్

**చిత్రము**

* ఒక్క చిత్రము వెయ్యి మాటలతో సమానము.
— చైనా సామెత

**చెడు**

* సీతాదేవిని రావణుడు సాధువేషముతో అపహరించడానికి వచ్చాడు. చెడు నిన్ను గెలవలేనపుడు మంచివేషము వేసుకొని వస్తుంది. జాగ్రత్త! చెడు కామరూప శక్తి కలది. దానినుండి తప్పించుకోడానికి గాఢ వివేకం ఉండాలి.
—స్వామి కేశవతీర్థ

**చెడుకాలం**

* అధిక విద్యావంతు లప్రయోజకులైరి
పూర్ణ శుంఠలు సభా పూజ్యులైరి
సత్యవంతుని మాట జనవిరోధంబాయె
వదరు బోతులమాట వాసికెక్కె —నారసింహశతకం

---

1 Our chief interest in the past is as a guide to the future —Edward Hyde

## జనన మరణములు

* పుట్టుకకు కారణము కామము. చావుకు కారణము కాలుడు. కామ కారణంగా కల్గిన వస్తువు కాలగ్రస్తమై నశించుచున్నది. కామ వీక్షణలతో మోడుకూడా చిగిరిస్తున్నది. కాలదర్శనంతో శుష్కించి ఎండిపోయి జీర్ణిస్తున్నది. "కాలో జగద్భక్షకః". కాలము వచ్చినదంటే సూర్యచంద్రాదులున్నూ నశిస్తున్నారు. కామము లేకపోతే ఉత్పాదన లేదు. కాలము లేకపోతే వినాశనము లేదు. —కంచికామకోటి స్వామివారు

## జాతి

* జాతి ఎన్నడూ పతన మవదు
ఆత్మహత్య ద్వారా తప్ప.[1] —ఎమర్సన్

* ఏ కాలంలోనైనా ఏ జాతికైనా దానిభవిష్యత్తు ఇరువది అయిదేండ్ల లోపు ప్రాయముగల యువకుల భావాలమీద ఆధారపడి ఉంటుంది. —కార్లయిల్

* ఒక జాతియొక్క బలం ఆఖరుకు తనశక్తితో తాను ఏమిచేయ గలదో దానిలో కానవస్తుందేగాని, పరులనుండి దేన్ని అరువు తీసుకుంటుందో దానిని బట్టి వుండదు.[2] —ఇందిరాగాంధీ

---

1 A nation never falls but by suicide. —Emerson

2 A nation's strength ultimately consists in what it can do on its own and not in what it can borrow from others, —Indira Gandhi

* వ్యక్తి ఎంత గొప్పవాడైనా
జాతికంటె గొప్పవాడు కాడు. —భండారు సదాశివరావు

* ఒక జాతి యొక్క విజయము ఏ యితర సుగుణము కంటె మిన్నగా సాహసము మీదనే ఆధారపడి వుంటుంది. ధైర్యాన్ని అలవరచుకోకుండా ఏ జాతి ఉన్నత స్థానాన్ని ఆక్రమింపజాలదు. కనీసం తన స్వతంత్రము నైనా నిలబెట్టుకోజాలదు. సాహసం లేకుండా ఏ జీవన రంగములో గూడ ముందుకు పోజాలదు. పిరికితనం గల జాతులు పతనంగాక తప్పదు.
—ఓ.జి.ఇ. హాల్

## జ్ఞానము

* నిజాయితీతో పనిచేసే ఆరుగురు సలహాదారుల్ని పెట్టుకున్నాను. నాకు తెలిసింది యావత్తూ వారే నాకు బోధించారు. వారెవరంటే: ఏమిటి, ఎందుకు, ఎప్పుడు, మరియు ఎట్లు, ఎచట, ఎవరు.[1]
—రుడియార్డ్ కిప్లింగ్

* జ్ఞానం ప్రధానమే గాని కర్మహీనమైన జ్ఞానం నిరుపయోగము. కర్మ ప్రధానమేగాని జ్ఞానంలేని కర్మగూడ నిష్ప్రయోజనమే. జ్ఞాన కర్మలు రెండూ అవసరమే. జ్ఞాన, కర్మ సముచ్చయము

---

1 I keep six honest serving men
They taught me all I knew
Their names are What, and Why and When,
and How and Where and Who.
—Rudyard Kipling

వలననే మానవుడు తరించుచున్నాడు. ఒక్క రెక్కతోనే పక్షి ఎగురజాలదు గదా!
—పులస్త్య స్మృతి

* జడప్రాయంగా ఉన్న
అమిత జ్ఞానం కన్న
చైతన్య రూపంలో ఉన్న
పరిమిత జ్ఞానం మిన్న
—ఖలీల్ జిబ్రాన్ (అనువాదం సి. నా. రె.)

* ఈ జీవితంలో నిజంగా నేర్చుకోతగిందేది పాఠం చెపితే అలవడదు.
—ఆస్కార్ వైల్డ్

* భౌతికజ్ఞాన మేమిటో తెలియనివాడు ఆధ్యాత్మిక జ్ఞానం సంపాదించలేడు.
—బంకించంద్ర చటర్జీ

* ఒకటి తెలుసుకొంటివా నీ కన్నియును తెలియును. ఒకటి యను అంకె తరువాత సున్నలను చేర్చినపుడు వానికి పదులువందలు వేలు మొదలగు విలువ యేర్పడుచున్నది ఆ ఒకటి యను సంఖ్య చెరిపివేసినచో సున్నలకు విలువ సున్నయే.
—శ్రీ రామకృష్ణ పరమహంస

* నీటితో శరీరము శుభ్రపడుతుంది. సత్యముతో మనస్సు ప్రకాశిస్తుంది. జీవుడు తపస్సుతో తరిస్తాడు. జ్ఞానంతో బుద్ధి వికసిస్తుంది.
—స్వామి సుందర చైతన్యానంద

* వాయువువలెను, నీటివలెను, ప్రకాశమువలెను జ్ఞానము గూడ ప్రతివారికి స్వాధీనము కావలెను.
—చిలకమర్తి లక్ష్మీనారసింహం

* జీవితంలో ప్రతి క్షణమూ ఏకత్వాన్ని దర్శించడమే జ్ఞానము. జ్ఞానం ఒకరివల్ల నేర్చుకొనేదికాదు. ఎవడికి వాడు అనుభవ పూర్వకంగా గ్రహించాలి. —హెర్మన్ హెస్

* 'నేను' ఎక్కడపుడుతుందో చూడు. మనస్సు అక్కడే లయిస్తుంది. ఇదే జ్ఞానం. —రమణ మహర్షి

* "శ్రద్ధావాన్ లభతే జ్ఞానం"
(శ్రద్ధగలవాడే జ్ఞానమును పొందును.) —భగవద్గీత (4-19)

* శ్రమరూపము దాల్చనట్టి
జ్ఞానం బంతయు మిధ్య —కాళోజీ నారాయణరావు

* శాస్త్రములా అనంతాలు. తెలియదగిందా ఎంతోవుంది కాలం బహుపరిమితం. విఘ్నములా అనేకం. కావున మానవుడు సారమైనవాటినే తెలుసుకో ప్రయత్నించాలి గాని అపారమైన వాటి మీదికి మనస్సు పోనీయరాదు. హంసలు పాలనే గ్రహించి నీటిని వదలునట్లుగా ప్రాజ్ఞుడు వర్తించాలి. —ఉపనిషద్వాక్యం

* చీకటికంటె వెలుగు ఎంత ప్రయోజనకరమో బుద్ధిహీనత కంటె జ్ఞానం అంత ప్రయోజనకరం. — బైబిలు

(చూడుడు : విద్య)

## జ్ఞాని

* గింజపట్టినకంకి వంగునట్లు జ్ఞానము కలిగిన వ్యక్తి నమ్రత కలిగి వుంటాడు —స్వామి సుందర చైతన్య

## జీవన సూత్రములు

* దేవుఁడన మాతృదేశము,
దేవతలనఁ బ్రజల, యజ్ఞ దీక్షయనంగా
సేవా వ్రత నిష్ఠయ, యివి
జీవన సూత్రములుగాఁ బ్రసిద్ధింగనుమా.

—తుమ్మల సీతారామమూర్తి

* దేవుడొక్కడే ఉన్నాడు ; అతడు సర్వత్రా నిండియున్నాడు. ఒకే కులమున్నది; అది మానవకులము. ఒకే చట్టమున్నది ; అది విధి నిర్వహణ. ఒకే భాష యున్నది ; అది హృదయం పలికే భాష. ఒకే మతమున్నది; అది ప్రేమ మతము.

—సత్యసాయిబాబా

* సూదివోలె బ్రతుకరాదు, దారమునట్లు
మనుట నేర్వ వలయు మానవుండు -
సూదితూట్లు వేయుచుంబోవు, దార మా
రంధ్రములను గప్పి రాణ చెందు

—తుమ్మల సీతారామమూర్తి

* భుజించడం కోసం జీవించగూడదు ;
జీవించడం కోసం భుజించాలి. —సూక్తి

* ఒకేచోట కలకాలం నిలిచిపోకు; నిరంతరం గమనశీలివి కమ్ము.

—రాహుల్ సాంకృత్యాయన్

* ఇదే నీ చివరి రోజనుకొని ప్రతిదినం జీవించు.[1]

—ఆంగ్ల సూక్తి

* ఆశయాలకోసం జీవించు, ఆశలకోసం కాదు.

—శ్రీ సత్యసాయిబాబా

**జీవితం**

* బాల్యం బంగారం గని
యౌవనం పొంగే ఝురి
వార్ధక్యం ముసిరే నిశి
కాక మరేమిటి జీవితం ? —పురాణపండ రంగనాథ్

* చిక్కుపడిన దారపుండ జీవితమ్ము
ఒకటి విడదీసిచూడ వేరొకటి పడును. —ఆత్రేయ

* నేను నమ్ముతాను
జీవితంలో కొన్ని విషయాలున్నాయని
అవి జీవితం కంటె గొప్పవని.[2] —ఎలియాస్ లైబర్‌మన్

* బ్రతుకు ఒక మొసళ్ళ మడుగులో ఈత ! వాటి నోటిలో పడకుండా ఈదుకుంటూపోతూ దొరికిన కలువలు పోగుచేసుకోవడం ఒక పెద్ద కసరత్తు. —గుంటూరు శేషేంద్రశర్మ

---

[1] Live every day as if thy last —Proverb

[2] I believe
That there are greater things in life
Than life itself. —Elias Liberman

* ఏ సూత్రంలోకి జీవితం ఇమడదు. పైగా జీవితం అనుక్షణం మారేది. సూత్రం మారనిది. సూత్రాలమీద ఆధారపడిన వ్యక్తి జీవితంలో వస్తున్న మార్పులను అజలోకి తీసుకోడు. గమనించనే గమనించడు. తన సూత్రంలో ఇమడని జీవిత శకలాన్ని ఏదోఒక నెపంతో దూరంగా నెట్టివేస్తాడు. ఫానటిక్‌గా తయారయి నిరంతర సాధనవల్ల విరోధి వర్గాన్ని వృద్ధి చేసుకుంటూ చివరకు తనకు తాను మిగులుతాడు.

—త్రిపురనేని గోపీచంద్

* జీవితం క్షణికమని బాధపడుతున్నాము
కాని జీవితంలో ఎన్ని క్షణాలు వ్యర్థం చేస్తున్నాము ?

—సెనేకా

* జీవితం ఉల్లిపాయ
పొరపైని పొర వొలిచేస్తూపోతే
నీకుగా, చివరకు మిగిలేది ఏమీ వుండదు
దాని ఘాటుతాలూకు కన్నీళ్ళు తప్ప —ఇంద్రాకర్ రెడ్డి

* చీకటి వెలుగుల రంగేళి
జీవితమే ఒక దీపావళి —సి. నారాయణరెడ్డి

* శైశవం కమ్మని కల
యవ్వనం అందమైన వల
ప్రౌఢత్వం బాధ్యతల గోల
వృద్ధాప్యం మృత్యుభీతి హేల —భూన అప్పలరెడ్డి

* చేపికొంత, కొంత తీక్తము, పులుపింత
కొంత యుప్పు, గార, మింత వగరు;
బ్రతుకు వేపపువ్వు పచ్చడి యగునోయి.
—బండ్లమూడి సత్యనారాయణ

* జీవితం అశాశ్వతమైనది. అందుచేత పశ్చాత్తాప మవసరం లేకుండా పనులు పూర్తిచేసుకోవాలి. —భారతంలో విదురనీతి

* జీవితం కరిగిపోయే మంచు
ఉన్న దాంట్లోనే నలుగురికీ పంచు. —గోపాలచక్రవర్తి

* నీ దైనందిన జీవితంలో పగలు రాత్రి రెండూ ఉన్నవి. దుఃఖం అనే ప్రతి పగటిని సుఖం అనే ఒక రాత్రి అనుసరిస్తూ వుంటుంది. సుఖం అనే ఒకరాత్రిని దుఃఖమనే ఒక పగలు అనుసరిస్తూనే వుంటుంది. —స్వామి రామతీర్థ

* ఆశ చావనీదు, భయం బతకనీదు. —ఆదివిష్ణు

* వ్యష్టిలోనుండి సమష్టిలోనికి
'స్వం' లోనుండి 'సోహం'లోనికి
పరిణమించడం జీవితం
కాక మరేమిటి దీనికర్థం ? —పురాణపండ రంగనాథ్

* జీవితపు దారులు చిక్కుపడిన దారాలు. నీవాళ్ళెవరు కారో నీకు తెలియనీయరు. నీవు నిలబడ్డ భూమికూడా రేపు నీ కాళ్ళను వంచించదని చెప్పలేవు. —గుంటూరు శేషేంద్రశర్మ

* జీవితం కప్పులో నీళ్ళలాంటిది. ఏ అనుభవంలో పోస్తే ఆ షేపు వస్తుంది. —ఎర్రంశెట్టి శాయి

* మానవుని మనుగడ
కడలిపై తేలియాడే నురగ
గాలివస్తే అది గల్లంతే
మృత్యువువస్తే అందరూ అంతే
—ఖలీల్ జిబ్రాన్ (అనువాదం : సి.నా.రె.)

* జీవిత ప్రవాహం ప్రచండ వేగంతో వెళ్ళిపోతూ వుంటుంది. ఎవరెవరి సంస్కారాన్ని బట్టి వాళ్ళు తమ సుఖం కోసం పోటీ పడుతుంటారు. ఇదొక మహాసంగ్రామం. ఇందులో పిరికి వాళ్ళకు అసమర్థులకు చోటులేదు. అంతేకాదు, జ్ఞానమును సంఘ జీవితానికి ఉపయోగ పరచే మన సత్వం కావాలి. అది లేకుంటే సంఘర్షణ, పతనం తప్పదు. —త్రిపురనేని గోపీచంద్

* ఈ జీవితంలో ఎంత అనుభవముండీ చాలదు. ప్రతి పొరపాటూ, జీవితంలో ఒక్కసారి మాత్రమే చేసే అవకాశం వస్తుంది. ఆ అనుభవం జీవితంలో మరెన్నటికీ అక్కరకురాదు.
—కొడవటిగంటి కుటుంబరావు

* యౌవనం తప్పుల తడక,
మధ్య వయస్సు పోరాట కాలం,
వృద్ధాప్యం విచారసమయం.[1] —డిజ్‌రేలీ

---

1 Youth is a blunder, manhood is a struggle, old age a regret. —Disraeli

* ప్రేరణ లేకుంటే మనిషికి
జీవిత మంతయు చీకటి —కాళోజీ నారాయణరావు

* జీవితం సబ్బునీళ్ళ లాంటిది. అట్టడుగున మురికి, దాని ఎగువగా నీరు, ఇంకా ఎగువ బుడగలు.

—కొడవటిగంటి కుటుంబరావు

* జీవితంలో ప్రతి నిముషం భగవద్దత్తం ; మానవసేవ కొరకది యివ్వబడింది.[1] —గాంధీ

* జీవితం అంటే ఏమిటో తెలుసుకొనే సరికి సగం అయిపోతుంది. —అంగ్లసామెత

* మార్పు లైఫ్‌కి గొప్ప థ్రిల్ నిస్తుంది.

—దాసరి ఝాన్సీరాణి

* జీవితంలో దెబ్బలు తిన్నకొద్దీ నిశ్చలత పెరుగుతుంది. శిల్పానికి అందం రావాలంటే ఉలిదెబ్బ లవసరం.

—మాతృశ్రీ అనసూయాదేవి

* జీవితం మీద ప్రేమకంటె ప్రేమమయ జీవితం మంచిది.[2]

—అంగ్లసామెత

---

[1] Every minute was a gift of god to be used in the service of man. —Gandhi

[2] The life of love is better than the love of life.

—Proverb

* జీవితాన్ని జీవించడమే ప్రధానమైన విలువ. అందుకు అనుబంధ మైన విలువలు : మారటం, ముందుకు పోవటం, రిస్క్ (risk) తీసుకోవడం. —త్రిపురనేని గోపీచంద్

* ముత్తేభాలూ శార్దూలాలూ
ఆటవికంగా ఆడుకొనే
జనారణ్య సమాజంలో
అర్ధనగ్న నృత్యం చేసే
ఆటవెలది జీవితం ! —ముదిగొండ ఈశ్వరచరణ్

* ఆశా అసంతృప్తుల కలయికే జీవితం.
—మాతృశ్రీ అనసూయాదేవి

* ఇజంలో ఇంప్రిజన్ అయితే యింగితజ్ఞానం నశిస్తుంది. ప్రిజం లాంటిది జీవితం, వేర్వేరు కోణాలు ప్రదర్శిస్తుంది.
—దేవరకొండ బాలగంగాధరతిలక్

* ఎక్కడ్నుంచో వచ్చిన అమ్మాయి, ఎవరో అబ్బాయితో తనువు గడుపుకోవడమంటే మాటలా ? జీవితం సర్కసులో కాలు జారితే లేవటం కష్టం.... డబ్బు ఎవరుతెస్తారో వారిదే గౌరవం, వారికే అథార్టీ. జిత్తులు తెలిసిన వారికే జీవితం వెన్నెల. తెలియని వారికది చిట్టడవి. —పురాణం సీత

* సుఖాన్ని వ్యయంచేసి కీర్తి పొందవచ్చు
ఆరోగ్యాన్ని ఖర్చు పెట్టి ఆనందం కొనవచ్చు
స్వేచ్ఛను వదలుకొని ప్రయోజనం పొందవచ్చు.
— పియరీ గాస్టన్

* సంతృప్తిలేని జీవితానికి శాంతిలేదు ; అసంతృప్తిలేని జీవితానికి వృద్ధిలేదు. —నార్ల వెంకటేశ్వరరావు

* మన జీవిత విలువను చేసిన పనులను బట్టి అంచెనా వేస్తారు. జీవించిన కాలాన్ని బట్టి కాదు. —పెరిటన్

* ఆడది లేకుంటే అడవి, మగవాడు లేకుంటే మఠం. —సామెత

* పరస్పర సంబంధాల కొరకు ఉద్యమించడమే జీవితం. —జిడ్డు కృష్ణమూర్తి

## జూదం

* జూదం దురాశకు బిడ్డలాంటిది ; అన్యాయానికి సోదరుడు లాంటిది ; అనర్థానికి తల్లిలాంటిది. —జార్జి వాషింగ్‌టన్

## తప్పులు

* విజయం అసంఖ్యాకమైన తప్పులను దాచివేస్తుంది.[1] —జార్జి బెర్నార్డ్‌షా

* వెలుతురుకు నీడ ఎలాంటిదో, జీవితానికి తప్పులు అలాంటివి. —ఎర్నెస్ట్ జాన్‌జర్

---

[1] Success covers multitude of blunders. —George Bernard Shaw

* ఇతరుల దోషాలను చూసినట్లు తమ దోషాలను చూడగలిగితే ఈ ప్రపంచంలో నుండి దుర్మార్గం తొలగిపోవడం తథ్యం.
—తిరుక్కురల్

## తల్లి

* భగవంతుడు అన్నిచోట్లా ఉండలేక పోయాడు. అందుకే తల్లులను సృష్టించాడు.
—మహాత్మాగాంధీ

* అమ్మఒడి ఒక బడి, ఒక గుడి.
—ఒక తత్వవేత్త

* తల్లిముఖం చూడని బిడ్డ, వానముఖం చూడని పైరు ఒకటే.

* తల్లి చస్తే నాలుక చచ్చినట్లు, తండ్రిచస్తే కళ్ళు పోయినట్లు.

* తల్లిలేని పిల్లలు అల్లులేని తీగలు.
—సామెతలు

* దేవుడికీ తల్లికీ ముఖ్యమైన భేదం - దేవుడు పాపిని క్షమించడు; తల్లి పాపినిగూడ క్షమిస్తుంది.
—ఉమాపతి పద్మనాభశర్మ

* ఒక మంచి తల్లి వందమంది ఉపాధ్యాయుల పెట్టు.
—ఆంగ్లసామెత

* తల్లిని నమ్మినవాడు, ధరణిని నమ్మినవాడు చెడడు.
—సామెత

* ఉత్తములైన తల్లుల నివ్వండి
మీకు ఉత్తమజాతి నిస్తాను.
—నెపోలియన్

* దేవుణ్ణి ప్రత్యక్షంగా చూడదలచినవారు చూడవలసిన వ్యక్తి మాతృమూర్తి.
—ఉమాపతి పద్మనాభశర్మ

* తల్లి మేలుకోరని చెడ్డ కుమారు డుండవచ్చును గాని కుమారుని మేలుకోరని చెడ్డ తల్లి యుండదు. —శంకరాచార్య

## తల్లిదండ్రులు

* తల్లి దైవము, తండ్రి ధనము. —సామెత

* తప్పులు వెదకేవాడు తండ్రి; ఒప్పులు వెదకేవాడు ఓర్వలేని వాడు. —సామెత

* తల్లి చనిపోతే తండ్రి పినతండ్రి వంటి ప్రేమకలవాడే యగును. —సామెత

* అబ్బలేని బిడ్డ
మబ్బులేని యెండ — పెద్దబాలశిక్ష

* తన తండ్రినైనను తల్లినైనను దూషించువాని దీపము కారు చీకటిలో ఆరిపోవును. —బైబిలు-సామెతలు, 20-20

* తండ్రిగా కావడానికి పెద్ద తెలివితేట లవసరం లేదు గాని, తండ్రిగా వుండడానికి ఎంతో వివేకం కావాలి. —చింగ్ చౌ

* ఊరంతా నాన్నకు లోకువ,
నాన్న అమ్మకు లోకువ. —సామెత

## తారతమ్యం

* ఉప్పు కప్పురంబు నొక్కపోలిక నుండు
చూడ చూడ రుచుల జాడ వేరు
పురుషులందు పుణ్య పురుషులు వేరయా —వేమన

## త్యాగము

* బ్రతికి నన్ని నాళ్లు ఫలము లిచ్చుటెగాదు
చచ్చిగూడ చీల్చి యిచ్చు తనువు
త్యాగ భావమునకు తరువులే గురువులు —కరుణశ్రీ

* మహా వృక్షంగా మారటానికి విత్తనం మొదట భూమిలో తన శరీరాన్ని నశింప చేసుకొనడం లేదా ? అట్లే స్వార్థ పరిత్యాగం చేతనే మనకు కార్యవిజయం చేకూరుతుంది.
—స్వామి రామతీర్థ

* స్వర్గద్వారాన్ని తెరిచే బంగారు తాళపుచెవి త్యాగం.
—అంగ్లసామెత

* గొప్ప కార్యము లెప్పుడును గొప్ప త్యాగముల వలననే సాధించబడుతాయి. —స్వామి వివేకానంద

* ఖాళీఅయిపో, నేను నిన్ను భర్తీ చేస్తాను.
(**Empty thyself and I will fill thee.**) — బైబిలు

* మీ హృదయాలను ప్రపంచమంత విస్తృతం చేసుకోండి. అప్పుడు మహాశక్తి మీ వెనుక వుంటుంది. ఇతరుల కోసం చేసే అతి స్వల్పకార్యం గూడా మీలోని శక్తిని మేల్కొల్పుతుంది. ఇతరుల కోసం ఏ కొద్దిపాటి మంచిపని చేసినా మీలో సింహాని కున్నంత శక్తి - మీరు భరించలేనంత శక్తి - ఉద్భవిస్తుంది. మీరు ఆశ్చర్యచకితులవుతారు. —స్వామి వివేకానంద

* ఏదైనా పొందాలని వాంఛిస్తే అర్పించాలని నేర్చుకో, ఈ సనాతన ధర్మాన్ని జ్ఞప్తియందుంచుకో. —సుభాస్ చంద్రబోస్

* "త్యాగాచ్ఛాన్తి రవన్తరమ్"
(త్యాగము వలన శాంతి కలుగును.)

—భగవద్గీత (12-14)

* "మమ ఇతి మృత్యుః" మమకారమే మృత్యువు. 'న మమ' మమతా రాహిత్యమే అమరత్వము. ఇది నాదికాదు ; అందరిదీ. కనుక జాతికి చెందినది. ఇట్టి భావనయే నిజమైన జాతీయ భావన. దీని నుండియే త్యాగప్రవృత్తి జనిస్తుంది.

—దీన దయాళ్ ఉపాధ్యాయ

## తిండిపోతు

* పెక్కు తిండిపోతు పెండ్లా మెరుంగురా. —వేమన

* వక్కాయింటి నెయ్యి, పెండ్లాం చెయ్యి. —సామెత

* గీతాకారుడైన గోవిందుడే go+ విందు అని శాసించాడు. ....వరాన్నమే పరమాన్నం....కలియుగమంటే ఆకలి యుగం ... బ్రతుకు భక్షణ కొరకే మనుగడ మ్రింగుడు కొరకే !

—పుచ్ఛా పూర్ణానందం

* తిట్లు వెలుపలికి, తిండి లోపలికి. —సామెత

* నూరు చెప్పుదెబ్బలైనా ఒక్కపప్పుముద్దకు సమానమా ?

—సామెత

* మూలుగు మునుపటల్లేనే, తిండి ఎప్పటల్లేనే. —సామెత

* బంతికి ముందు, బారుకు వెనుక.
(తినడానికి ముందు, యుద్ధానికి వెనుక). —సామెత

* తినిపారిపోయిన దొంగకుక్క తినిపారిపోతే, తోకాడించిన పొరుగువారి పెంపుడుకుక్కను బాదినట్లు. —సామెత

* ఏ పాటు తప్పినా సాపాటు తప్పదు.
(పాటు=పని, సాపాటు=తిండి) —సామెత

* గుఱ్ఱం గుడ్డిదైనా దాణాకు లోటులేదు. —సామెత

* దున్నబోతే దూడల్లోకి, మేయబోతే ఎద్దుల్లోకి. —సామెత

## తీపి

* నిజముకన్న కల్ల నిశ్చయంబుగ తీపి
బిడ్డకన్న ముండబిడ్డ తీపి
కరము, వేతనంబుకన్న లంచముతీపి
వసుధ, మొదలు కన్న వడ్డి తీపి !

—కాళ్ళకూరి నారాయణరావు

## తృప్తి

* మనిషి ఎన్నడూ తనకున్న సంపదతో తృప్తిపడాలి ;
తనకున్న విజ్ఞానంతో తృప్తిపడకూడదు. —మెంకింటోష్

## తొందర

* తొందరపడి ఏపనీ చేయరాదు, ఈగల్ని పట్టడం తప్ప.
—ఆంగ్లసామెత

* తొందరవల్ల వృధాజరుగుతుంది ; వృధావల్ల లేమి ఏర్పడుతుంది ; లేమివలన పెద్ద మనిషికీ అతని భార్యకూ నడుమ జగడం జరుగుతుంది. —ఆంగ్లసామెత

* ఏరు ఏడామడ వుండగనే చీరవిప్పి చంకన పెట్టుకు పోయినట్లు.
—సామెత

* అన్న ప్రాశన నాడే ఆవకాయడిప్ప అన్నట్లు. —సామెత

## దాంపత్యం

* పరచుల కాపురం చితుకుల మంట. —సామెత

## దానము

* కూతబెట్టుటే స్వభావముగాగల సముద్రుడు అట్టడుగుననే యుండును. దానగుణముకల మేఘము ఉన్నతాకాశమున ఠీవిగా గర్జించుచుండును. —భోజచరిత్ర

* దానము ప్రాయశ్చిత్తము వంటిది. కుడిచేతితో ఇచ్చు దానము ఎడమచేతికి తెలియరాదు. —ఏసుక్రీస్తు

* పెట్టిన దినముల లోపల
నట్టడవుల కైన వచ్చు నానార్థములున్
పెట్టని దినముల కనకపు
గట్టెక్కిన నేమిలేదు గదరా సుమతీ —సుమతీ శతకము

## దిగులు

* దిగులుతో నమలిందంతా చొప్ప
మింగిందంతా చేదు
దిగులుతో బ్రతుకు బ్రతుకే కాదు.
— కాళోజీ నారాయణరావు

## దీపము

* సూర్యుడు అస్తమిస్తూ అస్తమిస్తూ అనుకుంటాడు :
"అయ్యో! నేను వెళ్ళిపోతున్నానే! ఇంకలోకానికి దిక్కెవ్వరు?"
అని.
అపుడు ప్రమిదలో మినుకు మినుకుమనే తైలదీపం అంటుంది:
"నాకు చేతనైనంతగా నేను సాయపడతాను ప్రభూ" అని!
—రవీంద్రనాథ్ టాగోర్

* ఒక దీపంతో ఇంకో దీపం వెలిగిస్తే
మొదటి దీపం కాంతి ఏమీ తగ్గదు.
—రావినూతల శ్రీరాములు

* మనవాళ్ళు నిజానికి దీపాలకు చాలా ప్రాముఖ్యం ఇచ్చారు.
సంధ్యాదీపం సరస్వతి అన్నారు. అర్ధరాత్రి దీపం ఆత్మజ్యోతి.
వేకువ దీపం జ్ఞానజ్యోతి అన్నారు పెద్దలు.
—రావూరు సత్యనారాయణ

* గుడిలో దీపం వెలిగించే ముందు చీకటితో నిండిన మన ఇంట్లో
ఒకదీపం వెలిగించు. —హిందీసామెత

* నా చేతిలో ఉన్న దీపాన్ని నేను వెలిగించలేదు; కాబట్టే నా నీడ
నాకు అర్థమవుతూంది. —రవీంద్రనాథ్ టాగోర్

## దురదృష్టం

* గ్రహచారం చాలకపోతే గోచీలో పిడుగు —సామెత

* రాత రాజ్య మేలేలాలని వుంటే, గ్రహచారం గాడిదలు మేపాలని వున్నదట. —సామెత

లొలుగునట్లు పలుకు వానిని నిస్సారునిగను, బలవంతుని గర్వితునిగను, పండితుని వాచాలునిగను తలచెదరు.

—భర్తృహరి

(చూడుడు : అల్పులు)

**దురాశ**

* పొదుగు కోసి పాలు త్రాగినట్టు —సామెత

**దేశభక్తి**

* అపి స్వర్ణమయీ లంకా నమే లక్ష్మణ రోచతే
జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ॥
లక్ష్మణా ! సువర్ణముతో నిండిన ఈ లంకా పట్టణము నన్నాకర్షించుట లేదు. జనని, జన్మభూమి నాకు స్వర్గముకంటె మిన్నయైనవి. —శ్రీరాముడు

* దేశంలో దారుఢ్యవంతులైన ఒక్క పురుషుడుగాని స్త్రీ గాని, పనీ తిండీ లేకుండా ఉన్నంత వరకు మనము విశ్రాంతిగాని, పూర్ణభోజనముగాని అనుభవించడానికి సిగ్గుపడవలసివుంటుంది.

— మహాత్మాగాంధీ

* ప్రజలను ప్రేమించలేనివాడు దేశభక్తుడు కాడు, కాలేడు.

—టంగుటూరి ప్రకాశం పంతులు

* ఆలోచించలేని పసిపాపకు ఆకలయినపుడు మాత్రమే తల్లి గుర్తుకు వస్తుంది. కడుపు నిండగానే అమ్మను మరచిపోతుంది. ఇదే రీతిలో ప్రవర్తిస్తూ కష్టాలు వచ్చినపుడు మాత్రమే దేశాన్నీ జాతినీ గుర్తు చేసుకోవడం ఉత్తమ దేశభక్తుని లక్షణం గాదు. —దీనదయాళ్ ఉపాధ్యాయ

లోలుగునట్లు పలుకు వానిని నిస్సారునిగను, బలవంతుని గర్వితునిగను, పండితుని వాచాలునిగను తలచెదరు.

—భర్తృహరి

(చూడుడు : అల్పులు)

**దురాశ**

* పొదుగు కోసి పాలు త్రాగినట్టు —సామెత

**దేశభక్తి**

* అపి స్వర్ణమయీ లంకా నమే లక్ష్మణ రోచతే
జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ॥
లక్ష్మణా ! సువర్ణముతో నిండిన ఈ లంకా పట్టణము నన్నాకర్షించుట లేదు. జనని, జన్మభూమి నాకు స్వర్గముకంటె మిన్నయైనవి. —శ్రీరాముడు

* దేశంలో దారుఢ్యవంతులైన ఒక్క పురుషుడుగాని స్త్రీ గాని, పనీ తిండీ లేకుండా ఉన్నంత వరకు మనము విశ్రాంతిగాని, పూర్ణభోజనముగాని అనుభవించడానికి సిగ్గుపడవలసివుంటుంది.

— మహాత్మాగాంధీ

* ప్రజలను ప్రేమించలేనివాడు దేశభక్తుడు కాడు, కాలేడు.

—టంగుటూరి ప్రకాశం పంతులు

* ఆలోచించలేని పసిపాపకు ఆకలయినపుడు మాత్రమే తల్లి గుర్తుకు వస్తుంది. కడుపు నిండగానే అమ్మను మరచిపోతుంది. ఇదే రీతిలో ప్రవర్తిస్తూ కష్టాలు వచ్చినపుడు మాత్రమే దేశాన్నీ జాతినీ గుర్తు చేసుకోవడం ఉత్తమ దేశభక్తుని లక్షణం గాదు. —దీనదయాళ్ ఉపాధ్యాయ

* ఏది లేకుండా నేను లేనో అట్టిదైన నా దేశం నా కంటె ముఖ్య మైనది అనే భావనయే దేశభక్తి.

—మన్నవ గిరిధరరావు

## దేశము

* దేశమంటే మట్టి కాదోయ్
దేశమంటే మనుషులోయ్
దేశమనియెడి దొడ్డ వృక్షము
ప్రేమలను పూలెత్తవలెనోయ్
నరుల చెమటల తడిసి మూలము
ధనము పంటలు పండవలెనోయ్

—గురజాడ అప్పారావు

* వ్యక్తికి దేహము ఎలా ముఖ్యమో సమష్టికి దేశమలా ముఖ్యం. పంటను రక్షించుకోవడానికి కంచె అవసరమైనట్లే దేశానికి రక్షణగా చక్కని రాజనీతి కావాలి. రక్షణ దాని లక్షణంగా వుండాలి. పంటకు మాత్రమే ప్రాముఖ్యమిచ్చి కంచెను నిర్ల క్ష్యం చేయడం వంటిదే అభివృద్ధికి ప్రాముఖ్యమిచ్చి రక్షణను నిర్లక్ష్యం చేయడం కూడా. —సత్యసాయిబాబా

* ఒక రాజ్యంయొక్క విలువ, ఆలోచించి చూస్తే, అందు నివ సించే వ్యక్తుల విలువకు సమానం.

—జాన్ స్టువర్ట్ మిల్

## దైవత్వం

* భిన్నత్వం లేనిదే దైవత్వం —మాతృశ్రీ అనసూయాదేవి

* దైవత్వానికి నాలుగు మూలస్తంభాలున్నాయి. అవి : సత్యము (Truth), శీలము (Character), పవిత్రత (Purity), సమైక్యత (Unity). —విశ్వయోగి విశ్వంజీ

## దొంగ

* పని చేయనివాడు ఇంటిదొంగ ; పన్ను కట్టనివాడు దివాణానికి దొంగ —సామెత

* "నేరం నాదికాదు ఆకలిది" —"రోటీ" సినిమా నుండి

* దొంగకూ దొంగకూ పరిచయం లేకపోయినా స్నేహితులే. —కన్నడ సామెత

* తెరచియున్న ద్వారము సన్యాసిని గూడ ప్రలోభపెట్టవచ్చు.[1] —ఆంగ్లసామెత

* దొంగతల్లికి ఏడుప భయము. —సామెత

## దుఃఖము

* ఈర్ష్యాళువు, జుగుప్సావంతుడు, నిస్సంతోషి, క్రోధనుడు, నిత్యశంకితుడు, పరభాగ్యోపజీవి అనువారు ఆరుగురును దుఃఖభాగులని నీతికోవిదులు చెప్పుదురు. —నీతిచంద్రిక

* నేను కర్తనను తలంపే మానవునకు దుఃఖ కారణము. —సత్య సాయిబాబా

* చేసిన కర్మమునకు ప్రతిఫలమపేక్షించుట చేతనే దుఃఖము కలుగుచున్నది. —పానుగంటి లక్ష్మీనరసింహారావు

---

1 An open door may tempt a saint. —Proverb

## ద్రోహము

* అన్నం పెట్టిన ఇంటికే కన్నం వేసినట్లు —సామెత
* పాలుత్రాగి రొమ్ము గ్రుద్దినట్లు. —సామెత

## ధనము, ధనవంతులు

* ఒక రకంగాచూస్తే మన సంపాదన మనం తొడుక్కునే జోళ్ళ వంటిది. కావలసిన సైజుకంటె తక్కువైతే కరచి బాధ పెడుతుంది; ఎక్కువైతే సరిగా నడవలేక బోర్లపడతాం -కోల్టన్
* ధనము నీకు ఆహారాన్నిస్తుంది గాని ఆకలి నివ్వదు ; మందుల నిస్తుంది గాని ఆరోగ్యాన్నివ్వదు ; పరిచయాల నిస్తుంది గాని స్నేహితుల నివ్వదు; సేవకుల నిస్తుందిగాని విశ్వాసాన్నివ్వదు; సంతోషపు దినాలనిస్తుందిగాని శాంతినివ్వదు.

— హెన్రిక్ ఇబ్సన్

* డబ్బే సర్వస్వమనుకొనువారికి తండ్రీ లేడు బంధువూ లేడు. (అర్థాతురాణాం న పితా న బంధుః) —సూక్తి
* బంగారానికి రెక్కలుంటాయి. అవి నిన్ను ఎక్కడికైనా గొని పోతాయి, స్వర్గానికి తప్ప. —ఆంగ్లసామెత
* శ్రమపడకుండా వచ్చిన సంపద చెరుస్తుంది, బలహీనపరుస్తుంది.[1]

— గిరిలాల్ జైన్

* వచ్చునపుడు తోడు తెచ్చి పాపాలను
ఒంటరిగనె వెళ్ళునంట ధనము. —ఆత్రేయ

---

[1] Unearned wealth corrupts and debilitates.

—Girilal Jain

* ధనముతో ఎట్టిపని నైనా సాధించవచ్చుననే అభిప్రాయం గల వారు ధనంకోసం ఎట్టిపనైనా చేయడానికి వెనుదీయరని అనుమానించ వచ్చును. —హాలిఫాక్స్

* ఇచ్చేవాడుంటే చచ్చేవాడైనా లేచి వస్తాడు. —సామెత

* గౌరవంతో డబ్బురాదు; డబ్బుతో గౌరవం వస్తుంది. —పాతూరి సుబ్బరాయశాస్త్రి

* ధనాన్ని కూడబెట్టుకుంటే మనుష్యులు క్షీణిస్తారు.[1] —ఆలివర్ గోల్డుస్మిత్

* ఓ లక్ష్మి! క్షమించు. నిన్ను గురించి ఒక నీచమైన వార్త లోకమందు వ్యాపించి యున్నది. అది నీకు చెప్పవలసివచ్చినందుకు చాలా కష్టముగా నున్నది. పురుషులు నిన్ను సేవించినందువలన గ్రుడ్డివారగు చున్నారట! అయినా కాకపోతే పద్మదళములంత విశాలములైన నేత్రములుగల విష్ణువు ఆదిశేషుని పక్కగా చేసుకొని ఎందుకు పడుకొంటాడు ? —ఒక సంస్కృత కవి

* సంపాదించిన ధనమునకు త్యాగమే రక్షణము. చెఱువునుండి పొర్లుచున్న నీటికి పారుదలయే రక్షణము. —విక్రమార్క చరిత్ర

---

1 When wealth accumulates, men decay. — Oliver Goldsmith

* డబ్బులేని బ్రతుకు మబ్బుపట్టిన రాత్రి
డబ్బుతోడ వచ్చు నిబ్బరమ్ము
డబ్బులేనివాడు డుబ్బుకు కొరగాడు. —నార్ల వెంకటేశ్వరరావు

* విత్తము కొద్దీ వైభవము. —సామెత

* నేను కూడబెట్టిన ధనమే చెఱసాలవలె నన్ను బంధించినది.
నా ఖజానాయే నా కారాగృహము.
—రవీంద్రనాథ టాగోర్

* డబ్బు ఉండడం గొప్పతనానికి చిహ్నంగా భావిస్తారు. ఆ
డబ్బు ఎలా వచ్చిందో ఎవరూ అడగరు - అవసరం లేదు.
ఎలా వచ్చినా ఫరవాలేదు. ప్రస్తుతం ఈ నాగరికతనే
భారతీయులు సంస్కారం అనుకుంటున్నారు- ఊబవళ్ళు
సౌందర్యం అనుకున్నట్లు. —లత-"సిరిసిడలు"లో

* ధనవంతులు తరచుగా ఇతరుల బాధల నెరుంగరు.
(లక్ష్మీవన్తో న జానన్తి ప్రాయేణ పరవేదనమ్)
—సంస్కృతసూక్తి

* తల్లి గర్భమునుండి ధనము తేడెవ్వండు
వెళ్ళిపోయెడి నాడు వెంటరాదు
లక్షాధికారైన లవణమన్నమెగాని
మెఱుగు బంగారంబు మ్రింగబోడు
విత్తమార్జనచేసి విఱ్ఱవీగుటెగాని
కూడబెట్టిన సొమ్ము కూడరాదు

పొందుగా మఱి గైన భూమిలోపల బెట్టి
    ధానధర్మము లేక దాచిదాచి
తుదకు దొంగల కిత్తురో దొరలకవునా
తేనెజుంటీగ లియ్యవా తెరువరులకు

—నారసింహశతకము

* ధనమున కెవ్వఁడు దాసుడు కాడో, ధనమెవ్వనికి దాస్యము చేయునో వాడే నిజమైన మానవుడు.

—శ్రీ రామకృష్ణ పరమహంస

* డబ్బనేది పోయేటపుడు ఎల్లాగ చేతులూ కాళ్ళూ వచ్చిపోతుందో వచ్చేటపుడు గూడ అలాగే వస్తుంది.

—టంగుటూరు ప్రకాశంపంతులు

* సర్వే గుణాః కాంచన మాశ్రయంతే

—సంస్కృతసూక్తి

* ధనం అజ్ఞానిని శాసిస్తుంది, జ్ఞానికి సేవచేస్తుంది. —సూక్తి

* నూరుదాకా నన్ను పెంచితే తరువాత నేనే పెరుగుతా నన్నదట !

—సామెత

* కడు వికృతాంగు చక్కని వానిజేయు
రసికతలు ఇంతలేని నిరక్షరికు
పావనం బైన సకల విద్యావిశాలు
దనగ జేయు ధనము తథ్యంబు వినుము

—పూర్వకవి

* డబ్బు ఎరువు లాంటిది. చుట్టూ వెదజల్లితే ఎంతో మేలు కలిగిస్తుంది; ఒకచోట పేరబెట్టి వుంచితే భరించరాని కంపు కొడుతుంది[1] —క్లింట్ మన్చిసన్

* డబ్బుమీది వ్యామోహమే అన్ని చెడులకూ మూలం.
—ఆంగ్ల సామెత

* డబ్బులేని వానికి బోగంది తల్లి వరస ! —సామెత

* పైసా మన చేతుల్లో ఉంటే ఈ భూమి, అంటే ఈ ప్రపంచం, అంటే ఈ ప్రపంచంలో ఉన్న మనుష్యులూ, మృగాలూ, వస్తువులూ అన్నీ మన చుట్టూ తిరుగుతాయి. ఇదీ సిసలైన కల్తీలేని సత్యం. —ఆత్రేయ

* భూమి తనచూట్టూ తాను తిరుగుతూ
ధనవంతుడి చుట్టూ తిరుగుతోంది.
—దేవరకొండ బాలగంగాధర తిలక్

* డబ్బు ఒక అడుగులేని సముద్రం. దానిలో నీతి, నిజాయితీ, గౌరవం, సత్యం అన్నీ మునిగిపోతాయి. —థోరో

* ధనాన్ని కోరుతుంది ధనం
దాని పర్యవసానం అశాంతి ఆవేదన —ఖలీల్ జిబ్రాన్

---

1 Money is like manure. If you spread it around, it does a lot of good. But if pile it up in one place it stinks like hell. —Clint Munchison

## ధీరుడు

* ఏదీ తనంత తానై
నీదరికి రాదు
శోధించి సాధించాలి
అదియే ధీరగుణం.

—శ్రీరంగం శ్రీనివాసరావు



## ధర్మము

* లోకమున జీవులు ధర్మముచే తేలికైనవారై తెప్పలవలె తేలిపోవుదురు. పాపముచే భారము చెందినవారై నీటిలో విడిచిన శస్త్రములవలె మునిగిపోవుచుందురు. —భారతము 1-15



* సత్యము, ధర్మము, శాంతి, ప్రేమ యనునవి నాలుగును సనాతన ధర్మమునకు మూలాధార స్తంభములు.



—సత్యసాయిబాబా

* ధర్మము అద్దమువంటిది. అది మన కర్తవ్యము మనకు ప్రబోధించును. అది మన ప్రవర్తన మనకు చూపించును. తండ్రికెదురుతిరిగినవాడు తన కొడుకుచే అవమానింపబడును. మిత్రులను మోసగించినవాడు మిత్రులను కోల్పోయి తన్నుతాను మోసగించుకొనును.

—ఎక్కిరాల కృష్ణమాచార్య

* దంభరహితముగా సలుపునదియే ధర్మమని చెప్పబడును.

—మహామంత్రి చాణక్యుడు

* కోట్లాది ప్రజల కందరాని కలిమిని, సుఖమును అనుభవింపకుము. పట్టుదలతో నిరాకరింపుము. ఇదియే ధర్మము.

—మహాత్మాగాంధీ

* చేప కదలికకు నీరు ఎలాతోడ్పడునో ధర్మము జీవుల కదలికకు అట్లు సహాయపడును. — జైన ధర్మము

* నీకు ఇతరులు ఏదిచేయాలని కోరుకుంటావో, అదే నీవు ఇతరులకు చెయ్యి. —న్యూటెస్టమెంట్

* తానేదికోరునో ఇతరుల కదే కోరవలెను.

—మహమ్మద్ ప్రవక్త

* ఒరులేయవి యొనరించిన
నరవర యప్రియము తన మనంబున కగుఁ దా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమ ధర్మపథముల కెల్లన్

—భారతములో విదురనీతి

* వేదశాస్త్రముల సారము రెండు మాటలే. పరుల కుపకారము చేసిన పుణ్యము, పరులను బాధించిన పాపము కలుగును.

—వ్యాసమహర్షి

## ధ్యేయము

* సింధువును చేరి బిందువు సింధువగును
ధ్యేయమును బట్టి ప్రతిపని దివ్యమగును.

—గాలిబ్ గీతాలు (అను : దాశరథి)

## నమ్మకం

* ఒక్కటేమిటి, ఏదైనా చేస్తాను - నా క్కొంచెం నమ్మకమివ్వు. నమ్మకంలేని బొందె - ఖాళీసిగరెట్టు టిన్ను. నమ్మకం లేని హృదయం – పుల్లలులేని అగ్గిపెట్టె. నమ్మకం లేని బ్రతుకు - కాలిన సిగరెట్టు బూడిద. —బైరాగి

## నమ్రత

* నమ్రత అంటే సరియైన అర్థం అహంభావ శూన్యత. అహం భావ రాహిత్యమే మోక్షసిద్ధి. నమ్రత లేకుండా చేసే సేవ స్వార్థభూయిష్టమూ, అహంభావపూరితమూ అవుతుంది.

—మహాత్మాగాంధీ

* పండ్లచే భారవంతమైన చెట్టు వంగియుండును. నీవు ఘనుడవు కాదలచినచో అణకువ కలిగి యుండుము.

—శ్రీ రామకృష్ణ పరమహంస

* అనువుగానిచోట అధికుల మనరాదు
కొంచెముండుటెల్ల కొదువగాదు
కొండ అద్దమందు కొంచెమై యుండదా. —వేమన

## నవ్వు

* మనం నవ్వొచ్చే సంగతి ఏదైనా చెప్పి మనమే నవ్వటానికి ప్రారంభిస్తే హెదుండదబ్బి దానంతటదే తుమ్మదానికి తగులు కున్నట్లుంటుంది. —ప్రెస్టన్

* వడ్డించేవాడు వడ్డన సమయంలోనే తనుగూడా ఓచేత్తో తింటూ వడ్డిస్తే భోక్తలకి అసహ్యంగావుంటుంది. నవ్వించదలుచుకున్న వాడూ నవ్వితే నలుగురూ నవ్విపోతారు గాని నవ్వరు.

—భమిడిపాటి కామేశ్వరరావు

* నవ్వవు జంతువుల్, నరుడు నవ్వును
నవ్వులు చిత్త వృత్తికిన్ దివ్వెలు. —గుఱ్ఱం జాషువా

* నవ్వు నాలుగందాల చేటు. —సామెత

* నీవు శోకిస్తే నీవొక్కడవే శోకిస్తావు
నీవు నవ్వితే నీతో పాటు అందరూ నవ్వుతారు. —బీర్బల్

## నక్షత్రాలు

* తారలెల్ల పగలు పరదాల దాగి
రాత్రివేళ నవి దిగంబరము లయ్యె

—గాలిబ్ గీతాలు (అను :దాశరధి)

## నాగరికత

* మగవానిలో సత్యము, మగువలో పాతివ్రత్యమును తీసివైచిన నిక నిజాయితీ యెక్కడిది ? లేనపుడు నాగరికత యేది ?

—పానుగంటి లక్ష్మీ నరసింహారావు

* నిజమైన నాగరికత కోరికలను అదుపులో పెట్టుకోవడంలోనే ఉన్నది గాని హెచ్చించుకొనుటలో లేదు.

—మహాత్మాగాంధీ

## నాటకము

* ప్రేక్షకులందరూ ఆనందంకోరుతారు. గుంపు నేత్రానందాన్ని, స్త్రీలు హృదయానందాన్ని, ఆలోచనాపరులు బుద్ధిగతమైన ఆనందాన్ని కోరుతారు. —విక్టర్ హ్యూగో

## నాయకుడు

* ఆత్మవిశ్వాసం, ధైర్యం, పట్టుదల- వీటితో అనేక మంది నాయకులయ్యారు. —మహాత్మాగాంధీ

* జనాన్ని సమీకరిస్తూనే
ధనాన్ని సమీకరిస్తున్నాడు
మూలధనం లేకుండానే
వాడు నాయకుడు. —ముక్కామల వెంకటేశ్వరరావు

## నిగ్రహము

* విద్యుచ్ఛక్తి ప్రతి మానవునిలోను గలదు. కళ్ళు, గోళ్ళు, వెండ్రుకల ద్వారా అది బయల్వెడలును. మితభాషణము, మితస్వచ్ఛాహారము, ఇంద్రియ నిగ్రహముల వలన దానినభివృద్ధి నొందించవచ్చును. —పానుగంటి లక్ష్మీనరసింహారావు

* గంగానదికి పెద్ద ఆనకట్ట కడితే సరిపోదు ఆనకట్ట వలన నిలువ చేయబడిన నీటిని ఉపయోగించుకొనేటందుకు కాలువలు త్రవ్వి ఆ నీటిని నూతన క్షేత్రాలకు తరలించాలి కాలువలు లేనపుడు మరీ పెద్ద ఆనకట్టకడితే, నీటి ఒత్తిడి ఎక్కువై డామ్ బ్రద్దలైపోతుంది. అట్లే ఇంద్రియ నిగ్రహం అనునది ఆధ్యాత్మిక సాధనలో ఒక భాగం మాత్రమే. ఇంద్రియ నిగ్రహము

వలన ఉత్పన్నమగు మహాశక్తిని సాధకుడు నిర్మాణాత్మకమగు నూతన కార్యక్రమములలో వినియోగించాలి.

—స్వామి చిన్మయానంద

* మనసు అదుపులో నుండిన
తను వెటు పోయిన నేమగు ?
ఛాయ నీరమందు పడిన
కాయము తడియదు కదా ? —హిందీకవి రహీం

## నిద్ర

* లేమికి భయపడి నిద్రయం దాసక్తి విడువుము.

—బైబిలు-సామెతలు 20-13

* నిద్ర ! అమాయకపు నిద్ర !
చిక్కులు పడ్డ జీవనదారాలను సరిజేస్తుంది
అది ప్రతి దిన బ్రతుకుకు మరణం
శ్రమతో అలసిపోతే హాయినిచ్చే స్నానం
ఉదాత్తమైన ప్రకృతి చేసే విందులో ముఖ్య వంటకం,
జీవితపు విందులో ప్రధాన బలవర్ధకం.

—షేక్స్పియర్. (మాక్బెత్ 2-2)

* నిద్రపోని రోజునగాని నిద్ర విలువ తెలియదు.

—మన్నవ గిరిధరరావు

* బలవంతులతో విరోధం దుర్బలులకు ఉచితం కాదు. అటువంటి వారికి రాత్రివేళ నిద్రపట్టదు. ఇతరుల సంపదలు హరించిన వారికీ, కాముకునికీ, చోరునికి నిద్రరాదు.

—భారతములో విదురనీతి

* నిద్ర - చావుకు చిన్న తమ్ముడు.

—గోళ్ళమూడి గోపాలకృష్ణమూర్తి

## నిర్లిప్తత

* కొండకు ఒక వెంట్రుక ముడివేసి లాగితే వస్తే కొండే వస్తుంది, పోతే వెంట్రుకే పోతుంది. —సామెత

* కామమ్మ మొగుడు కాబోలంటే కాబోలనుకున్నాను ; కాదంటే నా కర్రాబుర్రా బయట పడెయ్యండి వెళ్ళిపోతానన్నట్లు.

—సామెత

## నేను

* అహం లో అంతా వుంది. సంస్కృతంలో 'అ' మొదటిఅక్షరం. 'హ' చివరి అక్షరం. కనుక అహాన్ని (నేనును) తెలుసుకుంటే అంతా తెలుసుకున్నట్లే. —రమణమహర్షి

* 'నాది' అనేదాన్ని త్యజించుట వలన చిత్తశుద్ధి కలుగుతుంది.

—రమణమహర్షి

## నేర్చుకొనుట

* ఎన్నియో నీతులు పశు పక్షి కీటకములనుండి మనుజుడు నేర్చుకోవలసి యున్నది. గాడిదనుండి యోరిమి, చీమ నుండి దూరదృష్టి, సాలె పురుగునుండి పట్టుదల, కుక్కనుండి విశ్వాసము, గువ్వనుండి ఏకపత్నీవ్రతము - ఇటులెన్ని చెప్పవచ్చును ?

—పానుగంటి లక్ష్మీనరసింహారావు

* మానవుడు సింహము వలన గొప్పపనియైనను సులభముగా సాధించుట నేర్చుకోవలెను. కొంగ వలన ఇంద్రియములను నియమించి దేశకాలముల గుర్తెరింగి కార్యమును సాధించుట గ్రహించవలెను. వెన్నిక సంగర మొనర్చుట, స్వార్జిత పదార్థములనే అనుభవించుట కోడివలన తెలియనగును. దాంపత్య సుఖమును రహస్యముగ ననుభవించుట కాకి వలన అభ్యసింప దగును. —మహామంత్రి చాణక్యుడు

* అజ్ఞానం వలన తప్పులు చేస్తాం, తప్పులవలన నేర్చుకుంటాం. —ఆంగ్లసామెత

* భవిష్యత్తులో తప్పులు చేయకుండా వుండడానికి, గతములో చేసిన తప్పుల నుండి నేర్చుకో. రోగిని కాపాడడానికి రోగాన్ని బాడుగకు తీసుకో.[1] —మావ్ సేటుంగ్

* బీజాన్ని భూమిలో పెట్టి, గాలి సమృద్ధిగా లభించేటందుకు చుట్టూ నేల గుల్లచేసి, కావలసిన నీళ్ళు పోస్తాము. ఆ బీజం మొలకెత్తి మహావృక్షమవుతుంది. గాలి, భూమి, నీరు, వెలుతురు. వీటి నుపయోగించుకొనేగదా అది అంత వృక్షమైనది? అయినా దాన్ని గాలి అంటామా? నీరు అంటామా? భూమి అంటామా? వాటిల్లో ఏదీ కాదు. అన్నిటిని ఉపయోగించుకొని తన వ్యక్తిత్వంతో మహా వృక్షంగా పెరిగింది. మనం చేయవలసిందీ అదే.

---

1 Learn from the past mistakes to avoid future ones. Hire sickness to save the patient —Mao Tse Tung

ఇతరుల నుండి మంచి విషయాలు నేర్చుకో. వాటిని నీలో ఇముడ్చుకొని నీ ప్రకృతి ననుసరించి అభివృద్ధి చెందు. అంతే గాని ఇతరునిగా మారిపోకు. —స్వామి వివేకానంద

## నోరు

* తల విలువ నోరు చెప్పుతుంది.

* నోరా ! వీపుకి తేకే.

* ఏంపెట్టుకు బతికేదే అమ్మా అంటే, నోరుపెట్టుకు బతకవే కూతురా అన్నదట !

* నాలుక ఉన్నవాడు నాలుగు దిక్కులు తిరగ గలడు.

—సామెతలు

## న్యాయము

* న్యాయం జరగడ మాలశ్యమైతే న్యాయం చేయనట్లే[1]

—సూక్తి

* శాసనములు ఒక రకపు వలల లాంటివి. అందలి చిల్లుల్లో నుండి చిన్నవాళ్ళు దూరి బయటికి పోతారు ; బలవంతులు వల చించేసి పారిపోతారు. మధ్యరకం వాళ్ళు మాత్రం అందులో ఇరుక్కుంటారు. —బేకన్

* చట్టాల ఉద్దేశ్యం ప్రస్తుత పరిస్థితులకు అనువుగా ఉండటం, మన పరిస్థితిని మెరుగు పరచుకోవడంలో మనం తోడ్పడటం.

---

[1] Jutice delayed is justice denied.

మారుతున్న పరిస్థితులను బట్టి అవిగూడా మారాలి. లేకపోయి నట్లయితే ప్రపంచం ముందుకు సాగిపోతూ ఉండగా, అవి మనల్ని వెనక్కి లాగే ఇనుపగొలుసులుగా మారుతాయి. ఏ చట్టంగూడా మార్చడానికి వీలులేని చట్టం కాబోదు.

—జవహర్లాల్ నెహ్రూ

* న్యాయం కోసం కోర్టుకు వెళ్ళడమంటే పిల్లికోసం ఆవును వదలు కోవడం లాంటిది. —సర్ వాల్టర్ స్కాట్

* హేతువు న్యాయానికి ప్రాణం. —సర్ ఎడ్వర్డు కోక్

* బంగారమా, సీసమా అనే తారతమ్యం త్రాసుకు లేదు.

—ఆంగ్లసామెత

* చట్టము పేదవారిపై సవారిచేస్తుంది ; ధనవంతులు చట్టంపై సవారి చేస్తారు. —గోల్డుస్మిత్

* అగ్రహారం పోతే పోయిందిగాని 'యాక్టు' తెలిసింది అన్నా డట. —సామెత

* అన్నిటికంటె పైనున్నది పరలోకం
కూర్చుంటా దక్కడొక న్యాయమూర్తి
ఏ రాజూ లొంగదీసుకోలేదతన్ని —షేక్స్పియర్

## న్యాయవాది

* నీ శత్రువుల బారినుండి నీ ఆస్తి కాపాడి తానుంచుకొను పెద్ద మనిషియే న్యాయవాది. —ఆంగ్లసామెత

* లాయరనగా కోపాన్ని, మాటలను అద్దెకిచ్చే మాంత్రికుడు.

—గోళ్ళమూడి గోపాలకృష్ణమూర్తి

* చీకటిలోంచి వెలుగు తేవడానికి లాయర్లు నల్లకోటు వేసుకుంటారు.

—సినీ సూక్తి

## న్యాయస్థానం

* అబద్ధాలకు పాములపుట్ట - కోర్టు.

—రాచకొండ విశ్వనాధశాస్త్రి

## పండితుడు

* 'అహ మేవ పండితః' అనుకుంటారు ఆరంభ దశలో. కొంత దూరం సాగేసరికి 'అహం చ పండితః' అనవలసి వస్తుంది. మరికొంత దూరం పోయేసరికి 'అహం న పండితః' అని వొప్పేసుకొంటారు. ఇది సాధారణంగా జరిగే పరిణామం.

—పుచ్చా పూర్ణానందం

* కాలువ గప్పినంత మాత్రాన ధీశాలిత్వం రాదనడానికి ఒక ఉదాహరణ గంగిరెద్దు.

—ఉమాపతి పద్మనాభశర్మ

* పాండిత్యము అధికారము సమాన విలువలు గలవికావు. రాజు స్వదేశంలో మాత్రమే గౌరవింపబడగా, విద్వాంసుడు సర్వత్ర పూజింపబడుచున్నాడు.[1]

—పూర్వకవి

---

[1] విద్వత్వంచ నృపత్వంచ నైవతుల్యే కదాచన
స్వదేశే పూజ్యతే రాజా విద్వాన్ సర్వత్రపూజ్యతే

* 1. క్రోధము, లజ్జ, గర్వము, హర్షము, ఆత్మస్తుతి ఎవనిని వంచించవో వాడే విద్వాంసుడు.

2. ప్రజలు ఎవని సలహాలను గ్రహిస్తారో వాడే పండితుడు.

3. విషయాలను స్వల్పకాలంలో గ్రహిస్తూ, అప్రస్తుత ప్రసంగం చెయ్యకుండా, దుర్లభ వస్తువులను కోరకుండా, విపత్తులలో ధైర్యం పోగొట్టుకొనకుండా, పోయిన వాటికోసం శోకించకుండా, ఆరంభించిన కార్యాలను మధ్యలో ఆపకుండా, సోమరియై కూర్చోకుండా, మనస్సును వశపరచుకొని చరించువారు పండితులు.

4. వారెప్పుడూ మంచి పనులే చేస్తారు. కృతజ్ఞులై వుంటారు.

5. ఆదరిస్తే ఆనందము, అనాదరిస్తే ఆగ్రహము పొందరు.

6. పదార్థాల యదార్థ స్వభావము వారికి తెలుస్తుంది.

7. ఒకానొక కార్యం చెయ్యడానికి ఉత్తమ సాధనాలు గుర్తెరిగి వుంటారు.

8. వారి బుద్ధి విద్యలను అనుసరిస్తుంది. వారి విద్య బుద్ధియొక్క అదుపులో వుంటుంది. —భారతములో విదురనీతి

## పండుగలు

* స్తబ్ధంగా ముడుచుకున్న సంఘానికి
చలిమంటల చితుకులు పండుగలు
పండుగలు కడుపు నింపుకోవటానికి కాదు
గుండెల్ని ఉతికి ఆరెయ్యటానికి —సి. నారాయణరెడ్డి

**పతనము**

* నాశనమునకు ముందు గర్వము నడచును ;
పడిపోవుటకు ముందు అహంకారమైన మనస్సు నడచును.

— బైబిలు - సామెతలు 16-18

**పత్రికలు**

* పత్రికొక్కటున్న పదివేల సైన్యము
పత్రికొక్కటున్న మిత్రకోటి
ప్రజకు రక్షలేదు పత్రికలేకున్న —నార్ల వెంకటేశ్వరరావు

* శత్రుత్వం వహించిన నాలుగు వార్తాపత్రికలు వెయ్యితుపాకీ గుండ్ల కంటె భయంకరమైనవి.

—నెపోలియన్ బోనాపార్టీ

* నేను అమెరికా అధ్యక్ష పదవి నైనా వదులుకుంటానుగాని ఒక పత్రికకు ఎడిటర్ పదవి వస్తేమాత్రం వదులుకోను.

—థామస్ జఫర్‌సన్

* పత్రికలు అనధికార ప్రజాప్రతినిధుల వంటివి.

—జీన్‌పాల్‌సార్త్రే

* వార్త పవిత్రం, వ్యాఖ్య నీ యిష్టం. (News is sacred, comment is free). —పత్రికల ధర్మసూత్రం

**పత్రికా విలేఖరి**

* విలేఖరికి తిరిగిందే విద్య - పక్షికి ఎగిరిందే బలంలాగా.

—జి. కృష్ణ

## పని

* 'గడియారమ్మా ! నీకు విశ్రాంతి ఎప్పుడు ?'
'నాకు విశ్రాంతి ఒక టిక్కుకూ మరొక టిక్కుకూ నడుమ !'

* ఇపుడు చిన్న పనులను చక్కగా నిర్వహిస్తే, మున్ముందు పెద్ద పనులు చేయవలసిందిగా కోరుతూ వాటంతటవే వస్తాయి.
—పర్షియన్ సామెత

* ఎక్కడ కాయకష్టం హేయంగా చూడబడుతుందో అక్కడ ఫలితం స్తబ్ధత, క్షీణత, మృత్యువు. అపుడు కళ కష్టంగా మారుతుంది. ఎక్కడ పరిశ్రమ ప్రేమించ బడుతుందో అక్కడ తేజం ఉదయిస్తుంది. కష్టం కళగా మారుతుంది.
—స్వామిరామతీర్థ

* పనిలో కఠినంగా వుండడం మంచిది
మాటలో కటువుగా వుండడం చెడ్డది.
—జవహర్లాల్ నెహ్రూ

* ఎముకలు అరిగేటట్లు పనిచేస్తే దంతాలు అరిగేటట్లు తినవచ్చు.
—మళయాళ సామెత

* ఏదైనా ఒక పనిని గూర్చి ఆ పని చెయ్యనివాళ్లు ఆదర్శ ప్రాయంగా మాట్లాడుతారు.
—భమిడిపాటి కామేశ్వరరావు

* చీమలు పాకితే రాళ్ళరుగుతాయట. —లోకోక్తి

* ఒక పనిలో విఫలం కావడం నేరంకాదు। చిన్న ఆశయం పెట్టుకోవడం నేరం[1]
—కార్లయిల్

* ఒక్కొక్కటిగా పడే నీటిబొట్లు రాళ్ళను అరగదీస్తాయి.
—ల్యూక్రేషియన్

* శాంతికాలంలో ఎక్కువ చెమటకారిస్తే యుద్ధకాలంలో తక్కువ రక్తం కార్చవచ్చు. —సైనికుల గూర్చిన సామెత

* ఏపనీ అల్పంగాదు. ఇష్టమైన పని లభిస్తే పరమమూర్ఖుడుగూడా చెయ్యగలడు. అన్ని పనులనూ తనకిష్టమైనవిగా చేసుకోగల వాడే నిజంగా తెలివితేటలు గలవాడు.
—స్వామివివేకానంద

* 'దిల్ మే రామ్' హాత్ మే కామ్' అన్నారు. హృదయములో దేవుని ప్రతిష్ఠించుకొని చేతులతో పనులు చేయాలి.
—విశ్వయోగి విశ్వంజీ

* దున్నకుండా చల్లితే కొయ్యకుండా పండుతుంది.
—తెలుగుసామెత

* సముద్ర కెరటాలు, గాలులు, ఎల్లప్పుడు సమర్థతగల నావికుని వైపునే ఉంటాయి. —గిబ్బన్

---

[1] Not failure, but low aim is crime —Carlyle

* శ్రమ పడుచే జాతికిసిరి
శ్రమపడుచే రాజ్యమునకు సంపద, యెచటన్
శ్రమ కన్పడు నచ్చటనే
రమ కన్పడు నఖిల సుఖపరంపర లిడగన్.

—తుమ్మల సీతారామమూర్తి చౌదరి

* తేనెటీగకు తీరిక వుండదు. —ఆంగ్లసామెత

* ఒకనికి నీవు చేపను గనుక ఇస్తే
అతడు దాన్ని ఒకమారు భుజిస్తాడు
నీవతనికి చేపలు పట్టడం గనుక నేర్పితే
జీవితాంతం భుజించగలడు.[1]

—కా-యున్-ఇజు, చైనా వేదాంతి

* పెట్టేటపుడు నెయ్యి కారేటట్లు పెట్టాలి ; పని చేయించేటపుడు చెమట కారేటట్లు చేయించాలి.

—తెల్లాకుల జాలయ్య

* రేపు : నేటి పనివత్తిడిని తగ్గించే సులభసాధనం.

—గోళ్ళమూడి గోపాలకృష్ణమూర్తి

---

[1] If you give a man a fish
he will eat for once
If you teach him to fish
he will eat for the rest of his life. —Ka-un-lzu

* పని యన్నంతనె భయము గలుగు
పనికి దిగినంతనె యది తొలగు
నిండుగ మునిగినవానికి చలిలేని
యటుల యది నిక్కమగున్.

—యార్లగడ్డ రంగనాయకులుచౌదరి

* కూరుచున్నవాని అదృష్టం కూలబడే ఉంటుంది; నిలుచున్న వాని అదృష్టం లేచి నిలుచుంటుంది. పడిఉంటే పడిఉంటుంది. లేచి పురోగమించిన వాని అదృష్ట సౌభాగ్యాలు పురోగతినే పొందుతాయి. కనుక నడు-ముందుకు నడు.

—ఉపనిషద్వాక్యం

* పార్థా! మూడు లోకముల యందును నేను చేయవలసిన కర్తవ్య మేమియును లేదు. నేను పొందదగినదియు పొందబడనిదియు లేదు. అయినను నేను కర్మనాచరించుచునే యున్నాను.

—భగవద్గీత (3-22)

* వాడుచున్న తాళపుచెవి మెరయుచుండును....
కదలని నీరు క్రిములకు స్థావరము....
కదలని పశులను కొట్టుట సులభము....
ఎగిరెడి పక్షి అందదు. —స్వామి రాజేశ్వరానంద

* సింహము చర్మము చౌకగ దొరకదు. —అంగ్లసామెత

* రాజమార్గమవై విరాజిల్లకున్న
కాలిబాటవు నీవు కా ప్రయత్నించు
భానుబింబమవై ప్రకాశించకున్న
తారవై వెలుగొంద యత్నమ్ము కావించు
గిరి కూటమున మహాతరువు కాకున్న
మైదానమున చిన్నమల్లె పొదవగుము
పరిమాణమేకాదు ప్రజ్ఞకు కొలత
ఉన్నంతలో నీవు ఉన్నతిని గనుము.

—Douglus Mallock కవితకు "దాశరథి" అనుసరణ

* ఉత్తముడు మాటల్లో మూగగాను చేతల్లో చురుకుగానూ వుంటాడు. —కన్ఫ్యూషియస్

* గొంతలనుండి దూరం కావడానికి
'విస్కీ'ని మించిన దివ్యౌషధం 'పని';

—థామస్ ఎ. ఎడిసన్

* ఇది కల్పిత కథ అయినను, ఇందలి నీతి స్వీకరించదగినది. అది ఏమిటంటే, పనిలేకుండా నీవు బ్రతుకదలిస్తే, తిండి లేకుండా బ్రతుకు.[1] —ఒక ఆంగ్ల రచయిత

---

[1] Though this is a bable, the moral is good. If you live without work, you must live without food. —Unknown

* చీమకంటె ఘనబోధకుడు లేడు: చీమ ఏమీ చెప్పదు.

—బెంజిమిన్ ఫ్రాంక్లిన్

* ఎక్కువ చేతులు కలిస్తే, పని తేలికవుతుంది.[1]

—విలియం పాటెన్

* కష్టించేవాడె స్వామి
శ్రమ శక్తికి నమామి.
—జె. బాపురెడ్డి

* పరిశ్రమించే కృషి జీవనునికి పని బరువంటూ వుంటుందా?
ఇన్ని కొమ్మలే ఎలా మోయనని ఏ చెట్టయినా అంటుందా?

—సి. నారాయణరెడ్డి

* కర్మణ్యే వాధికారస్తే మాఫలేషు కదాచన
(కర్మలను చేయుట యందే నీకధికారము కలదుగాని వాని ఫలములను కోరుట యందుకాదు.) —భగవద్గీత 2-47

* ప్రపంచములో జయము పొందుటకు రహస్యమేమనగా ఒక సన్యాసివలె జీవించవలెను; ఒక ఎద్దువలె కష్టపడవలెను.

—తే జబహదూర్ సప్రూ

* ఎంతటి పండితుడైనను, ఎన్ని శాస్త్రములలో నిపుణత కలిగినను, పని చేయుట నేర్వనివాడు దేశానికి బరువుచేటు.

—ఎక్కిరాల కృష్ణమాచార్య

---

[1] Many hands make, light work.

-William Patten

* నిష్ప్రయోజకంగా తుప్పుపట్టి పోవటంకన్న ప్రయోజకంగా అరిగిపోవటం మేలు. —సంస్కృతసూక్తి

(మాదుడు : కార్యసాధకుడు, ప్రయత్నము, శ్రమ)

## పరనింద

* ఒక్క వ్రేలు చూపి ఒరులను నిందింప
వెక్కరించు నిన్ను మూడువ్రేళ్ళు

—'బాలరాజుకథ' సినిమానుండి

* జీవితంలో ఎవరినీ నిందించగూడదు. చీమ, దోమలతో గూడ అవసరముంటుంది. —మాదిరెడ్డి సులోచన

## పరోపకారము

* ఎప్పుడెంత వరకు ఇతరులకు సహాయపడ యత్నించునో తనకు తాను అంతవరకు సహాయపడును.

—ఎక్కిరాల కృష్ణమాచార్య

## పాతక్రొత్తలు

* జరిగిపోయిన దంతయు మంచిదని, జరుగుచున్నది చెడ్డయని కొందరు భావించుచున్నారు. పాత రోతయని, క్రొత్త ప్రగతి యని మరికొందరు భావించుచున్నారు. ఈ రెండు తెగల వారును ఒక కన్ను పోడుచుకున్నవారే.

—ఎక్కిరాల కృష్ణమాచార్య

## పాపాలు

* సిద్ధాంతములు లేని రాజకీయాలు, శ్రమ చేయకుండా సంపద పొందడం, సహృదయత లేని సుఖము, శీల రహితమైన విద్య, నీతి లేనటువంటి వాణిజ్యము, మానవత్వం లేని విజ్ఞాన శాస్త్రము, త్యాగరహితమైన దైవపూజ– ఈ ఏడూ మహా పాపాలు[1].

* కావలసిన దానికంటె ఎక్కువ ప్రోగుచేసుకొని దాచిపెట్టు కొనుట మహాపాపము. —ఏసుక్రీస్తు

* ప్రజలు కావించు పాపంబు ప్రభుని చెందు
రాజు పాపంబు చెందును రాజగురుని
మగువ పొనరించు పాపంబు మగనిచెందు
శిష్యుడొనరించు పాపంబు చెందుగురుని

—సంస్కృత సూక్తి : అనువాదం-
బండ్లమూడి సత్యనారాయణ

---

[1] Politics without principles, wealth without work pleasure without conscience. knowledge without character, commerce without morality, science without humanity and worship without sacrifice - these are seven sins. —**Mahatma Gandhi**

## పురుషప్రయత్నం

* విత్తనము వృక్షముగా మారుటకు ప్రధానహేతువు దానియందలి జీవశక్తియే అయినను, అది ఫలించుటకు మేఘము నుండి జలమును అపేక్షించును. అట్లే మనుష్య ప్రయత్నము సఫల మగుటకు అతడు ఈశ్వరకృపను అపేక్షించును.

—ఆదిశంకరాచార్యుడు

## పుస్తకము

* తల్లి శరీరాన్ని పోషించి పెంచుతుంది; ఉత్తమ గ్రంథం హృదయాన్ని పోషించి పెంచుతుంది.

—రావూరు సత్యనారాయణరావు

* పుస్తకములమీద ప్రేమలేని మహదైశ్వర్యవంతుడు గూడ పరమ దరిద్రుడే; నిధులలోకెల్ల నిధియైన పుస్తక ప్రియత్వాన్ని కలిగి యున్న నిరుపేద గూడ మహాధనవంతుడే.[1]

—లాంగ్ ఫర్డ్

* పుస్తకమనేది నోరు తెరువని ఉపన్యాసకుడు; మౌనం వహించిన మహాకవి; ఒంటరితనాన్ని పోగొట్టే స్నేహితుడు; మరో ప్రపం

---

[1] Without the love of books, the richest man is poor, but endowed with this treasure of treasures, the poorest man is rich. —Long Ford

చానికి గానిపోయే ఇంద్రజాలికుడు.

—మన్నవ గిరిధరరావు

* పుస్తకాలు లేకుండా గడిపే విశ్రాంతి చావుతో సమానం; సజీవంగా సమాధి కావడం.[1] —సెనికా

* ప్రథమంలో మంచిపుస్తకం చదివితే ఒక క్రొత్త స్నేహితుని సంపాదించు కున్నట్లుంటుంది. రెండవసారి చదివితే పాత స్నేహితుని కలిసిన ఆనందం కలుగుతుంది.

—గ్లాడ్‌స్టన్

* పుస్తకము—సిరాలో భద్రపరచబడిన మెదడు.

—అంగ్లసామెత

* మంచి పుస్తకం మంచిమనసుకు మరోపేరు: సొంత పుస్తకం మంచి మనిషికి మరోతోడు. — ఇరివెంటి కృష్ణమూర్తి

* నాకేమైనా కొద్దిగా డబ్బులభిస్తే ముందుగా పుస్తకాలుకొంటాను. ఆ తర్వాత రొట్టె, బట్టల విషయ మాలోచిస్తాను.

—ఎమర్సన్

---

[1] Leisure without books is death, burial alive.

—Seneca

* మనం చదివే పుస్తకాలను జాగ్రత్తగా ఎన్నిక చేసుకోవాలి. ఈజిప్టురాజు ఒకాయన తన గ్రంధాలయం ముందు ఏం రాశాడో తెలుసా ?

"ఇవి ఆత్మకు ఔషధాలు" అని.

## పుణ్యము

* తాను మహారణ్యంలో వున్నా, శత్రుమధ్యలో వున్నా, యుద్ధ రంగంలో వున్నా, మహాసముద్రంలో వున్నా, పర్వత శిఖరం మీద వున్నా నిద్రించుచున్నా, జాగ్రదవస్థలో వున్నా, ఏ విపత్తులో వున్నా, అతడు చేసుకున్న సత్కర్మే, పుణ్యమే, అతన్ని కాపాడుతుంది. – సంస్కృతసూక్తి

## పేదరికం

* మరణము ఆ పాత యాతనావహము. దారిద్ర్యము యావజ్జీవము తీవ్ర వేదనాకరము. —నీతిచంద్రిక

## పేదలు

* అంతేలే పేదల గుండెలు
అశ్రువులే నిండిన కుండలు —శ్రీరంగం శ్రీనివాసరావు

* బీదవానికి దేవుడు ఆహారరూపమున గోచరించును.
—మహాత్మాగాంధీ

* తక్కువ ఉన్నవాడు పేదవాడుకాదు. అధికముగా కోరుకొనే వాడే పేదవాడు. –బైబిలు

* భాగ్యహీనునకు పరుసవేది దొరక
నదియు నిలువ దపుడె వదలుగాక
వానతోడ వచ్చు వదగండ్లు నిల్చునా —వేమన

* అబ్బిగాడు చస్తే ఆ పంచె నాది. —సామెత

* దరిద్రుడి కాకలెక్కువ. —సామెత

## పేరు

* పేరులో ఏముంది ? గులాబీని ఏ పేరుతో పిలిచినా అది గుబాళింపదా ? — షేక్స్పియర్.

## పొగడ్త

* పొగడ్త పన్నీరు లాంటిది. దాన్ని వాసనచూసి వదలి వేయాలే గాని తాగుతూ కూర్చోకూడదు. —జాన్ బిల్లింగ్స్

* మనల్ని పొగిడేవారు మనకిష్టమైన వారు
కాని మనం పొగిడేవారు తరచు మనకిష్టమైన వారు కాదు.[1]
—La Rochefoncauld

* పొగిడేవాడిని గురించి జాగ్రత్త సుమా !
ఖాళీ చెంచాతో నిన్నతడు తినిపిస్తాడు.
—కోసినాడి గ్రిగియో

---

1 We always like those who admire us, but we do not always like those whom we admire.

* తోడేలు నక్కను పోలియున్నట్టే, పొగిడేవాడు స్నేహితునివలె ఉంటాడు. —అంగ్లసామెత

* అనుకరణకంటె గొప్ప ప్రశంసలేదు. —అంగ్లసామెత

* ప్రశంస ఊరికేపోదు. —కొడవటిగంటి కుటుంబరావు

## పోలిక

* గుణానికి మనకంటె ఎక్కువ వాళ్ళతోనూ, ధనానికి మనకంటె తక్కువ వాళ్ళతోనూ పోల్చుకోవాలి.
—మాతృశ్రీ అనసూయాదేవి

* రాజును చూచిన కంటితో మొగుణ్ణిచూస్తే మొట్టబుద్ధి అయిందట.
—సామెత

* చెట్టులేనిచోట ఆముదపు చెట్టు మహావృక్షము.
—సామెత

* గ్రుడ్డివాళ్ళలోకెల్ల ఒంటికంటివాడు మహారాజు. —సామెత

## ప్రగల్భాలు

* ఒట్టిగొడ్డుకు అరుపు లెక్కువ. —సామెత

* వేడినీళ్ళకు ఓర్వలేనమ్మ సహగమనం చేస్తానన్నదట.
—సామెత

## ప్రజాస్వామ్యం

* చెవిటి ప్రభుత్వం, మూగ ప్రజలు ఉన్నపుడు ప్రజాస్వామ్యం వర్ధిల్లజాలదు. —సి. రాజగోపాలచార్యి

* ప్రజాస్వామ్యం యొక్క అర్థం "నేను మీఅంతటి మంచివాడను" అనిగాదు; మీరు నా అంతటి సజ్జనులు అని.

—రివరెండర్ థియొడర్ పార్కర్

* నేను బానిసగా ఎలాగైతే ఉండగోరనో, నేను యజమానిగా గూడ ఉండబోను. ప్రజాస్వామ్యం గురించి నా అభిప్రాయం ఇందులో వెల్లడవుతుంది. ఇందుకు భిన్నమైన దేదీ భిన్నమైనంత మేరకు ప్రజాస్వామ్యం కాజాలదు.

—అబ్రహం లింకన్

* తలలు లెక్కించుట ఆదర్శవంతమైన పరిపాలనా పద్ధతి కాక పోవచ్చు గాని తలలు పగులగొట్టుటకంటె అది మెరుగు.

—ఒక ఆంగ్లరచయిత

* ప్రజాస్వామ్యం సంఖ్యల యొక్క పరిపాలన.[1]

—ఒక మేధావి

* ప్రజలకు చెందిన, ప్రజలచే ఏర్పడిన, ప్రజలకొరకు వున్న ప్రభుత్వం ఈ నేలమీద నశించదు. —అబ్రహం లింకన్

## ప్రదక్షిణం

* ప్రదక్షిణం అంటే అంతా నాతోనేవున్నదని తెలుసుకోవడం.

—రమణ మహర్షి

## ప్రపంచము

* జగత్తు అంటే ఏమిటి ? జ అంటే పుట్టటం. గత్ అంటే గతించడం, అన్నీ మార్పుచెందుతూ ఉంటాయి. కాబట్టి దీనికి జగత్తు అని పేరు వచ్చింది. ——సత్యసాయిబాబా

---

[1] Democracy is a rule of numbers.

* విషాదంలో విశాల విశ్వం ఇరుగ్గా వుంటుంది ;
ఆనందంలో అదేలోకం స్వర్గంలా ఉంటుంది.

—దాశరథి

* ఈవిశాల ధాత్రియెల్లయు సత్రము
కులమతాల రభస కూడ దిచట
మమత సమత గల్గు మనిషికే యిట చోటు.

—బండ్లమూడి సత్యనారాయణ

* జ్ఞానం-పడవ నడిపే సరంగు; ధ్యానం-గాలి ; ప్రవర్తన-పడవ. ఈ మూడింటి సమ్మేళనం ద్వారా జీవులు ప్రపంచ సాగరాన్ని దాటుతారు.

—వర్ధమాన మహావీరుడు

* ఏటిలో రెండు కర్రలు ఎక్కడనుంచో కొట్టుకొనివస్తూ కొంత సేపు కలుసుకొని వుంటాయి. మరల త్వరలో విడిపోతాయి. అలాంటిది ఈ ప్రపంచ సంబంధం.

—అనుభవానందస్వామి

* ఈజగత్తు స్వభావమ్ము యెంత వింత
మంచి చేసినవానిని ముంచునౌర

—గాలిబ్ గీతాలు (అను : దాశరథి)

* మనం నివసించే ప్రపంచము అద్దాల మహలు వంటిది. నవ్వు అదీ నవ్వుతుంది. ఏడవగలిగితే అదీ ఏడుస్తుంది.

—అజ్ఞాత ఆంగ్లకవి

* విరుద్ధమైన ప్రయోజనాల నడుమ సంఘర్షణయే ఈ ప్రపంచం.

* ప్రపంచంలో చెడుగుకు, సంఘర్షణలకు కారణాలు మనుష్యునికి గల రెండు లక్షణాలు. అవి - స్వార్థపరత్వము, అధికార దాహము. —హాన్స్ జె. మార్గెంథో

## ప్రభుత్వము

* ప్రభుత్వం ఒక సహస్రపాద జంతువులాంటిది. అది చకచకా నడుస్తున్నట్టే ఉంటుందిగాని గమనం ముందుకో వెనక్కో తెలియదు. వెయ్యిపాదాలు వెయ్యి వేర్వేరు దిక్కుల ప్రయాణించవచ్చు. ఫలితం అగమ్యం. —సి. రాజగోపాలాచారి

* పరిపాలనలో పాల్గొనటానికి బుద్ధిమంతులు నిరాకరించి దూరంగా వుంటే, దుష్పరిపాలనక్రింద జీవితం గడిపే శిక్షను వారు అనుభవించవలసి ఉంటుంది. —ప్లేటో

* దుష్టుడైన రాజు పాలనలో ఉండడంకంటె పులిగుహలో నివసించడం మేలు. —కన్ఫ్యూషియస్

* ఏ దేశంలో కూడా భవిష్యత్ తరాలను నిరవధికంగా బంధించే హక్కు, లేదా అధికారంగల పార్లమెంటుగాని, సమాజంగాని, తరంగాని ఇదివర కెన్నడూ లేదు, ఇపుడు లేదు, ఇకముందుండదు. తమ సమాధి దాటిగూడా పరిపాలిస్తాం అనుకునే అహంకారం, భావన అత్యంత అర్థరహితమైనవి. —థామస్ పెయిన్

* ప్రజలే వేళ్ళు, ప్రభుత్వమే ఫలము. వేళ్లు తియ్యగా ఉంటేనే ఫలము తియ్యగా ఉంటుంది. —మహాత్మాగాంధీ

* తప్పనిసరి అయితేనూ లేదా తమకు లాభదాయకమైతేనూ తప్ప ప్రభుత్వాలు తమ వాగ్దానాలను నిలబెట్టుకోనవు.

— నెపోలియన్

* గొప్ప ప్రభుత్వం అంటే ఏది ? ప్రజలు మంచి చేయడానికి సులభంగానూ చెడుచేయడానికి క్లిష్టంగానూ వుండాలి.

— గ్లాడ్‌స్టన్

* ఏ దేశమైనా ఆదర్శప్రాయమైన ప్రభుత్వం క్రింద వుంటే అక్కడ పేదరికం సిగ్గుచేటు. ప్రభుత్వం చెడ్డదైతే ధనవంతులవడం సిగ్గుచేటు. — చైనా సామెత

* ప్రజలపై అతితక్కువ అధారిటీ చూపేది చాలా మంచి ప్రభుత్వం.[1]

— జాన్ లాక్

## ప్రయత్నం

* సాధనమున పనులు సమకూరు ధరలోన. – వేమన

* క్రీస్తు మాటలు జ్ఞప్తికి తెచ్చుకో : "అడుగు - అడిగితే ఇవ్వబడుతుంది. ప్రయత్నించు. ప్రయత్నిస్తే లభిస్తుంది. తలుపుతట్టు - తట్టుతే తెరువబడతాయి." ఈ మాటలు ఊరికే అన్నవికావు. ఎత్తుకెత్తు పరమసత్యములు. – స్వామి వివేకానంద

---

1 That Government is best which governs the least.

–John Locke

* ప్రాకిప్రాకి చీమ బహు యోజనము లేగు
ఎగురకున్న గ్రద్ద యెచటికేగు ?
సాధనమున కార్య సాఫల్యమొనగూడు. —కరుణశ్రీ

* ప్రయత్నశీలునికే పనులు నెరవేరుతవిగాని. ఊరక పగటి కలలుగాంచు వానికి గాదుసుమా ! సింహమే యైనను నోరు తెరచుకొని పరున్నచో మృగములు తమంతట తాము వచ్చి నోటిలో దూరవు. —హితోపదేశము

* పట్టుపట్టరాదు పట్టివిడువరాదు
పట్టెనేని బిగియ బట్టవలయు
పట్టు విడుటకన్న పడిచచ్చుటే మేలు. —వేమన

* వెయ్యిమైళ్ళ ప్రయాణంగూడ ఒక్క అడుగుతోనే ఆరంభమవుతుంది. —జపాన్ సామెత

* ప్రయత్నమందు నీకెంత ఆసక్తి యున్నదో ఫలపరిత్యాగమందు నీకంత పట్టుదల యుండవలెను.
—పానుగంటి లక్ష్మీనరసింహారావు

## ప్రార్థన

* తమలోని ఈశ్వర చైతన్యాన్ని మేల్కొల్పుటకు తపన పొందే ప్రతివారూ ప్రార్థనపై ఆధారపడక తప్పదు. ప్రార్థన అంటే ఉత్త మాటల పరిశ్రమగాని, చెవులకు శ్రమగాని కాదు. హృదయంలేని మాటలకంటె మాటలులేని హృదయమే ప్రార్థనకు ఎక్కువ ప్రయోజనకరం. భక్తి భావంతో అంతరాత్మ పొందే తపనకు స్పష్టమైన ప్రతిబింబం కావాలి ప్రార్థన. ఆకలిగొన్న

మనిషి మంచి భోజనాన్ని ఎలా ఇష్టపూర్తిగా తింటాడో, అలాగే ఆకొన్న హృదయంగూడ హృదయ పూర్వకమైన ప్రార్థన కొరకు తహతహ పడుతుంది. —మహాత్మాగాంధీ

* ప్రార్థించే పెదవులకన్నా సాయంచేసే చేతులు పవిత్రమైనవి.
—మదర్ థెరీసా

* ప్రార్థన మానసిక భోజనం. —మహాత్మాగాంధీ

* సత్కార్యమే అత్యుత్తమమగు ప్రార్థన.
—రాబర్ట్ ఇంగర్‌సోల్

* శరీరమునకు ఆహారమెట్టిదో ఆత్మకు ప్రార్థన అట్టిది. ఉదయ ప్రార్థన ఒక ధనాగారమునకు తాళపుచెవి వంటిది.
—మహాత్మాగాంధీ

## ప్రాణాయామము

* ఉచ్ఛ్వాస నిశ్వాసాలను క్రమబద్ధం చేస్తే ఆలోచనలో అలజడి తగ్గి నిశ్చలత్వం వస్తుంది. స్వశక్తిపై ఆధారపడటం అనే ధైర్యగుణానికి ఆలంబనం కలుగుతుంది.
—ప్రఖ్యాత వయోలిన్ విద్వాంసుడు
యెహూది మెనూహిన్

* ప్రాణాయామం మెదడులోని లక్షలాది కణాలకు జీవంపోస్తుంది. మరింత ప్రాణవాయువును సమకూర్చుకొని మెదడులోని కణాలు నిరంతర జాగరితం అవుతాయి.
—డాక్టర్ ఎడ్విన్ డైమండ్

## ప్రేమ

ఏకత్వముయొక్క వెల్లడింపే ప్రేమ.
(Love is the expression of oneness.)

—స్వామి అభేదానంద

మోహము, కామము, ప్రేమ— ఇవి వేరువేరు అర్థాలు గల పదములు.

మోహమునకు స్థానము దేహము. వేశ్య మోహింపజేస్తుంది. కామమునకు స్థానము మనస్సు. భార్య కామింప జేస్తుంది. ప్రేమకుస్థానము హృదయము. తల్లి ప్రేమింపజేస్తుంది. మానవుడు మోహము నుండి కామమును, కామము నుండి ప్రేమను చేరుకోవాలి.

—విశ్వయోగి విశ్వంజీ

ప్రేమ యిస్తుందే గాని ఇమ్మని కోరదు. ప్రేమ బాధలను సహిస్తుందే గాని ప్రతీకారం తలపెట్టదు.

—మహాత్మాగాంధీ

ప్రేమలేని శరీరం స్మశానంలోని శవంతో సమానం. కంచరివాని తోలుతిత్తి ప్రాణం లేకపోయినా శ్వాస తీసుకుంటూనే వుంటుంది గదా!

—కబీరు

ప్రేమ అనేది ఉజ్జ్వల దీపకళిక లాంటిది. రెండు చేతులు అడ్డుపెట్టుకొని రక్షించుకుంటూవస్తేనే అది నిలుస్తుంది. లేకపోతే ప్రమాదం తప్పదు.

—లత

చమురు దీపానికి ప్రాణం పోస్తుంది. ప్రేమ జీవితానికి వెలుగునిస్తుంది. ప్రేమించుట ప్రేమించబడుట రెండూ జీవితానికి

వరం. ఈ వరంలేని జీవితంలో ఎడారిలోలాగే మండుటెండలు, ఇసుక తుఫానులూ తప్ప యింకేవీ వుండవు.

—అధరాపురపు తేజోవతి

* ప్రేమ త్యాగాన్ని కోరుతుంది ; స్వార్థం ప్రేమను కోరుతుంది. నిర్మలమయిన ప్రేమకు, నిష్కల్మషమైన త్యాగానికీ, పచ్చి స్వార్థానికీ ఎప్పుడూ సంఘర్షణ వుంటూనే వుంటుంది.

—వి. ఆర్.

* అమర సౌందర్యమునకై మానవుని ఆత్మపొందే ఆకలిని ప్రేమ అంటాము. —సోక్రటీసు

* ఒడలు రెండు, ఉసురు ఒకటి. —సామెత

* కడుపులో లేనిది కావలించుకుంటే వస్తుందా ? —సామెత

* తననుగన్న వారిమీదకంటె తానుగన్నవారిమీద ప్రేమఎక్కువ.

—మాతృశ్రీ అనసూయాదేవి

* రెండు గుండె లేకమైన
రాగము ద్విగుణీకృతమగు
పసుపు సున్నములు కలసిన
పుట్టు రక్తవర్ణము కద.

—హిందీకవి రహీం (అను : మలిపెద్ది వెంకటరావు)

* ప్రేమకు భయమంటే ఏమిటో తెలియదు. వీధిలో నడుస్తున్న ఆశక్తురాలైన స్త్రీ కుక్క మొరుగుతేచాలు, భీతితో ప్రక్క యింటిలో జొరబడుతుంది. కాని ఆ మరునాడు ఆ స్త్రీయే తన

కుమారుణ్ణి చంకనెత్తుకొని వీధిలో వస్తూ వుంటుంది. అపుడొక సింహం పంజా విప్పుకొని ఎదురుపడింది. అపుడామె ఎక్కడున్నది ? తన బిడ్డను రక్షించడంకోసం సింహం నోటికాహార మయింది ! ప్రేమ ముందు ఏవీ అడ్డురావు. భగవంతుడంటే ఎవరో కాదు. ప్రేమయే భగవంతుడని భక్తుడు తుదకు గ్రహిస్తాడు. —స్వామి వివేకానంద

* ప్రేమ కత్తిలేకుండా పరిపాలిస్తుంది. చట్టము లేకుండా బంధిస్తుంది. —సత్యసాయిబాబా

* జీవమునకు ప్రేమే జీవమ్ము ; యదిలేని
వారి దేహ మస్థి పంజరమ్ము. —తిరుక్కురల్

ప్రేమనిచ్చిన ప్రేమ వచ్చును
ప్రేమ నిలిపిన ప్రేమ నిలుచును. —గురజాడ అప్పారావు

ప్రేమికులు దూరమయినకొద్దీ పెరిగేదీ, దగ్గరయినకొద్దీ తరిగేదీ ప్రేమ. — గోళ్ళమూడి గోపాలకృష్ణమూర్తి

ప్రేమ ఎక్కడ వుంటుందో అక్కడ త్యాగం వుంటుంది. ఎక్కడ త్యాగమో అక్కడ నిర్మలత్వమేర్పడుతుంది. దేహమునకు చేతులు, కాళ్ళు, శిరస్సు ఎంత ప్రధానమైనవో, ప్రేమ, త్యాగం, నిర్మలత్వం మానవత్వమునకు అంత ప్రధానమైనవి. —శ్రీ సత్యసాయిబాబా

ప్రేమ ఉన్నచోట ఎక్కువ తక్కువలు లేవు. కొద్ది గొప్పలు లేవు. మనలో ప్రేమతత్వం ప్రకాశించినపుడు అత్యంత కఠిన కార్యం గూడ స్వర్గ సుఖంగా మారుతుంది. మనలోని స్వార్థ

పరత్వం ఎంత ఘనకార్యమునైనా అతిభారంగా బండచాకిరిగా చేస్తుంది. —స్వామి రామతీర్థ

* ప్రేమ రథానికి త్యాగము, సేవ అనునవి రెండు చక్రాల వంటివి. —స్వామి సుందర చైతన్యానంద

* ప్రేమయొక్క సంతానం-విరహం, నింద, ఆత్మహత్య,యుద్ధం. —ఉమాపతి పద్మనాభశర్మ

* ప్రేమ ఆల్జీబ్రా లెక్కవంటిది. ఎన్ని వరుసలు వేసినా సమీకరణంలో రెండు వైపుల విలువా సమానంగా వుంటుంది. —ఎమర్సన్

* ప్రేమతో వచ్చింది ఒకటే ఇక్కట్టు
సుఖదుఃఖాల మధ్య అది సీజను టిక్కట్టు. —ఒక రచయిత

* ప్రేమమయము కాని మనిషి
శ్రమలన్నియు వృథావృథా —కాళోజీ నారాయణరావు

* ద్వేషించుట సులభము, కాని ప్రేమించుట ఆరోగ్యదాయకము. —అంగ్లసామెత

* గౌరవించబడటం కంటె ప్రేమించబడటం మంచిది. —అంగ్లసామెత

* ప్రేమ : యుద్ధంలాగ మొదలుపెట్టడానికి చాలా సులువయి ఆపడానికి మాత్రం బ్రహ్మతరం కానిది. —గోళ్ళమూడి గోపాలకృష్ణమూర్తి

* దారిద్ర్యం ద్వారంగుండా ప్రవేశించినపుడు ప్రేమ కిటికీగుండా పారిపోతుంది.[1] —ఆంగ్లసామెత

* ప్రేమ కళ్ళతో చూడదు మనసుతో చూస్తుంది
అందుకే ప్రేమదేవత గ్రుడ్డిదని వర్ణించారు.

—షేక్స్పియర్

* ప్రేమ కష్టాన్ని తేలికపరుస్తుంది ; దుఃఖాన్ని మధురవంత మొనరిస్తుంది. —ఆంగ్లసామెత

కూరిమి గల దినములలో
నేరము లెన్నడును కలుగనేరవు మరియా
కూరిమి విరసంబైనను
నేరములే తోచుచుండు నిక్కము సుమతీ

—సుమతీ శతకం

బంధుజన సందోహమా ! ఇరకాటం మన ప్రేమ
కనగలం అందు మొగమాటం
ప్రాణసఖీ ! ఈ మన ప్రేమగీతం కామపూరితం
స్వార్థాపశ్రుతినిందు వినగలం
జననీ ! నీదుప్రేమ అమృతభాండం
కాని యదియు నించుక బాధ్యతా విషకలుషితం
మరి, స్నేహితుడా ! నీప్రేమ త్యాగసహితం
ఉపమానరహితం, మహికే హితం !

—సి. హెచ్. శ్రీధర్

[1] When poverty comes in at the door, love flies out at the window. —English proverb

## బంధువులు

* అక్కర గలిగినపుడు బంధువులు ఒకరినొకరి ఆదుకొనడం సహజమే. నీటిలో బండ్లను ఓడలు మోసి గట్టున చేరుస్తాయి; భూమిమీద బండ్లు ఓడలను మోసి నీటియందు చేరుస్తాయి.

—భాస్కరశతకం

* దాయాది చావగోర్తాడు, బావమరది బతుక గోర్తాడు.

—సామెత

* దారిన నడుచువానికి వర్తక సమూహము చుట్టము; రోగికి వైద్యుడు చుట్టము; సంసారికి చక్కని భార్యయు, మరణించిన వానికి పుణ్యమును చుట్టములు.

—యక్ష ప్రశ్నలకు ధర్మరాజు జవాబు

* రెండిళ్ళ చుట్టం ఆకలితో చస్తాడు. —ఒరియా సామెత
(అవతలింట్లో వంటచేస్తారనుకొని తుదకు ఎవరూ చేయరు)

* అణకువలేని భార్య, చదువురాని కొడుకు శత్రువులు.
(అవినీతా రిపుర్భార్యా, పుత్రశ్శత్రు రపండితః)

—సంస్కృత లోకోక్తి

## బలము

* వనములగాల్చునపుడు అగ్నికి వాయువు సహాయపడి మిత్రుడగుచున్నాడు. ఆ వాయువే సూక్ష్మరూపమున నుండు నగ్నిని చల్లార్చుచున్నాడు.

—ప్రపంచతంత్రములో 'విగ్రహము' నుండి

* ఈసురో మని మనుషులుంటే
దేశ మేగతి బాగుపడునోయ్. —గురజాడ అప్పారావు

* బతికితె ఎవడిదో బట్టె వాడిది. —సామెత

* బలమే జీవనము, బలహీనతే మరణము.
—స్వామి వివేకానంద

* దుర్బలునకు ప్రభువు బలము. బాలునకు ఏడ్పు బలము. మూర్ఖునకు మౌనము బలము. చోరునకు అనృతము బలము.
—సంస్కృతసూక్తి

## బలహీనుడు

* అశక్తుణ్ణి ఏడిపించడం అందరికీ సరదా.
—చక్రవర్తి తంగస్వామి

* వెట్టివాడి భార్య వాడకల్లా లోకువ. —సామెత

## బాధ్యతారాహిత్యం

* దున్నేరోజుల్లో దేశంమీద పోయి. కోతలరోజుల్లో
కొడవలి పట్టుకు వచ్చాడట. —సామెత

## బానిసత్వము

* బంగారపు గొలుసులు ఇనుప గొలుసుకంటె బలవత్తరమైనవి.
—ఆంగ్లసామెత

* పరతంత్ర జనములపాలి కష్టములు
చెప్పంగ నలవియే శివునకు నైన
పంజరంబుననున్న పక్షులరీతి
బంధించి బుట్టలో పాములవాడు
వదలక పెట్టిన ఫణులచందమున
గంగిరెద్దులవాడు కావరమణచి
ముకుదాడు పొడిచిన పోలెద్దులట్లు
బోనులో నుంచిన పులుల విధంబు
స్వాతంత్ర్యహీనత బడియుండ వలయు —శ్రీనాథుడు

## బుద్ధి

* బుద్ధి : బడిపంతులు చెప్పిన పాఠంవల్లగాక బ్రతుకు నేర్పే గుణపాఠం వల్ల వచ్చేది. —యస్వీ జోగారావు

## బోధన

* మనుష్యులకు బోధించుచున్నట్లు అనిపించకుండ బోధించాలి : వారు మరచిన సంగతులను గుర్తు చేస్తున్నట్లుండాలి.[1]

—పోప్

## బోధనాభాష

* తల్లిపాలు త్రాగి పెరిగిన బాలునకును, దాదిపాలు త్రావి పెరిగిన బాలునకును ఎట్టి భేదముండునో, స్వభాషయందు శాస్త్రీ

---

[1] Men must be taught as if you taught them not
And things unknown, proposed as things forgotten
—Pope

భ్యాసము చేసిన వారికి పరభాషయందు జ్ఞానార్జనము చేసిన వారికిని అట్టి భేదమే యుండును.

—కొమఱ్ఱాజు వెంకట లక్ష్మణరావు

* ఒక విదేశభాషలో విద్యాబోధ చేయడమనేది విదేశ పరిపాలన వలన ప్రాప్తించిన అనర్థాలలోకెల్ల ప్రధానమైనదని చరిత్రకారుడు పరిగణించగలడు. అది జాతి యొక్క చేవను పీల్చివేసింది. విద్యార్థుల ఆయుర్దాయాన్ని క్షీణింపజేసింది. సామాన్య ప్రజానీకం నుండి వాళ్ళను దూరం చేసింది. అనవసరంగా విద్యాభ్యాసాన్ని అధిక వ్యయపూరితం చేసింది.

—మహాత్మాగాంధీ

* ఆవగింజంత భక్తితో కొండలు కదల్చగలము.

—ఏసుక్రీస్తు - మత్తయిసువార్త

* భక్తిలేని పూజ పత్రి చేటు. —సామెత

## భక్తి

* చితికిపోయిన బ్రతుకు బొమ్మను అతికించుకొనే ఒకానొక అవకాశమే భక్తి. —స్వామి సుందర చైతన్యానంద

## భక్తులు

* భగవద్భక్తులు నాలుగు తరగతులుగా వున్నారు. ఆర్తుడు. అర్థార్థి, జిజ్ఞాసువు, జ్ఞాని అని.

ఆర్తుడు కష్టాలనుండి తప్పించమని ప్రార్థిస్తాడు. అర్థార్థి కామ్య సుఖాలకోసం ప్రార్థిస్తాడు.

జిజ్ఞాసువు భగవంతుని మానసికంగా మాత్రమే అర్థం చేసుకోదలుస్తాడు. జ్ఞాని భగవంతుని స్వరూపం ఎరిగినవాడు. ఈ నలుగురిలో జ్ఞాని ఒక్కడే జన్మపరంపరనుండి విడివడి పరమాత్మతో ఐక్యం పోందుతాడు.

—శ్రీ జగద్గురు చంద్రశేఖరేంద్ర సరస్వతీస్వామి

భగవంతుడు

* ఏది కన్నులకు కనబడదో, దేనివలన కన్నులు చూచుచున్నవో అదియే పరబ్రహ్మమని తెలిసికొనుము.

— కేనోపనిషత్తు

* మన పంచేంద్రియాలకు వశపడని శక్తి ఒకటున్నది. అదే దైవం. —అబ్బూరు నారాయణస్వామి

* పైపైన చూసినకొద్దీ సృష్టిలో ప్రతిదానికీ ఒకదానినుంచి ఇంకో దానికి భిన్నత్వం ఎక్కువగా కనపడుతుంది. లోతుగా చూడ గలిగినకొద్దీ భిన్నం చెయ్యడానికి వీలులేని ఏకత్వం తోస్తుంది. ఆ ఏకత్వమే ఈశ్వరుడు. —గుడిపాటి వెంకటచలం

* పరమేశ్వరుని మ్రోల యుక్తి, ధీశక్తి, పాండిత్యము ఇవేవియు కొఱగావు. అచట మూగవాడు మాటలాడును, గ్రుడ్డివాడు చూచును, చెవిటివాడు వినును.

—రామకృష్ణ పరమహంస

* భగవంతుడు నీకు ఎంతదూరంలో ఉన్నాడు ? నీకు నీవు ఎంత దూరంలో ఉన్నావో అంతే దూరంలో ఉన్నాడు.

— రమణ మహర్షి

* వేదములు దేవుని గురించి చెప్పునపుడు "దేనికి ఏదియును పైన లేదో అదియే స్వామి. దేనికి క్రింద ఏదియును లేదో అదియే స్వామి. సర్వవ్యాపియగు అయనకంటె పెద్ద వస్తువుగాని చిన్న వస్తువుగాని మరొకటి యుండదు" అని చెప్పును.

—తైత్తిరీయ అరణ్యకము

* భగవంతుడు చరమస్థాయికి చెందిన అకారణము.[1]

—ఎ.ఎన్. వైట్ హెడ్

* భగవంతుడు తన యింటి చిరునామా భగవద్గీత 18 వ అధ్యాయము 61 వ శ్లోకము లో ఇచ్చి యున్నాడు :

"ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశే ఽర్జున తిష్ఠతి" అని ఆశ్లోకము. ఈశ్వరుడు సర్వప్రాణుల హృదయములలోను నివసించుచున్నాడని దాని యర్థము. ఈ యర్థము తెలిసిన తర్వాత నీవు ఏ ప్రాణినిగాని యెట్లు తిరస్కరించగలవు ? ఎవ్వరిని గాని యెట్లు ద్వేషింపగలవు ?

—సత్యసాయిబాబా

* ఒకడొ నరకుండదద్భుతం బెనయ నెన్నో వేసముల్ దాల్చి న
ట్లొక డయ్యున్ బహు రూపధారివయి నీ వో దేవ; కిందో యికిన్
సకల స్థావర జంగమంబుల మహిం బ్రత్యక్షమై యుండ నా
స్తికు డేరీతిని లేడు లేదనుచు వాదించుం కృపాంభోనిధీ

—చిలకమర్తి లక్ష్మీనరసింహం

---

1 God is ultimate irrationality.

— A.N. White head

* తనను తాను సంపూర్ణముగ దేవునికి సమర్పించుకొను జీవునకే దేవుడు తనను తాను సంపూర్ణముగ సమర్పించుకొనును.

— అరవింద ఘోష్

* చాల దూరముననున్న భగవంతుడే చాల సమీపములో గూడ నున్నాడు. "దూరద్దూరే అంతికేచ" అని వేదము చెప్పును. దూరముకంటె అతిదూరమున ఉన్నాడనియు, సమీపముకంటె అతి సమీపమున ఉన్నాడనియు సూక్ష్మముగ చెప్పబడినది.

— కంచికామకోటి జగద్గురువులు

* ఆ పరతత్వానికి కాళ్ళు లేవు. అయినా వేగంగా పోగలదు. చేతులు లేకనే పట్టుకోగలదు. కన్నులు లేకనే చూస్తుంది. వీనులు లేకనే వింటుంది.

— ఉపనిషద్వాక్యం

* దారమందు మణులవలె నాయందీ సమస్త ప్రపంచము కూర్చబడినది.

—శ్రీకృష్ణుడు (గీత 7-7)

* భగవంతుడు అనే వృత్తానికి కేంద్రము ప్రతి చోటా ఉంటుంది. పరిధి ఎక్కడా వుండదు [1]

— సెయింట్ అగస్టిన్

* మనమందరము ఆత్మ స్వరూపులమే, కాని కోరిక వలన మానవులుగా వున్నాము.

భగవంతుడు + కోరిక = మానవుడు.

మానవుడు — కోరిక = భగవంతుడు.

—గుమ్మలూరి సత్యనారాయణ

---

1 God is a circle whose centre is everywhere and circumference nowhere. — St. Augustin

వలయ రేఖకు బోలి వశమె తెల్పగ నీ
కాది మధ్యాంతము లప్రమేయ
యెల్ల జగంబుల కీవె యాధారము
లెక్కల కన్నింటి కొక్కటి వలె
ధర్మము వైపె యెంతయు జోగుచుందువు
బలుపు వంకన్ ద్రాసుముల్లు విధమున
పెఱుగవు తఱుగవు విభజింపబడవు శూ
న్యాంకము వలె నకలంక చరిత

—ఆదిభట్ల నారాయణదాసు

తనను గురించి ఆలోచించేవాడు మనిషి, లోకాన్ని గురించి ఆలోచించేవాడు దైవము. —మాతృశ్రీ అనసూయాదేవి

భగవంతుడనేవాడు లేనట్లయితే, అట్టి వాణ్ణి కనిపెట్టవలసిన ఆవశ్యకత వున్నది.[1] —వాల్టేర్

దైవం, గురువు, ఆత్మ, మూడూ ఒకే వస్తువు యొక్క భిన్న రూపాలు. దైవమందు విశ్వాసముంచి ఆరాధన చేయగా, దైవం గురు రూపంలో ప్రత్యక్ష మవుతుంది. అట్లే గురుసేవ చేయగా గురువు నీకు ఆత్మగా సాక్షాత్కరిస్తాడు.

—శ్రీ కాశీ ప్రసాదబాబు

భగవంతుడు ప్రతిఫలం యివ్వడానికి కాచుకొని వుంటాడు. మంచి చేస్తే మంచి ఫలితం, చెడ్డ పనిచేస్తే చెడ్డఫలితం ఇస్తాడు.

---

[1] If God did not exist, it would be necessary to invent him. — Voltair

అందుకనే భగవంతుడికి కర్మఫలదాత అని పేరు వచ్చింది.

—శ్రీ సత్యసాయిబాబా

* దేనియొక్క అందవికారాలనూ పట్టించుకోక, ఆ రూపం ధరించిన దైవాన్ని స్మరించాలి.

—షిర్డీ సాయిబాబా

* దైవం నాదబిందు కళాతీతమని అన్నారు. అంటే శబ్దగుణము, మనస్సుకు అగ్రమందున్నట్లు చెప్పబడే బుద్ధి, ప్రాణానికి అగ్రంగా ఉన్నదనే కళ - ఈ మూడింటికీ కూడా దైవం అతీతమైనదని అర్థం.

—నీలంరాజు లక్ష్మీప్రసాద్

* భగవంతుణ్ణి ఈకళ్ళతో చూడలేం. ఇంద్రియాలకు భగవంతుడు తెలియబడడు. ఇట్లా చెప్పటమంటే అర్థం - భగవంతుణ్ణి చూడటం అంటే తాను భగవంతుడు కావడం.

—రమణమహర్షి

* భగవంతుడు నీ భక్తిని చూస్తాడే గాని నీ శక్తిని చూడడు. నీ గుణమును చూస్తాడేగాని నీ కులమును చూడడు. నీ నీతిని చూస్తాడేగాని నీజాతిని చూడడు. నీ చిత్తమునే గాని నీ విత్తమును చూడడు. భగవంతుడు ఎప్పుడూ చిత్తచోరుడే గాని విత్తచోరుడు కాదు.

—శ్రీ సత్యసాయిబాబా

* దేనినుండి సర్వజీవులు సముత్పన్నమయి, పెరిగి, మళ్ళీ దేనిలోకి ప్రవేశిస్తున్నవో అదియే బ్రహ్మము.

—తైత్తిరీయోపనిషత్తు

* భగవంతుడు సర్వత్రా వ్యాపించియున్నాడనే సత్యాన్ని గుర్తించడం అవసరం. మనం చేసే పాపకార్యాలన్నీ ఎవరూ చూడనప్పుడు చేస్తుంటాం. కాని అపుడు సహితం భగవంతుడు చూస్తూనే ఉన్నాడని, మనం చేసే పనులనేగాక, మన ఆలోచనలను గూడ చూస్తున్నాడనే సత్యాన్ని గ్రహించినప్పుడు మనం పాపాలనుండి విముక్తుల మవుతాము. — మహాత్మాగాంధీ

* శరీరమనే క్షేత్రంలో మంచి పనులను విత్తనాలుగాచల్లి, భగవన్నామస్మరణ మనే నాగలితో, నీ హృదయమే రైతే దున్నినట్లయితే, నీ అంతఃకరణలోనే భగవంతుడు ఉదయిస్తాడు.
— గురునానక్

* అన్నీ తానే అనుకొనే మనస్తత్వమే భగవంతుడు. నాలుగు చేతులూ కాళ్ళతో వేరుగా ఎక్కడో లేడు. అన్నీ అయి ఉన్నాడు. చీమలో దోమలో దైవం ఉండడం కాదు. చీమగా దోమగా దైవం ఉన్నాడు. దైవం అంతటా వ్యాపించి ఉండడం కాదు. అంతా అయి ఉన్నాడు.
— మాతృశ్రీ అనసూయాదేవి

* ఈశ్వరుడేమీ ఆకాశం నుండి దిగివచ్చే వస్తువేమీ కాదు. అదొక అవస్థ లేక స్థితి. అది ప్రాణం తాలూకు స్థిరావస్థ.

ప్రాణానికున్న చంచలత్వానికే మనస్సు అని పేరు. ఏ విధంగానైనా ప్రాణాన్ని స్థిరం చేయగలిగినట్లయితే మనస్సు గూడ స్థిరమవుతుంది

ప్రాణాన్ని స్థిరం చెయ్యడానికి శ్రేష్ఠమైన ఉపాయం ప్రాణాయామం. నదుల్లోకల్లా గంగ, మంత్రాల్లో ప్రణవం, తీర్థాల్లో కాశీ శ్రేష్ఠమైనట్లు గానే, సాధన లన్నిటిలోకీ ప్రాణాయామం శ్రేష్ఠమైనదీ, శాస్త్ర సమ్మతమైనదీను.

—యోగిరాజశ్రీ శ్యామాచరణ లాహిరీ

## భగవద్గీత

* మీలో సంస్కృతము తెలిసినవారు రేపు లేక ఈ దినమే ఒక గీతా పుస్తకమను కొని చదువ ప్రారంభించుడు. మీలో సంస్కృతము తెలియనివారు కనీసము గీతకొరకైనను సంస్కృతము నేర్చుకొనుడు. నేను యదార్థముగ చెప్పుచున్నాను. మీరు కని విని యెరుగని అమూల్య జ్ఞాన భాండాగార మెంతయో గీతయందు కలదు. — మహాత్మాగాంధీ

* దేహముకంటె ఇంద్రియములు, ఇంద్రియముల కన్న మనస్సు, మనస్సుకంటె బుద్ధి, బుద్ధికంటె ఆత్మ, ఒకదాని కంటె ఒకటి శ్రేష్ఠమనియు, ఇట్టి ఆత్మను తెలుసుకొని బుద్ధితో మనస్సును నిగ్రహించుకొని దుఃఖకారియగు కామరూప శత్రువును నిర్జించవలెనని గీత ఉపదేశించినది. —సి. నారాయణరెడ్డి

* మనుష్యులకు మిక్కిలి భయావహమగు మృత్యువును తృణప్రాయముగా చూచునట్లు ఉపదేశించగల మహా గ్రంధము భగవద్గీత. —డా॥ ఎ. రాఘవరావు

* నా విజ్ఞానశాస్త్ర పరిశోధనలకును, నూతన సిద్ధాంతములను రూపొందించుటకును నేను భగవద్గీతను ప్రధానమైన ఉత్సాహ కేంద్రముగను, మార్గదర్శకముగను స్వీకరించాను.[1]

—అల్బర్ట్ ఐన్‌స్టీన్

**భయం**

* ఐశ్వర్యమూ అధికారమూ మనశ్శాంతి నీయడం కల్ల. ఎందు చేతనంటే వాటి నంటిపెట్టుకొని నీడలా వుంటుంది భయమనే దెప్పుడు. —మాలతీచందూర్

* నయమున బాలుం దావరు
భయమున విషమ్ము నైన భక్షింతురుగా. —సుమతీ శతకం

* ఊరికోవారికి కాటిభయం, పొరుగువారికి నీటిభయం.

—సామెత

* చేసిన తప్పుకు అంతరాత్మ చెల్లించే పన్ను భయం.

— సెవెల్

**భారతదేశము**

ఉత్తరం యత్ సముద్రస్య
హిమాద్రేశ్చైవ దక్షిణం
వర్షం తద్ భారతం నామ
భారతీ యత్ర సంతతిః. —విష్ణుపురాణం

---

1 I have made Gita as the main source of my inspiration and guidance for the purpose of scientific investigations and formulation of my theories. —Dr. Albert Einstein

(సముద్రమునకు ఉత్తరముగను హిమవత్పర్వతములకు దక్షిణముగను వ్యాపించియున్న ఈ దేశము భారత వర్షము. ఇందున్న వారు భారతీయులు.)

* 'భ' అనగా కాంతి అని అర్థం. రతి అనగా మునిగియుండుట. భారత అనగా వెలుగులో, కాంతిలో, జ్యోతిలో తన్మయులై యుండువారని అర్థము. భారతీయుడనగా అంధకారమును అజ్ఞానాన్ని వర్జించి కాంతిని వెలుగును జ్ఞానాన్ని స్వీకరించువారని అర్థము. అట్టి వ్యక్తులుగల దేశము భారతదేశం.

—స్వామిచిన్మయానంద

* సగర మాంధాతాది షట్చక్రవర్తుల
  యంకసీమల నిల్చినట్టిసాధ్వి
కమలనాభుని వేణుగాన సుధాంబుధి
  మునిగితేలిన పరిపూత దేహ
కాళిదాసాది సత్కవికుమారుల గాంచి
  కీర్తినందిన పెద్దగేస్తురాలు
బుద్ధాది మునిజనంబుల తపంబున మోద
  భాష్పముల్విడిచిన భక్తురాలు
సింధుగంగానదీ జలక్షీరమెపుడు
గుడిపి బిడ్డల బోషించుకొనుచునున్న
పచ్చి బాలెంతరాలు మా భరతమాత
మాతలకు మాత సకల సంపత్సమేత —గుఱ్ఱం జాషువా

* ప్రకృతి ఒసంగగల సంపదను శక్తిని సౌందర్యమును సమృద్ధిగ పొంది, కొన్ని పట్టులందు సాక్షాత్తు భూలోకస్వర్గమా యనిపించు

నట్టి దేశమెక్కడున్నదో లోకమంతయు వెదకి చెప్పుమన్న యెడల అదిగో భారతవర్షము అని వ్రేలెత్తి చూపుదును.

ఏ ఆకాశము క్రింద మనుష్యుని బుద్ధి తన ఉత్తమ ప్రజ్ఞల కొన్నింటిని పరిపూర్ణముగ వికసింప జేసికొని, జీవనసమస్యలను గాఢముగా విత్కరించి, వానిలో కొన్నింటికి ప్లేటో, కాంటుల సిద్ధాంతములను చదివిన వారిని సయితము సావధానముగ చెవి యొగ్గచేయగల్గునట్టి పరిష్కారములను కనిపెట్టెనని నన్నడిగిన యెడల అదిగో భారతవర్షము అని వ్రేలెత్తి చూపుదును.

ఇక్కడ ఐరోపాలో ఉన్న మనము, గ్రీకుల, రోమనుల సెమెటిక్ లగు యూదుల ఆలోచనలతో దాదాపు పూర్ణముగ పోషింపబడినవారము. మన అభ్యంతర జీవనము ఇంకను నిర్దోషముగ, ఇంకను సమగ్రముగ, ఇంకను సర్వతోముఖముగ - వేయేల ఇంకను అచ్చముగ మానవోచితముగ నొనర్చుకొని, ఈ బ్రతుకును సంస్కరించుకొని శాశ్వత జీవనమును సంపాదించుకొనుటకు కావలసిన రసాయనము ఏదేశపు సారస్వతములో దొరుకునాయని చూచుకొందునుగదా, అది లభించుచోటు అదిగో భారత వర్షము ! —మాక్స్‌ముల్లర్

* దివాలా ఎత్తిన కోటీశ్వరులు ఎప్పటివో వెనుకటి లెక్కలు బండెడు చూపిస్తే ఏమి ప్రయోజనం ? 'పూర్వం హిందూదేశం ఇలా వుండేది' అనే ఆలోచనలతో కాలయాపన చేయబోకు. 'హిందూదేశం ఎలా వుండాలి' అనే సమస్య పరిష్కరించడానికి ఆలోచించు. —స్వామిరామతీర్థ

* వేదకాలం తర్వాత భారతదేశ పతనానికి రెండే రెండు కారణాలున్నాయి. మొదటిది : ఇహలోకంపట్ల వైముఖ్యం చూపి పరలోకాసక్తులై పురుష ప్రయత్నం మాని అదృష్టానికి ప్రాముఖ్యమివ్వడం. రెండవది : సంఘంలోని అర్ధభాగమైన స్త్రీలను అశక్తులను చేయడం.

—పండిత శ్రీపాద దామోదర సాత్వాలేకర్

* తాను కూచున్న కొమ్మను తానే నరుక్కోవడం ఇండియాలో గొప్ప హాబీ. —మన్నవ గిరిధరరావు

* రాజకీయవేత్త నాలుక తప్ప భారతదేశంలో ఏదీ కదలదు

—ఒక విదేశ విమర్శకుడు

* ఒకరి బాధ్యత మరొకరిపై త్రోయడమనే ప్రక్రియ ఇండియాలో సర్వత్రా కానవస్తుంది. —డి ఆర్. మంకేకర్

* ఇండియాలో ఏదీ కదలడం లేదు, కాలం తప్ప

—హైమవతీనందన బహుగుణ

* నేటి భారతదేశం ఏవో కొన్ని భాగ్యవంతమైన చిన్న దీవులున్న దారిద్ర్య సాగరం. —చంద్రశేఖర్

* హిందువుల సంఖ్య ఎక్కువగా ఉన్నందువలననే భారతదేశం లౌకికవాద దేశంగా కొనసాగగలుగుతున్నది.

—బ్రా|బీమసీదు కార్యచరణ సమితి సభ్యుడు జావీద్ హబీబ్

* ఉద్దేశ పూర్వకంగా కాక, కేవలం కాకతాళీయంగా అంగ్లేయులు ఇండియాను జయించారు. వాళ్ళు చేసిన ఏ గొప్ప పనీ ఇంత అనుకోకుండా జరిగిందికాదు.[1] —సీలీ
* ప్రపంచంలోకెల్ల పెద్ద వింత ఏమిటంటే, భారతదేశాన్ని ఆంగ్లేయులు జయించడం.[2] —కార్లయిల్

## భారతీయులు

* భారతీయుడు తోటి భారతీయునికి వ్యతిరేకంగా కుట్రపన్నుతూ వుంటాడు. లేకపోతే అతనికి తోచదు. జీవితంలో రమ్యత వుండదు. ఎవరో ఒకరికి వ్యతిరేకంగా పనిచేస్తుంటాడు. భారతీయునికి నయముకాని వ్యాధి ఒకటున్నది. అది వాచాలత్వం. అతని ఉద్దేశంలో మాటలు అవసరం, కృషి అనవసరం.
—రంజీసహానీ

* మనం జనాభా మాత్రమే - సంఘం కాదు. —జి. కృష్ణ

## భార్య

* భార్య తోడుకున్న పెరుగులాంటిది ; గర్ల్‌ఫ్రెండ్ పొంగుతున్న పాలలాంటిది. —శ్రీ డి.వి.ఎన్. కామేశ్వరరావు

---

[1] Nothing great that has ever been done by Englishmen, was done so unintentionally, so accidentally, as the conquest of India. —Seely

[2] The greatest wonder in the world is the conquest of India by the British —Carlyle

## భార్యాభర్తలు

* వాగర్థా వివ సంపృక్తౌ వాగర్థ ప్రతి పత్తయే
జగతః పితరౌ వన్దే పార్వతీ పరమేశ్వరౌ.

వాక్కు, అర్థము, ఒండొంటితో నిత్యము గూడియున్న విధమున ఒండొకరితో నిత్యం గూడియున్న పార్వతీపరమేశ్వరులను వాగర్థజ్ఞానమును నాకు అనుగ్రహించుటకై నమస్కరించుచున్నాను. —కాళిదాసు

* విధేయత గల భార్య భర్తను శాసిస్తుంది.

—ఆంగ్లసామెత

* స్వామిరామతీర్థుని భార్య ఒకనాడు వారితో "నేను మీకు జ్ఞాపకమున్నానా" అని ప్రశ్నింప రాముడిట్లు జవాబిచ్చెను : "లేదు. రాముని కట్టిజ్ఞాపక మెన్నడును లేదు. నీ కంటె నేను వేరుగా నుంటినని తలచినపుడే నేను నిన్ను జ్ఞాపకముంచుకొనవలెను. నీ కండ్లు ముక్కు చేతులు నీకు జ్ఞాపకమున్నవా ? లేవు. అవియును నీవును ఒక్కటే. నీకంటె అవి భిన్నములు కావు. అట్టియెడ జ్ఞావకావసరమేమున్నది ?" —స్వామి కేశవతీర్థ

* ఆలు మగల మధ్య తగవు అద్దంమీద ఆవగింజవంటిది.

—సామెత

* భావం తెలుసుకుని ప్రవర్తించేదే భార్య ; బాధ్యత తీసుకుని భరించేవాడే భర్త. ..మాతృశ్రీ అనసూయాదేవి

* కంచం దగ్గర వేరయినా, మంచం దగ్గర ఒక్కటవుతారు.
—సామెత

* జీవితం రేడియో సెట్టుకి
భర్త ఏరియల్ భార్య ఎర్తు. —ఆరుద్ర

* భార్యాభర్తలు కత్తెర యొక్క రెండు అంచుల వంటివారు. విడదీయబడనంతగా అతకబడి వుంటారు. తరచు వ్యతిరేక దిశలలో సంచరిస్తున్నట్లు కనిపించినప్పటికీ వారి నడుమకు వచ్చే ఎవరినైనాసరే శిక్షిస్తుంటారు. —సిడ్నిస్మిత్

## భావములు

* మన భావాలు ఎక్కడ జీవిస్తున్నాయో, మనమక్కడ జీవిస్తున్నాము. —స్వామివివేకానంద

* మంత్రమునందు, తీర్థమునందు, దైవమునందు, గురువునందు, జ్యోతిష్కులయందు, ఔషధమునందు, ఎట్టి భావమో అట్టి సిద్ధియే కలుగును. —సంస్కృత సూక్తి

## భావస్వాతంత్ర్యం

* నీవు చెప్పే మాటలతో నేను ఏకీభవించను గాని నీ భావమును ప్రకటించటానికి నీకుగల హక్కును నా జీవితాంతమూ సమర్థిస్తాను. —రూసో

## భాష

* భాష యన్నది భావములను వ్యక్తీకరించు సంకేతముల వ్యవస్థ.
—ఎస్. డి. సాస్యూర్

* శబ్దార్థాల సమ్మేళనమే భాష. —పదాల రామకృష్ణారెడ్డి

* వేరులోనుండి కొమ్మలు వెలసినట్లు
అన్ని శబ్దాలు నిశ్శబ్దమందె పుట్టె
—గాలిబ్ గీతాలు (అను : దాశరథి)

## భీరువు

* నిజము చెప్పలేడు, నిర్భయత్వములేని నరుడు
ప్రజలకై పెనంగలేడు, ముల్లె విడువలేడు
ముతికి సంసారమ్ము వదలలేడు, సుంత కదలలేడు.
—తుమ్మల సీతారామమూర్తిచౌదరి

## భూతదయ

* జంతువుల కన్నా మనం మేధావులం, సమర్థులం, కనుక వాటి క్షేమానికి మనం కర్తలం. —అనిబిసెంట్

* సర్వ భూతములందు దయగలవాడు దేవుని కృపకు పాత్రుడు.
—ఏసుక్రీస్తు

* యదార్థమైన ప్రేమభావం జంతువులతో స్నేహము వలననే కలుగుతుంది. —జవహర్లాల్ నెహ్రూ

* జీవితానికి గొప్ప అర్థం భూతదయను కలిగియుండటమే.
—అబ్రహాంలింకన్

* విశ్వాసం చాలమంది మనుషుల్లో వుండని గుణం. అది జంతువుల్లో వుండే గుణం. —రుక్మిణీదేవి అరండేల్

* దయను ఎంత వేగంగా రెట్టించితే అది అంత మంచి ఫలితాల నిస్తుంది. —హోప్ సాయర్

* ఈ జీవులన్నీ ఒక్కని చిత్రములే. —కబీరు

## మంచి

* ప్రపంచ మెంత దుర్మార్గంలో ప్రవర్తిస్తున్నా, తెలిసో తెలీకో సన్మార్గానికి దాసోహ మంటుంది. —మహాత్మాగాంధీ

* మంచి పనులు చేయడంలో కాంపిటీషన్లు తక్కువ, ప్రపంచానికి ఒక్కడే గాంధీ. —బీనాదేవి

* నీవు మంచివాడవు కాదలిస్తే మంచివారిలోని మంచిని ప్రేమించు. —ఆంగ్లసామెత

## మందు

* మానింది మందు. —సామెత

## మతము

* అసమానతలు లేని సమాజము అసంభవము. నీతి నియమాలు లేకుండ అసమానత దుర్భరము. మత విశ్వాసము లేకుండ నీతి నియమము ఉండజాలవు. —నెపోలియన్

* మతం కేవలం ఒక ఆరాధనా విధానానికి పరిమితమైనదే కాదు. ప్రేమ, సేవలతో కూడిన జీవనమే నిజమైన మతం. —గురు తేజబహదూర్

* మతమును విడనాడిన విజ్ఞానం గ్రుడ్డిది; సైన్సును తిరస్కరించే మతము కుంటిది. —ఆల్బర్ట్ ఐన్‌స్టీన్

* మతముయొక్క మార్గము దోషరాహిత్యానికి సోపానం. అది సరళ మైన మార్గం. కాని అనుసరించుటకు కష్టమైనది. ఉత్తమంగా ఉండటం, ఉత్తమంగా వ్యవహరించడం, తోటి మానవులలో ఉత్తమత్వాన్ని చూడటం - ఇదే నాదృష్టిలో మతానికి అర్థం.
—హాలివుడ్ సినీతార మేరిపిక్‌ఫోర్డ

* నీతి మతమును సమైక్య పరుస్తుంది ; మతము నీతిని పవిత్ర మొనర్చుతుంది.[1] —రఘుపతి వెంకటరత్నం నాయుడు

* మత మన్నది నాకంటికి మసకైతే
ద్వేషాలూ రోషాలూ తెచ్చేదే మతమైతే
మతం వద్దు గితం వద్దు
మాయామర్మం వద్దు. —దేవులపల్లి కృష్ణశాస్త్రి

* మతములన్ని చేరి మతిచెడి కలహింప
ప్రేమ అన్నమాట పరుగుతీయు
ప్రేమ లేని మతము పిచ్చిగా మారును
—విశ్వయోగి విశ్వంజీ

## మద్యము

* ఆల్కహాల్ కోరికను పుట్టిస్తుంది, కాని క్రియాశక్తిని తగ్గిస్తుంది.
—షేక్స్పియర్

---

[1] Morality unifies religion and religion sanctifies morality.

* మొదట మనం మద్యాన్ని త్రాగుతాం. తుదకు అది మనల్ని త్రాగుతుంది. —ఆంగ్లలోకోక్తి

* సింహాన్ని ఎదుటకు వెళ్ళినపుడు భయపడకు;
అది నీ పరాక్రమమునకు గీటురాయి
కరవాలమునకు నీ కుత్తుక నందించునపుడు భయపడకు,
అది నీ బలిదానమునకు మంచి మచ్చు తునక
పర్వతాగ్రమునుండి క్రిందికి దుముకునపుడు భయ
పడకు; అది నీ తపమునకు సరియైన సాధన
అగ్నిజ్వాలలు నలువైపుల నలముకొనునపుడు
భయపడకు; అది నీ సహనశక్తికి గట్టి పరీక్ష
కాని, మద్యమునకు మాత్రము తప్పక భయపడు
అది పాపములకు, అనాచారములకు కన్నతల్లి!
—గౌతమబుద్ధుడు

* సారాయిలో సత్యమున్నది.[1] —ఆంగ్లసామెత

మధ్యతరగతి

* సమాజంలో పైన నురుగు, అడుగున మడ్డి, మధ్య అత్యుత్తమం.
—వాల్టేర్

మనస్సు

* బ్రహ్మాండంలో ఏమివున్నదో అణువులో గూడ అదే వున్నది. మానవ శరీరంలో గూడ అదే వున్నది.

---

1 There is truth in wine. (Truth comes out under its influence). —Proverb

సూర్యుడు మానవ శరీరంలో ఆత్మగా వున్నాడు. చంద్రుడు మనస్సు. భూమియే మానవ దేహము. ఈ మూడింటి సంబంధ మును నిరంతరం గుర్తించుకోవలెను.

మానవుని మనస్సు సింహద్వారము. దానికి ఒకవైపున ఆత్మ (Intelligence), మరొక వైపున దేహము (Matter) వున్నాయి. మనస్సు లోపలివైపుకు చూస్తే ఆత్మ, వెలుపలికి చూస్తే శరీరము కానవస్తాయి. **Mind is the gateway between matter and intelligence.**

—డా॥ జి.ఎల్.ఎన్. శాస్త్రి

* మనస్సుకున్న శక్తిని మాటల్లో చెప్పడం అసాధ్యం. మానవుడు తనకున్న బాహ్యాంగాలతో ఎన్ని కార్యాలు నిర్వర్తించగలడో తన మనస్సుతో గూడ అన్ని కార్యాలూ, అవసరమైతే ఇంకా ఎక్కువ చేయగలడు. —మిసెస్. లూసియారైన్

* జాగ్రదవస్థలో, మేలుకొనే స్థితిలో వ్యక్తి ఇంద్రియాల ద్వారా విషయాలను గ్రహిస్తాడు. కలలో మనస్సే అయిదు ఇంద్రియాల పనులూ చేస్తుంది. గాఢ నిద్రలో మనస్సు సంస్కార రూపంలో, సూక్ష్మ రూపంలో, వాసనల రూపంలో పనిచేస్తుంది. ఈ మూడు దశలలోనూ తెలుసుకొనే స్థితి ఆత్మ.

—అంబడిపూడి కొండయ్యశాస్త్రి

మనస్సు స్వేచ్ఛాజీవి ; బుద్ధి నియంత.

—కొడవటిగంటి కుటుంబరావు

* ఇతరులకన్న మనం ఏ విధంగా భిన్నమో తెలిపేది మనస్సు. ఇతరులలోను మనలోను సమానమైన లక్షణాలేవో తెలిపేది హృదయం. — ఎక్కిరాల కృష్ణమాచార్య

* మనస్సుకు మనన శక్తి, జిజ్ఞాస, ఊహ అని మూడు గుణాలుంటాయి. —ఉషశ్రీ

* ఒకరికిస్తే మరలిరాదు - ఓడిపోతే మరచిపోదు
గాయమైతే మాసిపోదు – పగిలిపోతే అతుకు పడదు
మనసు గతి ఇంతే - మనిషి బ్రతుకింతే
మనసున్న మనిషికీ సుఖము లేదింతే. — ఆత్రేయ

* అందానికీ ఆనందానికీ మధ్య దూరం ఎంత ?
అందానికీ ఆనందానికీ మధ్య వారధి మనస్సు.
—పోతుకూచి సాంబశివరావు

* గొడ్డంట నఱికిన తరువయినను మరల చిగురించును గాని మాటలచే విఱిగిన మనస్సు తిన్నబడ నేరదు.
—విదురనీతి

* మనస్సును ఏకాగ్రము చేయుటకు దీపముపై దృష్టి నిలుపుట అతి సులభమైన మార్గము. —శ్రీ రామకృష్ణ పరమహంస

* మౌనమె నీభాష - ఓ మూగ మనసా
తలపులు ఎన్నెన్నో - కలలుగ కంటావు
కల్లలుకాగానే - కన్నీరి వుతావు
చీకటిగుహ నీవు - చింతలచెలి నీవు

నాటకరంగానివే - మనసా - తెగిన పతంగానివే
ఎందుకు వలచేవో - ఎందుకు వగచేవో
ఎందుకు రగిలేవో - ఏమై మిగిలేవో
కోర్కెల సెల నీవు - కూరిమి వల నీవు
ఊహల ఉయ్యాలవే - మనసా - మాయల దయ్యానివే
లేనిది కోరేవు - ఉన్నది వదిలేవు
ఒక పొరపాటుకు - యుగములు పొగిలేవు. —ఆత్రేయ

* ఇనుము విరిగెనేని యినుమారు ముమ్మారు
కాచి యతుకనేర్చు కమ్మరీడు
మనసు విరిగెనేని మరిగూర్పరాదయా —వేమన

* మనస్సులు విరిగిన తర్వాత ఆ మిత్రులలో ప్రేమ జనించదు.
పాలు విరిగిన తర్వాత ఎంత మధించినా వెన్నరాదు.
—అక్బర్ కాలపు కవి రహీమ్‌ఖాన్

* మనసు మూగదేగాని బాసున్నది దానికీ —ఆత్రేయ

* మనస్సు ఉంటే మార్గముండకపోదు. —సామెత

* మనసు తనలోనే నరకాన్ని స్వర్గంగా
స్వర్గాన్ని నరకంగా తయారు జేస్తుంది.[1] —మిల్టన్

---

[1] The mind in its own place and in itself
Can make a heaven of hell and a hell of heaven.
—Milton

* ప్రాకారము లేక పాడైన పురము ఎంతో
తన మనస్సును అణచుకొనలేనివాడును అంతే
—బైబిలు-సామెతలు 25-28

* మనస్సే సర్వము. భార్య యందలి యనురాగము ఒక విధమైనది. బిడ్డయందలి యనురాగము మఱియొక విధమైనది. నరుడిద్దరను ముద్దిడుకొనుచున్నాడు. కాని మనోభావములు వేరు.
—శ్రీరామకృష్ణ పరమహంస

* మనిషికి మనసే తీరని శిక్ష
దేవుడిలా తీర్చుకున్నాడు కక్ష. —ఆత్రేయ

* నీ మనస్సు నొప్పించడానికి ఇద్దరు కావలసివస్తారు - నీశత్రువు, నీ మిత్రుడు. నీ మీద అపనింద వేయడానికి నీ శత్రువు,ఆవార్త నీకు అందచేయడానికి నీ మిత్రుడు. —మార్క్ ట్వైన్

* మనస్సు ప్రవర్తించే తీరుని "ఇడ్, ఇగో, సూపర్ ఇగో" (**Id, Igo, Super ego**) అని మూడు రకాలుగా విభజింపవచ్చు. ఈమూడు మానసిక స్థితులూ ప్రతి వ్యక్తిలో అనుక్షణం పని చేస్తుంటాయి. చూసిన ప్రతి స్త్రీనీ అనుభవించాలని "ఇడ్" అరాటపడితే, 'సూపర్-ఇగో' ఇది తప్పు అదితప్పు అని అంటూ అనుక్షణం సంస్కారాన్ని పెంచుతూ వుంటుంది. ఈ రెండిటి బాలెన్సు అగు మానసిక ప్రవర్తనే 'ఇగో'.
—డా॥ జి. సమరం

* మానవుని మనస్సు ఒక ఊట బావి. నిత్యనూతనంగా ఉండగల అంతర్శక్తి దాని కొక్కదానికే ఉంది.

—జిడ్డు కృష్ణమూర్తి

* బంధించినా, బంధనాలు తెంపినా మనస్సే.

—తైత్రేయోపనిషత్తు

* స్వార్థానికి చోటివ్వనంత కాలం మనస్సుకు ముసలితనం రాదు.

—జిడ్డు కృష్ణమూర్తి

* మనస్సు అనే అరని జ్యోతే మనుష్యునికి పెద్ద దివిటీ.

—జిడ్డు కృష్ణమూర్తి

## మనుష్యులు

* కేవలం రుచిజీవి పశువు ; అభిరుచిజీవి మానవుడు.

—యస్వీ జోగారావు

* ఏ ఆదర్శం లేని వ్యక్తి తెడ్డులేని పడవ లాంటివాడు.

—మహాత్మాగాంధీ

* మానవ శబ్దానికి అర్థం మననంచేసేవాడు అని, మనుష్యుడు అంటే మనసు కలవాడని అర్థం. —ఉషశ్రీ

* మానవుడు ఆర్జించుకున్న సంపద, విజ్ఞానము, సదుపాయముల కన్న తాను ఎక్కువ విలువైనవాడు. ఈ అంశమును విస్మరించి నపుడు చెడ్డరోజులు వచ్చును. —ఎక్కిరాల కృష్ణమాచార్య

* మనుష్యుడు కారువంటివాడు ; గురువు డ్రైవరు వంటి వాడు ; భగవంతుడు పెట్రోలువంటివాడు. గురువు పర్యవేక్షణలో,

భగవంతునిపై విశ్వాసంతో మనుష్యుడు జీవితాన్ని సఫలం చేసుకోవాలి. —విశ్వయోగి విశ్వంజీ

* ఎడం ఎడంగా నాటిన మొక్కలుకూడా పెరిగినకొద్దీ దగ్గరపడి కలుసుకుంటాయి. మనుషులు పెరిగినకొద్దీ దూరమవుతారు.

—కొడవటిగంటి కుటుంబరావు

* భయము, స్వలాభమే అనేవి రెండూ మనుష్యులను నడిపిస్తాయి.

— నెపోలియన్

* మానవుడు పక్షివలె ఆకాశంలో ఎగరడం నేర్చాడు ; చేపవలె నీటిలో ఈదడం నేర్చుకున్నాడు ; కాని మానవునివలె భూమి మీద మెలగడం నేర్చుకోలేదు. —బెట్రండ్ రస్సెల్

* సాధారణంగా మనుష్యులు చేసినమేలు మరుస్తారు ; అలిగా మాట్లాడుతారు; మనసులోని అంతర్యాన్ని బయటపెట్టరు; ప్రమాదం కనిపిస్తే తప్పుకుపోతారు; తమదికానిదాన్ని స్వంతంచేసుకో జూస్తారు. —మెకియవెల్లీ

* మనుష్యులు అమాయకంగా వుండి అప్పటి అవసరాలకు ఎంతగా తొందర పడతారంటే, మోసగించ గలవాడు గనుక వుంటే మోసపోయేవాళ్ళు ఇట్టే దొరుకుతారు. — మెకియవెల్లీ

* మనుషులు తమ తండ్రి మరణాన్ని అయినా తేలికగా మరచి పోగలరు.కాని తమ వారసత్వపు ఆస్తి కోల్పోవడాన్ని మాత్రం మరువలేరు.

— మెకియవెల్లీ

* మానవుడు ఆనందం అనుభవించాలంటే అతనికి రెండు విష యాలు కావాలి. అవి ప్రేమ, జ్ఞానము. —బెర్ట్రాండ్ రస్సెల్

* నీకు చదవడం చేతనయితే ప్రతి మనుష్యుడు ఒక ఉద్గ్రంథం.
—చాన్నింగ్

* మనిషికి హృదయ నైర్మల్యము కావలెనంటే సేవాభావముండాలి.
—స్వామి శివానంద

* మనుష్యుల ఘనత పడిపోక పోవడంలోగాక, పతనమైన ప్రతి సారి మరల లేవడంలో వున్నది. —ఆలివర్ గోల్డుస్మిత్

* మనుష్యుడు మృగమువలె ప్రవర్తించినపుడు
మృగముకంటె హీనుడవుతాడు.[1]
—రవీంద్రనాథ్ టాగోర్

* మనిషికి మరోపేరు వ్యక్తి. వ్యక్తం చేయగలుగుతాడు గనుక వ్యక్తి. దేన్ని వ్యక్తం చేస్తాడు ? ఏది గుప్తంగా వుంటుందో దాన్ని వ్యక్తంచేస్తాడు. గుప్తంగా వున్నదీ అంటే అవ్యక్తంగా వున్నదనే అర్థం. అవ్యక్తాన్ని వ్యక్తపరుస్తాడు గనుకనే వ్యక్తి.
—ఎస్. సంజీవదేవ్

---

[1] Man is worse than an animal,
When he is an animal. — Tagore

* గాజుమణి యంచు సన్మణి గాజటంచు
దలచు వారి మానవులుగా దలపరాదు
గాజు గాజుగ మణి మణిగ గ్రహించు
బుద్ధిమంతులె జగతిలో బొగడుగాంత్రు

—చిలకమర్తి లక్ష్మీనరసింహం

* చింత వలన మనుష్యుడు గడ్డిపరకకంటె అల్పుడగును.

—యక్షునికి ధర్మరాజు జవాబు

* దున్ననపుడు దూడలలోన
మేయునపుడు యెద్దులలోన
యన్న లోకోక్తి అక్షరాల
మానవులపట్ల మరింత నిజము.

—యార్లగడ్డ రంగనాయకులు చౌదరి

* మనుషుల క్షేమాన్ని మనస్ఫూర్తిగా ద్వేషించే మనుషులు డాక్టర్లూ లాయర్లూ.

—ఉమాపతి పద్మనాభశర్మ

* మనిషికి ఉన్నది పుష్టి, పసరానికి తిన్నది పుష్టి.

—సామెత

* ధర్మాత్ముడు మానవుని హృదయ బంధువు
కరుణాత్ముడు ఈశ్వరుని ఆత్మబంధువు

—ఖలీల్ జిబ్రాన్

* దాన్ని ఎలా పొందాలో తెలుసుకుంటే, అనంతమైన శక్తి మానవుని అందుబాటులో వున్నది. యోగశాస్త్రంలో ఆ తెలుసుకొనడ మొకభాగం.[1] —ఆడమ్స్‌బెక్

* బంగారంగాదు మనుష్యులు మాత్రమే
జాతిని గొప్పదిగాను శక్తిమంతం గాను చేయగలరు[2]

* మనిషి సంగతి మాటలు చెప్పు, ఇంటి సంగతి గోడలు చెప్పు.
—సామెత

* కప్పవలె బురదలోను, పురుగువలె పేడలోను, పాము వలె చీకటి బిలములోను సుఖముగ జీవింపవచ్చునుగాని మానవుడై యుండి యుక్తాయుక్త జ్ఞానము లేక జీవించుట మహా దుఃఖకరము.
—వశిష్ఠుడు

* సోకోర్చువాడె మనుజుడు. —సుమతీశతకము

---

[1] Infinite energy is at the disposal of man if he knows how to get it, and this is part of the sciencc of yoga. —Adams Beck

[2] Not gold, only men can make
A people great and strong. —Emerson

* అతని చుట్టూ చేరే మనుషుల్నిబట్టి
ఆతడెలాంటివాడో తెలుస్తుంది. —ఆంగ్లసామెత

* మనుష్యుడు గర్వము వీడిన ఎల్లరకు ప్రియుడగును ; కోపము నణచుకొనిన దుఃఖము లేనివాడగును. లోభత్వము వీడిన ధనాఢ్యుడగును; ఆశను విడిచిన సుఖియగును. —ధర్మరాజు

* మానవుడు 'శివం' గాని శవంగాదు. (శివం=శివుడు). మానవునికి మూడు నేత్రములున్నవి. అవి సూర్యచంద్రాగ్నుల నుండి వచ్చినవి. అగ్నినేత్రము అంతర్నేత్రము. అది యోగశక్తిచేత మాత్రమే తెరువబడును. త్రినేత్రుడైన శివుడు భూత భవిష్యద్వర్తమానములు మూడును చూడగలడు. నీవు పదేండ్ల క్రిందట నొక పిల్లవానిని చూచియున్నచో వాని అప్పటి రూపమునే నీవు నీ మనసులో మరల చూడగలవు. ఇప్పుడెట్లున్నాడో, ఇక పదేండ్లకెట్లుండునో నీవు చూడజాలవు. దానిని యోగాభ్యాసము చేత సంపాదించుకొనవచ్చును. అపుడు నీవు దేశ కాలముల కధికారి వగుదువు. —సత్యసాయిబాబా

* ఆరోగ్యం గలవాడే యౌవనవంతుడు, ఋణం లేనివాడే ధనవంతుడు. —ఆంగ్లసామెత

* మానవునికి శారీరక అవసరాలే కాకుండా మరికొన్ని అవసరాలు కూడా వుంటాయి. మనిషినీ మృగాన్నీ వేరుచేసేవి ఆ అవసరాలే. —జస్టిస్ హెచ్. ఆర్. ఖన్నా

* మానవ శబ్దము 'మన్' ధాతువు నుండి యుత్పన్నమైనది. ఈ యాధారమునుబట్టి 'మానవుడు'యని అనగా ఆలోచనాపరుడన్న యర్థము లభించును —స్వామి శ్రీ

* మానవుడు మానవుడనిపించుకొన్నది భాష నుపయోగించుట యెరిగి నప్పటినుండియే. అప్పటినుండియే మానవునకు తక్కిన జీవరాశులకంటె నొక విశిష్టత యేర్పడినది. —స్వామి శ్రీ

* పురుషులు విచిత్ర ప్రాణులు. వారు యౌవనంలో మగువల వెంట పడతారు; మధ్య వయస్సులో ధనం వెంట పడతారు; వృద్ధాప్యంలో ఆరోగ్యం వెంట పడతారు. —ఒక మేధావి

* స్వీయ లోపమ్ము లెరుగుట పెద్దవిద్దె
లోప మెరిగినవాడె పూర్ణుడగు నరుడు
—గాలిబ్ గీతాలు, అనువాదం : దాశరథి

* మనుష్యుడు రొట్టెవలన మాత్రము కాదుగాని, దేవుని నోటి నుండి వచ్చు ప్రతిమాట వలన జీవించును.
—మత్తయి సువార్త (4:) 3

* మానవ దేహ మొక వృక్షము. ఆ చెట్టు భూమినుండియు మానవ సంఘము నుండియు పోషక పదార్థములను తీసుకొనును. అందుకు మారుగా వారందరికి అది ఇవ్వగలిగినదేమి? ప్రేమ ఫలము. ఆ ఫలముత్పన్నము కానిచో ఆ చెట్టు గొడ్డుచెట్టే.

—సత్యసాయిబాబా

* తన ప్రత్యర్థి కష్టాలలో ఉన్నపుడు నవ్వగల, సుఖాలలో ఉన్నపుడు ఏడువగల జంతువు మానవుడు.

—గోళ్ళమూడి గోపాలకృష్ణమూర్తి

* మానవుని నడక నవగ్రహాలమీద ఆధారపడిలేదు. రాగద్వేషములనే రెండు గ్రహాలమీద ఆధారపడి ఉన్నది.

—మాతృశ్రీ అనసూయాదేవి

* మనుష్యులకు తమ అవసరాలు గుర్తుంటాయేకాని సామర్థ్యాలు గుర్తుండవు.

—నెపోలియన్

* మనిషికి స్వేచ్ఛకావాలి. ఇతరుల సహకారమూ కావాలి. ఈ రెంటికీ వైషమ్యం కలుగకుండా జీవిస్తేనే మనిషికి సుఖం ఉన్నది. రెండింటికీ ఘర్షణవచ్చి స్వేచ్ఛనో సహకారాన్నో త్యాగం చెయ్యవలసి వచ్చినపుడు చాల బాధ కలుగుతుంది.

—కొడవటిగంటి కుటుంబరావు, 'అనుభవం' నవల

* మృతినెరుంగని ఒంటి దేవతల కన్న
నలుగురికి మేలుచేసెడి నరుడి మిన్న

—గాలిబ్ గీతాలు (అను : దాశరథి)

* జీవితంలో నటన వృత్తిగా తీసుకొనేవాడొకప్పుడు
మానవుడు; నటనే జీవితంగా జీవిస్తున్నాడు ఇప్పుడు.

—అక్కినేని నాగేశ్వరరావు

* ఏజాతి అయినా ఉచ్ఛదశకు రాగలిగినదంటే దానికి ఆ దేశపు పార్లమెంటువారు చేసే శాసనాలు కారణం కాదు. ఆ దేశపు ప్రజల శీలసంపదే కారణం. దేశంలో వున్న యావత్తు సంపద కంటే గూడ మనుష్యులయొక్క విలువ అధికం. ఒకవేళ మనకు కావలసిన భౌతికావసరాల నన్నిటిని ప్రభుత్వం సమకూర్చిందనుకోండి, వాటిని సద్వినియోగ పరచుకోగల శీలవంతులైన వ్యక్తులేరీ? కనుక మనుష్యులను ముందు తయారుచేయండి.

—స్వామి వివేకానంద

* మానవుడు సృజనశీలి లేక స్రష్ట. మానవుడు సృష్టిస్తాడు. మానవుడు సృజనశీలి మాత్రమే కాదు; సమీక్షకుడు గూడ. అతనిలో హేతువాదం ప్రతివిషయాన్ని సమీక్షింప జూస్తుంది. ప్రతి మనిషిలోనూ సృజనాత్మక అనుభూతి, సమీక్షాత్మక ఆలోచనా సహజీవనం చేస్తుంటాయి.

—యస్. సంజీవదేవ్

* ఓ మానవుడా! చిరునవ్వుకూ కన్నీటికీ నడుమ
తిరుగాడే లోలకానివి.[1] —బైరన్

* ప్రజలు కలియుగాన ప్లాస్టిక్కు పూలైరి.
—బండ్లమూడి సత్యనారాయణ

* ప్రతి మానవుడు మూడు విధములైన గుణములతో గూడి ఉంటాడు. తనకు కావాలనే 'కామం' మొదటిది. అదే కోరిక.

అది నెరవేరకపోతే 'క్రోధం'. లభించినది పోతుందని 'లోభం'. కావాలి; విఫలంకాకూడదు; లభించినది పోగూడదు. మానవ స్వభావ మిటువంటిది. —సత్యసాయిబాబా

* ఆశ ఉత్తరధృవం, విధి దక్షిణధృవం
మనిషి రెండిటిమధ్య ఎగిరిపడే ప్రహసనం.
—దేవరకొండ బాలగంగాధరతిలక్

* ప్రతి పదార్థమునకు ప్రత్యేక లక్షణమున్నది. మానవత్వమనగా అంతర్దృష్టి కలది. పశ్యతీతి ప్రశుః అన్నట్లు బహిర్దృష్టి కలది పశువు. మానవాకారంలో ఉన్నా అంతర్దృష్టి లేకున్నచో పశువే గాని మానవుడు కాదు. —సత్యసాయిబాబా

---

[1] Man ! Thou art pendulum
Betwixt a tear and a smile. —Byron

* మనుష్యులు పొందగోరు విలువలు మూడు. అవి : ఆదాయము, భద్రత, గౌరవము. —హెరాల్డ్ లాస్వెల్

* మనుష్యులు కలహించుకోడానికి హేతువులు మూడు. అవి : పోటీ, న్యూనభావము, ప్రతిష్ఠ. —థామస్ హాబ్స్

* మనుష్యులు ప్రకృతి సిద్ధగా పొందిన హక్కులు మూడు. అవి: ప్రాణహక్కు, స్వేచ్ఛహక్కు, ఆస్తిహక్కు.

—జాన్ లాక్

* మనుష్యులు మూడింటి కొరకు నిరంతరం ఆరాటపడుతుంటారు. అవి : అధికారము, ధనము, కీర్తి.

—మిన్‌హాజ్ మర్చెంట్

## మరణము

* తనచావు జగత్ప్రళయము. —సుమతీ శతకం

* చచ్చిన వారికేడ్చెదరు చావనివారలభంగి. —భాగవతము

* వృద్ధులు మరణం వద్దకు పోతారు; మరణం యువకుల వద్దకు వస్తుంది. —ఆంగ్లసామెత

* మరణమంటే మరపులో గూడిన ప్రశాంతమైన నిద్ర.

—షేక్స్పియర్

* వానరాకడ ప్రాణంపోకడ తెలియవు. —సామెత

* ఎంతో ఉత్సాహపడి కష్టింతుమౌర !
మృతియె లేకున్న రుచి యేది బ్రతుకులోన.
—గాలిబ్ గీతాలు (అను : దాశరథి)

* స్వశక్తిని మరచిన అదియే మరణము. ఆత్మ జ్ఞప్తి యందుండు టయే జీవనము. —సత్యసాయిబాబా

* బాల్యము వదలి కౌమారము, కౌమారము వదలి యౌవనము, యౌవనమును వదలి వార్ధక్యము వచ్చినట్లే మరణముగూడను. పాతబట్టలు వదలి క్రొత్తబట్టలను పరిగ్రహించుటకంటె ప్రాణ హాని ఎక్కువదికాదు. —పానుగంటి లక్ష్మినరసింహారావు

* అది వచ్చినపుడు నేనుండను, నేనుంటే అది రాదు.
—ఆత్రేయ

* దరిద్రం సముద్రంలో వేదనల తెరచాపలెత్తి
ప్రయాణించే జీవన నౌకలకి మృత్యువే లైట్ హౌస్.
—దేవరకొండ బాలగంగాధర తిలక్

## మహాత్ములు

* ఒక గొప్పవాని గొప్పతనం ఎందులో కనిపిస్తుందంటే అతడు తక్కువవారితో వ్యవహరించే తీరునుబట్టి తెలుస్తుంది.
—కార్లయిల్

* మహాత్ముల జీవితములన్నీ మనకు గుర్తుచేస్తాయి
మన జీవితాలను మనం ప్రకాశవంత మొనర్చుకోగలమని;
మరణిస్తూ వారు మనకొరకు వదలి పెడతారు,
కాలమనెడి ఇసుకలో వారి పాదముద్రలను.

—లాంగ్ ఫెలో

* మహాత్ముల జీవితములు గుమ్మడిపాదువంటివి. ఆ పాదు పుట్టిన స్థలమునుండి చాల దూరము ప్రాకిపోయి అచ్చట కాయలు కాస్తుంది. మహనీయులు గూడ పుట్టిన కుటుంబములోవారికన్న ఇతరులకే యెక్కువ లాభము కలిగించువారవుతారు.

—శ్రీమళయాళస్వామివారు

* నిరుపేదల కష్టాలనుచూచి వలవల యేడ్చేవాడే మహాత్ముడు. లేనిచో వాడు దురాత్ముడే. —స్వామి వివేకానంద

మహాత్ములు సౌఖ్యములోను విపత్తులోను ఒకే రూపములో ఉంటారు. సూర్యుడు ఉదయించునపుడు అస్తమించునపుడు రక్త వర్ణములోనే యుండును.[1] —హితోపదేశము

---

1 సంపత్తౌచ విపత్తౌచ మహతాం ఏకరూపతా
ఉదయే సవితారక్తః రక్తస్త్వాస్తమయే తథా

## మానవత్వం

* శరీరం, మనస్సు, ఆత్మల కూడికయే మానవత్వం. వీటికి చేయుట, తెలుసుకొనుట, ఉండుట అనిఅర్థం. దేహముచేయుట, మనస్సు ఆలోచించుట, ఆత్మ సాక్షీభూతమగుట జరుగును. వీటి ఏకత్వమే పూర్ణత్వము.

—శ్రీ సత్యసాయిబాబా

## మాటలు

* మాటలవలననే స్నేహము, విరోధము, తెలివి, మనస్తాపము, ధర్మము, పాపము, సుఖవృద్ధి, దుష్టత్వము కలుగుచున్నవి. కనుక తగినట్లు నేర్పుగా మాట్లాడవలెను. తీక్షణమైన గొడ్డలిచే నరికినను చెట్టు చిగురించును. కాని మాటలచేత చెడిన కార్యము చక్కబడదు. —భారతంలో విదురనీతి

* చైనాలో ఒక నానుడి ఉన్నది. అదేమంటే నాలుకనుంచి జారిన ఒక దురదృష్టకరమైన మాటను ఒక కోచి ఆరుగుర్రాలతోనైనా వెనక్కి రాబట్టలేము. — గోల్డ్‌స్మిత్

* నిజమే. పని వేరు. మాటలు వేరు. పని అంటే మాటలు చెప్పడం కాదు. కాని మాటలు చెప్పడం పనేగా! అసలు 'మాట' అనేదే పని. అందులోనూ అనేకులు అనేకకాలం నిరంతరంగా చేసిన

పనంతా కలిపితేగాని ఒక్క మాట అవదు. కాబట్టి మాటలు చెప్పడం మాటలుకాదు సరిగదా డబ్లి పనిగూడాను.

—భమిడిపాటి కామేశ్వరరావు

* ఒట్టి వాని మాట
గట్టి నీళ్ళమూట. — పెద్దబాలశిక్ష

* మాటలకంటె హృదయం, ఆచరణ గొప్పవి. వాటి ద్వారా మనం యితరులతో ప్రసంగించాలి.

—అనుభవానందస్వామి

* మాట్లాట తెలిస్తే పోట్లాట ఉండదు. —సామెత

* కోకిలమ్మ చేసుకొన్న పుణ్యం బేమి
కాకి చేసుకొన్న కర్మమేమి
మధుర భాషణమున మర్యాద ప్రాప్తించు. —కరుణశ్రీ

* మాటలునేర్చిన కుక్కను వేటకు తీసుకువెళ్ళి ఉస్కో అంటే ఉస్కో అన్నదట. —సామెత

* నోరు మంచిదవుతే ఊరు మంచిదవుతుంది. —సామెత

* మాటకు ప్రాణము సత్యము. —సుమతీశతకం

* పెదవి దాటితే పెన్నదాటుతుంది. —సామెత

* అల్పుడెపుడుపల్కు నాడంబరముగాను
సజ్జనుండు పల్కు చల్లగాను
కంచుమ్రోగునట్లు కనకంబుమ్రోగునా? —వేమన

* మాట్లాడటాన్ని ఒక లలితకళగా మలచి అందించే ఓర్పూ నేర్పూ స్త్రీలలో ఉన్నట్లు పురుషులలో కన్పించదు.... చాలామంది పురుషులకి మనం ఎలా మాట్లాడుతున్నాం అనే దానికన్న, ఏం మాట్లాడుతున్నాం అనే దానిమీదే ధ్యాస ఎక్కువ.... మగ వానికి 'మేటర్' (సంగతి) మీద ఉన్న దృష్టి 'మేనర్' (విధానము) మీద ఉండదు. —పోలాప్రగడ రాజ్యలక్ష్మి

* కట్టలేని నోరు
కట్ట తెగిన యేరు. — పెద్దబాలశిక్ష

మాట మూటదెచ్చు, మేటి మిత్రుల గూర్చు
మాటగూర్చి వేయి మాటలేల ?
చేటుమాట యొకటి కాటికి జేర్చురా.

—బండ్లమూడి సత్యనారాయణ

ఇద్దరు వ్యక్తుల మధ్య నిశ్శబ్దాన్ని చీలుస్తుంది మాట.
ఆనందం ఆపుకోలేనపుడు కళ్ళే మాటలాడుతాయి.
మాట మాత్రమే మనిషిని మనిషి చేస్తుంది.
ఒక చల్లనిమాట నిజమైన మనశ్శాంతి నిస్తుంది.

—సుమనశ్రీ

* పాలిస్తాం ప్రజలను మాటలతో![1] —డిజ్‌రేలీ

* మంచిమాటకు ఖర్చు లేదు, విలువ అధికం. —హెర్బర్ట్

* భావం దాల్చే వేషమే మాటలు. —కార్లయిల్

* నోరు మంచిదయితే తల కాస్తుంది. —సామెత

* మానవులు ప్రయోగించే శక్తివంతమైన మందు మాటలు. —కిప్లింగ్

* భగవంతుడు మనకు రెండు కళ్ళు రెండు చెవులు ఇచ్చాడు. కాని నోరు మాత్రం ఒక్కటే ఇచ్చాడు. దీనిని బట్టి మనం మాట్లాడటంకంటె అధికంగా వినాలని, అధికంగా చూడాలని గ్రహించవలసి ఉంటుంది. —సోక్రటీస్

## మార్పు

* మంచిదైనా ఒకే ఒక ఆచారం లోకాన్ని చెరుపరాదని క్రొత్త దానికి చోటు ఇస్తూ పాతపద్ధతి మారుతుంది. దేవుడు అనేక విధాల తన పనులు తాను చేసుకుపోతాడు.[2] —మాత్యూ ఆర్నాల్డ్

---

1. We govern men with words. —Disraeli
2. The old order changeth yielding place to new
   And God fulfils Himself in many ways
   Lest one good custom should corrupt the world.
   —Mathew Arnold

* మార్పు లైఫ్‌కి గొప్ప థ్రిల్ ఇస్తుంది.

—దాసరి ఝాన్సీరాణి

## మెరుగు

* స్వర్గంలో సేవచేసేకన్న
నరకంలో రాజ్యం చేయడం మిన్న. —మిల్టన్

* సింహముతోక కావడం కన్న కుక్కకు తల కావడం నయం.

—సామెత

* స్వారిచేసే తండ్రికన్న, అడుక్కుతెచ్చే అమ్మనయం.

* పడదోసే గుఱ్ఱంకన్న మోసే గాడిదమేలు. —సామెతలు

## మొదలు చివరలు

* రొట్టెకు రేవేమిటి ? —సామెత

## మోసము

* ఒకడు నిన్ను ఒకమారు మోసగిస్తే అది వాడితప్పు: రెండుసార్లు మోసగిస్తే అది నీ తప్పు. —రూమేనియా సామెత

జీతము బత్తెము లేకనే తోడేలు మేకల్ని కాస్తానన్నదట.

* నీటిలో గేదెనుపెట్టి కొమ్ములుచూపి బేరమాడినట్లు.

ఒకందుకు పోస్తే ఒకందుకు తాగినట్లు. —సామెతలు

* తాను చేస్తే లౌక్యం, మరొకడు చేస్తే మోసం.

—గురజాడ అప్పారావు

* తల్లిని చంపినవాడు వచ్చి అయ్యా తల్లిలేనివాణ్ణి కరుణించండి అన్నట్టు. —సామెత

## మోక్షము

* మోక్షమనగా చచ్చిపోవుటయని భయపడకుము. మోక్షము దుఃఖమునకు చావు; ఆనందమునకు పుట్టుక. ఆ దుఃఖము మరి పుట్టదు, ఆ యానందమునకు క్షయముండదు.

—సత్యసాయిబాబా

* నాకు మోక్షము ఎపుడు లభించును ?
'నేను' అన్నది అంతరించినపుడు.

—రామకృష్ణ పరమహంస

* మోక్ష శబ్దమునకు మో=మోహమును, క్ష=క్షమింపజేయునది యని యర్థము. మోహమనగా భ్రాంతి. భ్రాంతి యనగా క్షణ భంగురములును అల్పసారములును తాత్కాలిక సంతోష దాయకములైన లౌకికార్థములు సత్యములనుకొని వాటికొరకు ఖేంపరలాడుట. —సత్యసాయిబాబా

* సాధారణంగా ప్రతివారూ 'నేను' కు ముక్తి కావాలనుకుంటారు. ఇది సరికాదు. 'నేను' నుండి ముక్తికావాలి.

—రమణ మహర్షి

(చూడు : ఆత్మజ్ఞానము)

## యాచకుడు

* తేలికగల పదార్థములలో తృణమే తేలిక; దానికన్నను దూది తేలిక; దాని కన్నను యాచకుడు తేలిక. —చాణక్యుడు

* బిచ్చగాడు ఎన్నటికీ దివాలా తీయడు. —ఆంగ్లసామెత

* యాచనచే మానవుడు అల్పుడగును. బలిచక్రవర్తిని యాచించ బోయినపుడు విష్ణుదేవుడంతటివాడు వామనుడు కావలసి వచ్చెను. —రామకృష్ణ పరమహంస

* కూడు పెట్టకపోతేమానె, కుక్కను కట్టివేయమన్నాడట.

—సామెత

* గడ్డిపరకకంటె దూదిపింజ తేలిక; దూదికంటె యాచకుడు తేలిక; అట్టి యాచకుని గాలి ఎగుర వేసుకుని పోదేమి? ఎందు కనగా అతడు తనను పట్టుకొని యాచనతో పీడించునేమోనని!

—ఒక సంస్కృత కవి

* దాసరిపాట ముష్టిపెట్టేవరకే. —సామెత

* యాచకుని సంచికి అడుగుండదు. —ఆంగ్లసామెత

* ఉన్నవాడు అడుక్కుంటే అప్పు
లేనివాడు అడుక్కుంటే ముష్టి. —సినీ సూక్తి

## యుద్ధము

* శాంతికాలంలో కొడుకులు తండ్రులకు అంత్యక్రియలు చేస్తే యుద్ధకాలంలో తండ్రులు కొడుకులకు అంత్యక్రియలు చేస్తాడు.
— కేనస్

* యుద్ధం దొంగలను సృష్టిస్తుంది; శాంతి వాళ్ళను ఉరితీస్తుంది.
—ఆంగ్ల సామెత

* యుద్ధంలో ఆయుధాలు ముఖ్యమే అయినా అవే ఫలితాన్ని నిర్ణయించేవి కావు. ఫలితాన్ని నిర్ణయించేది మనుష్యులే గాని ఆయుధ సంపత్తికాదు. —మావ్-సే-టుంగ్

* మాతృత్వం స్త్రీలకు ఎట్టిదో, యుద్ధం పురుషుల కట్టిది.
— బెనిటో ముస్సోలినీ

* బలము మోసము అనేవి యుద్ధంలో ఉండవలసిన రెండు సుగుణాలు.
—థామస్ హాబ్స్
(Force and fraud are in war two cardinal virtues)

## రచయిత

* రచయిత మేధావిలా ఆలోచించాలి. కాని మామూలు మనిషికి అర్థమయ్యేంత సులువుగా రాయాలి. —అరిస్టాటిల్

* లార్డ్ మెకాలే ఒక వాక్యం వ్రాయడానికి ఇరవై పుస్తకాలు చదివేవాడు; ఒక వర్ణన చేయడానికి వందమైళ్ళు ప్రయాణించేవాడు. —ఠాకరే

## రహస్యము

* చెపితే సిగ్గు దాస్తే దుఃఖం.
* లోగుట్టు పెరుమాళ్ళ కెరుక.
* చల్లకువచ్చి ముంత దాచనేల ? —సామెతలు

## రాజకీయవేత్తలు

* శిక్షలేని తప్పు చేయగలవాడు 'రాజకీయవేత్త'. —ఉమాపతి పద్మనాభశర్మ

* సినీనటులు మొహానికి రంగు పూసుకుని అవసరమున్నపుడు మాత్రమే నటిస్తారు. కాని రాజకీయ నాయకులు ఎల్లవేళలా నటిస్తారు. —కోన ప్రభాకరరావు

* ప్రపంచమంతటా రాజకీయవేత్తలు ఒకలాగానే ఉన్నారు. వారు నది గూడ లేనిచోట వంతెన కట్టిస్తామని వాగ్దానం చేస్తుంటారు. —నికెటా కృశ్చేవ్

* రాజకీయవేత్త: ఉపన్యాసాలు పెరవారికి, ఉపకారాలు తనవారికి చేసేవాడు. —యస్వీ జోగారావు

* నేను రాజకీయాలలో తిరిగేవాణ్ణికాను; నా యితర అలవాట్లు గూడ మంచివే. —ఆర్టిమస్ వార్డ్

* దొంగలు, కొండెముల్ పలుకు దుష్టు, లబద్ధము లాడువారు, దుస్సంగులు, భోగలాలసులు, స్వార్థపరుల్ పదవీ విమోహితుల్, రంగులు మార్చువారు, ప్రజలన్ పరిమార్చెడి వారు, దబ్బు కర్థాంగులు నేటి నాయకులు. —దాశరథి

* ఒపీనియన్స్ అప్పుడప్పుడు ఛేంజ్ చేస్తుంటేగాని పొలిటీషియన్ కానేరడు. —'కన్యాశుల్కం'లో గిరీశం

* పక్కమీద పరున్న రోగి ఎంత తరచుగా అటునిటు ఒత్తిగిలుతాడో అంతకంటె తరచుగా పక్షములు మార్చేవాడు రాజకీయవాది.[1] —చార్లెస్ లాంబ్

---

1 A politician is one who changes his sides more often than a sickman changes in his bed.

—Charles Lamb

* తొండముదిరి ఊసరవెల్లి అయినట్లే, రౌడీ ముదిరి రాజకీయ నాయకు డవుతాడు. —"ప్రతిఘటన" సినిమానుండి

* రాజకీయవేత్త ఒక పని చేస్తానని అంటే, ఆయన చేస్తే చేయ వచ్చు, లేకపోతే చేయకపోనూవచ్చు. ఆయన చూస్తానని అంటే, ఇక ఆ పని సంగతి ఇంతే సంగతులు. ఒక పనిని తాను చేయలేనని రాజకీయవేత్త అంటే అయన రాజకీయవేత్త కాడు.

—ఒక పాశ్చాత్య భావుకుడు

**రాజకీయపార్టీలు**

* పార్టీ వివాదాలు ఎలాంటివంటే, గెలుపే ఏకైక లక్ష్యంగా పోరాడడం జరుగుతుంది.

—జార్జి వాషింగ్‌టన్

**రాజకీయాలు**

* రాజకీయాలంటే రక్తపాతంలేని యుద్ధం, యుద్ధమంటే రక్త పాతంతో గూడిన రాజకీయాలు. —మావ్-సే-టుంగ్

* రాజకీయాలు ఆదర్శాలకూ వాస్తవికతకూ మేళవింపు.

—సూక్తి

* రాజకీయాలలో హత్యలుండవు; ఎప్పుడూ ఆత్మహత్యలే.

—జలగం వెంగళరావు

* రాజకీయం అనేది గొప్ప కళ. పేదలనుంచి ఓట్లు, సంపన్నుల నుండి నోట్లు తీసుకుని ఒకరినుంచి మరొకరిని రక్షిస్తామని చెప్పడమే రాజకీయం. —ఆస్కార్ అమెరింగల్

* కల్లి బొల్లి నుడులు
కాకాలు బాకాలు
రాజకీయములకు
పూల సామగ్రిరా. —మల్లెమాల సుందరరామిరెడ్డి

* లోకంకోసం ఏడిస్తే అది కవిత్వం. తనకోసం ఏడిస్తే అది స్వార్థం. తనకోసం, లోకంకోసం ఏడిస్తే అది ధర్మం. రెండింటి కోసం ఏడ్చినట్లు నటిస్తే అది రాజకీయం.
—జి. వి. కృష్ణారావు

* పాలిటిక్సును 'పాలిట్రిక్కు' అనడం నయం.
—మన్నవ గిరిధరరావు

* కష్టంపై గంగానది
కాలుష్యం కడుగవచ్చు
ఎండమావు లందు నీళ్ళు
ఎట్లాగో తాగవచ్చు
రాజనీతిలో నీతిని
లవలేశం చూడలేము. —గజ్జల మల్లారెడ్డి

## రాజనీతిజ్ఞుడు (Statesman)

* ఒక జాతిని అది వున్న స్థితినుండి అది ఉండవలసిన స్థితికి మార్చగలవాడే నిజమైన రాజనీతిజ్ఞుడు.

—డబ్ల్యు.ఆర్. ఆల్జర్

## రాజు

* చేత గొడుగునుంచుకొనిన వానచినుకు లేమియు చేయలేవు.అట్లే దేశప్రజల అనురాగమును చూరగొన్న పాలకులను ఎందరు శత్రువు లెత్తివచ్చినను ఏమియు చేయజాలరు.

—భోజచరిత్ర

* ఒక గొంగళిలో పదిమంది ఇమడగలరు గాని ఒక రాజ్యంలో ఇద్దరు రాజు లుండలేరు. —పర్షియన్ సామెత

* రాజుల్ మత్తులు వారిసేవ నరకప్రాయంబు.

—భాగవతం

* రాజులు చారచక్షువులు. (రాజులు చారులే చక్షువులుగా గలవారు) —లోకోక్తి

* ఆకాశముల యెత్తును, భూమి లోతును
రాజుల అభిప్రాయములును అగోచరములు.

—బైబిలు - సామెతలు 25-4

* రాజుకంటె మొండివాడు బలవంతుడు. —సామెత

* రాజ ర్గాతురుడైనచో నెచట ధర్మంబుండు ? —ధూర్జటి

* పూలదండల నమ్ముకొని బతికేవాడు తోటలోని పువ్వులను మాత్రమే కోసుకొని తోటను ఎలా కాపాడుతున్నాడో, రాజు అలాగ ప్రజలనుంచి కొద్దిగా తీసుకోవాలిగాని బొగ్గులమ్ముకునే వాడిలాగ మొదళ్ళ నరికి తగులబెట్టకూడదు.

—పరాశరస్మృతి

* రాజు ముఖ్యంగా సింహాన్నీ నక్కనూ అనుకరించాలి. ఆ రెండింటి లక్షణాలను అలవరచుకోవాలి. ఎందుకంటే సింహం పరులు పన్నే వలలనుండి తప్పించుకోలేదు. నక్క తోడేళ్ళ బారినుండి కాపాడుకోలేదు. రాజయినవాడు వలల నుండి తప్పించుకోవడంలో నక్కవలెను, తోడేళ్ళను హతమార్చడంలో సింహంగాను మెలగాలి. —మెకియవెల్లి

* ఏ రాజుమీద ప్రజలు ప్రేమ కలిగివుంటారో ఆ రాజును క్షోభ పెట్టడానికి వెనుదీయరు. కాని ఏ రాజు మీద జనులకు భయం వుంటుందో ఆ రాజును ఇబ్బంది పెట్టడానికి జనం జంకుతారు. రాజు ప్రజలచే ప్రేమించబడడం కంటె అతన్నిజూచి వారు భయపడడమే అవసరం. ఐతే, రాజు వారిచే ద్వేషించబడకూడదు. —మెకియవెల్లి

* తెలివి గల రాజు వాగ్దానాలను నిలబెట్టుకోడు- ముఖ్యంగా వాగ్దానాలు చేయడానికి దారితీసిన కారణాలు అంతరించి నప్పుడు. —మెకియవెల్లి

## రాత్రి

* రాత్రి ఆలోచనల తల్లి. — యంగ్

## రాయబారి

* తన దేశ శ్రేయస్సుకోసం విదేశాలలో అబద్ధాలాడడానికి పంపబడే పెద్దమనిషే రాయబారి.[1] —హెన్రీ వోల్టన్

## రేడియో

* రేడియో అనేది పత్రికల పాలిట ఇటీవల పుట్టిన దుడుకు సవతి. కనబడి వినబడే నాటకం యొక్క వినబడే సగం చెక్కనీ రేడియో స్వాధీన పరచుకుంది. రాబోయే టెలివిజన్ ఆ తక్కిన కనబడే సగం చెక్కనీ దఖలుపరచుకోబోతోంది.

—భమిడిపాటి కామేశ్వరరావు

---

1. An ambassador is an honest man sent to lie abroad for good of his country.

—Henry Wolton

## రోగము

* చాల ప్రాథమిక రోగాలు శరీరం తనకు తానే చేసుకొనే వైద్యమే. మామూలు జ్వరమూ, జలుబూ, కురుపులూ వంటివి శరీరం తనకు తానే చేసుకొనే వైద్యమే.

—కొడవటిగంటి కుటుంబరావు

* శారీరకమైన అనారోగ్యము ఔషధమువలన శమించును. మానసికమైన అనారోగ్యము పెద్దలను సేవించుట వలన ఉపశమించును. —ఎక్కిరాల కృష్ణమాచార్య

## లంచం

* ప్రతి తాళమూ బంగారపు చెవికి తెరచుకుంటుంది.

-ఆంగ్లసామెత

* ఇరుసున కందెన పెట్టక
వరమేశ్వరు బండియైన పారదు సుమతీ. —సుమతీశతకం

## లేఖలు

* స్నేహానికి జీవం ప్రేమ; ప్రేమకు జీవం లేఖలు.[1]

—ఆంగ్ల సామెత

---

1. Love is the life of friendship and letters are the life of love. —Proverb

## లేదు

* కృషివలన దుర్భిక్షముండదు; జపమువలన పాతకముండదు. మౌనమువలన కలహముండదు, జాగరూకతవలన భయముండదు. —సంస్కృతసూక్తి

## లొంగుబాటు

* దుష్టులు భయానికి లొంగుతారు;
* సజ్జనులు ప్రేమకు లొంగుతారు.

—అరిస్టాటిల్

## లోకువ

* కదవంత గుమ్మడికాయ కత్తిపీటకు లోకువ.
* అడిగేవాడికి చెప్పేవాడు లోకువ. —సామెతలు

## లోపములు

* ఎంచబోతే మంచమంతా కంతలే.
* గురువిందగింజ తనక్రింద నలుపెరుగదు.
* సూదికోసం సోదికెళితే పాతరంకులన్నీ బయటపడ్డాయట.
* అన్నీవున్నాయిగాని ఐదవతనంలేదు.
* గొంగట్లో అన్నంతింటూ వెంట్రుకలు ఏరినట్లు.

—తెలుగు సామెతలు

* అన్నిటికంటె ప్రకాశవంతమైన సూర్యుడిలో మచ్చలున్నాయి.[1]

—ఆంగ్లసామెత

## లోభి

* ఏరు నిండుగా పారుచున్నను కుక్క ఏవిధముగా తన స్వభావ మును మానక గతుకు తోనే తృప్తిపడునో, అట్లే లుబ్ధుడుగూడ ధనమున్నపుడుగాని లేనపుడుగాని కడుపునిండా తినలేడు. అంతేగాక ఈ దేహమే శాశ్వతమని నమ్ముతాడు.

—భాస్కరశతకము

* లోభివానిజంప లోకంబు లోపల
మందు వలదు వేరు మతము గలదు
పైక మడిగినంత భగ్గున పడిచచ్చు. —వేమన

* వెల తక్కువని గుడ్డిగుఱ్ఱాన్ని కొంటే వారానికి రెండుసార్లు బండి మరమ్మతు. —సామెత

* ఏ ఆకైనా రాలుతుంది గాని ఈతాకు రాలదు. —సామెత
(అన్ని చెట్ల ఆకులూ ఆకురాలు కాలంలో రాలుతాయి. కాని ఈతాకు చెట్టునే వుండిపోతుంది. అలాగే పిసినిగొట్టు డబ్బు రాల్చడు.)

---

1. Sun, the brightest of all things has its spots.

* మేక కుతిక బట్టి మెదచన్ను కుడువగా
పండ్ల రాలతన్ను పాలనీదు
లోభివాని నడుగ లాభంబు లేదయా. —వేమన

* లోభి ధనికుడయ్యు భోగనిరహముచే దరిద్రునితో సమానుడే. అయినను లోభికి ధనార్జన, రక్షణ, హానులందు దుఃఖమొక విశేషము. —నీతిచంద్రిక

* లోభి వర్షము కురియని వేసవిమేఘము వంటివాడు.
—అరబ్బీ సామెత

## వర్తమానము

* వర్తమానం గతము యొక్క ఫలము, భవిష్యత్తు యొక్క విత్తనము. —వినోబాభావే

## వర్షం

* అశ్విని కురిస్తే అంతా నష్టం.

* ఆరుద్ర కురిస్తే దారిద్ర్యం లేదు.

* తొలకరివాన మొలకల తల్లి.

అనూరాధ కురిస్తే మనోరోగాలు పోతాయి.

చిత్త స్వాతులు కురవకపోతే చిగురుటాకులు మాడిపోతాయి.

* చిత్త చిత్తగించి, స్వాతి చల్లబడి, విశాఖ విసరకుంటే పీసానికి పుట్టెడు పండుతానన్నదట.

—సామెతలు

## విగ్రహారాధన

* మనుష్యుడు తాను రూపం లేనివాడనని తెలుసుకోనంత వరకు రూపరహితంగా భగవంతుని ఆరాధించగలగడం కల్ల.

—రమణ మహర్షి

* ధర్మాత్ముడు మానవుని హృదయ బంధువు
కరుణాత్ముడు, ఈశ్వరుని ఆత్మబంధువు

—ఖలీల్ జిబ్రాన్

## విజయము

* A అనునది విజయానికి సంకేతం అయితే, అందుకు సూత్రం ఏమంటే, A=X+Y+Z. ఇందుకు X అనగా పని, Y అనగా ఆటలు, Z అనగా నోరు తెరువకుండుట.

—ఆల్‌బర్ట్ ఐన్‌స్టీన్

* విజయం పొందటానికి ఒకే ఒక రహస్యమేమిటంటే - వివిధ విషయాలను నీయొక్క దృక్కోణంనుండి మాత్రమేగాక ఎదుటి వారి దృష్టికోణంనుండి గూడ పరిశీలించే సామర్థ్యాన్ని పెంపొందించుకోవాలి. అందులోనే విజయ రహస్యం ఇమిడివుంది.

—హెన్రీఫోర్డు

* నిన్ను నీవు పూర్తిగా మరచిపోయి పనిచేస్తే నీవు విజయం పొందడం నిశ్చయం. —స్వామిరామతీర్థ

* చేయవలసిన కార్యమును వివరంగా విశదపరచుకో. విజయం దాని వెన్నంటి వస్తుంది.[1] —నెపోలియన్

## విజ్ఞానం

* విజ్ఞానం కొంతకాలానికి ఉపయోగపడే పడవ మాత్రమే. తలపై మోయలేని బరువు కాదు. —బుద్ధుడు

## విద్య

* తెలిసినదానితో ఆరంభించి తెలియనిది క్రమక్రమంగా నేర్పుతూ పొమ్మని విద్య నేర్పుటములో ప్రధాన సూత్రము

—గాడిచర్ల హరిసర్వోత్తమరావు

* ఒక యేడాది ముందుకు ఆలోచించగలిగితే ఒక విత్తనమునాటు, పదేండ్లు ముందుకు ఆలోచించగలిగితే ఒక చెట్టు నాటు, వందేండ్లు ముందుకు ఆలోచించగలిగితే ప్రజలను విద్యావంతుల నొనర్చు. — చైనాతత్వవేత్త Kaun-Izu

---

[1] Be clear, the rest will follow. —Napoleon

* మతబోధ లేకుండా విద్య గరపితే, నీవు వారిని తెలివిగల దయ్యాలుగా మాత్రమే తయారు చేస్తావు.[1]

—డ్యూక్ ఆఫ్ వెల్లింగ్టన్

* అగ్నిఁగాలదు రాజుల కలవిగాదు
నీళ్ళనానదు చోరులపాలుగాదు
సోదరులచేత నెప్డుఁ బంచుకొనరాక
చెలఁగు విద్యాధనమునకుఁ జేటులేదు.

—దూబగుంట నారాయణకవి

* వచ్చేంతవరకు వల్లించు, చచ్చేంతవరకు చదువు.

—తెలుగు సామెత

* ఉపాధ్యాయుడు ఇస్తాడు; విద్యార్థి స్వీకరిస్తాడు. ఇవ్వడానికంటూ అతనివద్ద కొంత ఉండాలి ; స్వీకరించడానికి ఇతడు సిద్ధంగా ఉండాలి. —స్వామి వివేకానంద

* విద్య కామధేనువువలె కాలముకాని కాలమందున ఫలమొసంగును. పరిచయములేని పరదేశమందును తల్లివలె పోషించును ; నిల్వజేసిన ధనమువలె సమయమందు సహాయమొనర్చును.

—చాణక్యుడు

---

1 Educate men without religion, but you make them clever devils —Duke of Wellingdon

* విద్యను చోరులు తస్కరింపలేరు, రాజులపహరింపలేరు, సోదరులు పంచుకొనలేరు, మరియు నిది భారమైనది కాదు. వినియోగము వలన వృద్ధియగుట దీని విశేషము. కనుక విద్యాధనము సర్వధనములందు ప్రధానమైనది.[1] —సంస్కృత సూక్తి

* ఏ మార్గంలో నడవాలో బిడ్డకు శిక్షణ యివ్వండి ; అతడు పెద్దవాడైనపుడు ఆ మార్గమును తప్పడు.

—బైబిలు-సామెతలు : 22-6

* ఆస్థాన కవియొక్క కుమారుడికైనా విద్యాభ్యాసం అక్షరాలతోనే ఆరంభించాలి. —ఆంగ్లసామెత

* జరయు మృతియు లేని జనుసట్లు ప్రాజ్ఞుండు
ధనము విద్యగూర్ప దలప వలయు. —ఆర్యోక్తి

* విద్య అనేది అక్షరాభ్యాసంతోనే ప్రారంభం కాదు. అది తల్లి యొక్క మధురవీక్షణతో, తండ్రి యొక్క ఆమోదముద్రతో, చెల్లెలి మెత్తని చేసైగలతో ; సోదరుని అభిమాన వాక్కులతో మొదలవుతుంది. —అజ్ఞాత ఆంగ్లకవి

---

1 నచోరహర్యం నచ రాజహార్యం
నభ్రాతృభాజం నచ భారకాం
వ్యయేకృతే వర్థస ఏవనిత్యం
విద్యాధనం సర్వ ధన ప్రధానమ్.

* హాను స్పర్ధలు విద్యలందే. —గురజాడ అప్పారావు

* శబ్దాలకు అర్థాలను వివరించడమే విద్యాబోధనయొక్క లక్ష్యం కాదు. మనస్సుయొక్క తలుపులు తెరిపించడమే దాని ప్రయోజనం.[1] —రవీంద్రనాథ టాగోర్

* జీవితాన్ని తెలియజేయలేని చదువు స్మశానంలో నక్కల అరుపులాంటిది. —పూర్వకవి

* "విజ్ఞానము ఒక శక్తి" అని బేకన్ చెప్పాడు. కాని కేవలం జ్ఞానము శక్తి కాజాలదు. అది ఒక మంచి అవకాశముమాత్రమే. క్రియాశీలతయే శక్తి. అది జ్ఞానమువల్ల నడిపింపబడినపుడు దాని అత్యున్నత ప్రకటనము కనిపించును.[2]

—టి డబ్ల్యు. పామర్

---

1 The main object of teaching was not to explain meanings but to knock at the door of the mind.

—Ravindranath Tagore

2 "Knowledge" says Bacon, "is power" ; but mere knowledge is not power ; it is only possibility. Actiou is power and its highest manifestation is when it is directed by knowledge.

—T. W. Plamer

* శీలరహితమైన విజ్ఞానము అపకారం కలిగించే శక్తి మాత్రమే. చాలమంది నిపుణతగల దొంగల విషయంలోనూ పెద్దమనుషులుగా చెలామణి అయ్యే దుష్టుల విషయంలోనూ ఇది వెల్లడవుతుంది.
—మహాత్మాగాంధీ

* దేవుని రాజ్యమైన స్వర్గంలో మనుష్యుడు ప్రవేశించవలెనంటే అతడు మొట్టమొదట అమాయకమైన పసిపాపిగా మారవలెననుట ఎంత సత్యమో, మానవరాజ్యమైన విజ్ఞాన పరిధిలో ప్రవేశించుటకు గూడ అతడట్లు మారవలెననుట అంతే సత్యము.
—బేకన్

* విద్యయొక్క లక్ష్యం కార్యశీలతయేగాని పరిజ్ఞాన సేకరణ కాదు.
—హక్స్లీ

* అతణ్ణి విద్యావంతుని చేయాలి, ఎందుకంటే - అతడు చెప్పులు, సీలలు, సూదులు తయారుచేయాలి గనుక కాదు - అతడు మనుష్యుడు గనుక.
—చాన్నింగ్

* తానేమి చేయవలెనో, ఎట్లు చేయవలెనో, తనకు నితరులకు సంబంధమేమో తెలుపునది విద్య. ఇది పానీయము వంటిది.

లోకములోని బహు విధానములను, శాస్త్రములను, మార్గములను, అరుదైన విషయములను వింతలను తెలుపునది పాండిత్యము. ఇది పరిమళము వంటిది.

బహు భాషలలోని పుస్తకములను పఠించుట యెట్లో తెలుపునది అక్షరాస్యత. ఇది నింపవలసిన పాత్రవంటిది.

విద్యవలన - వర్ధించిన విస్తరి ఎగిరిపడక నణగియున్నట్లు — పాండిత్యము, అక్షరాస్యత, అణగియుండును. విద్యలేని పాండిత్యము తినివిడిచిన ఎంగిలి అన్నమువలె ఇతరుల కుపయోగింపనిది. —ఎక్కిరాల కృష్ణమాచార్య

* మానవులకు విద్యయే సౌందర్యము ; అదియే గుప్తధనము. చదువే కీర్తిని, సుఖమును, భోగమును కలిగించును. విద్యయే గురువు, విద్యయే దైవము. విదేశములకు పోయినపుడు విద్యయే బంధువు. అది రాజసభలలో పూజార్హత నొందించును. ఇట్టి విద్యలేని నరుడు వింతపశువు మాత్రమే.

—భర్తృహరి

* చాలమంది విద్య కావాలనుకోవడం విద్యకోసం కాదు. విద్య వల్ల లభించే ఆధిక్యతకోసం.[1] —సిడ్నిస్మిత్

* ఒక్కొక్క నీటిబొట్టే పడుచున్నచో క్రమముగా కుండనిండును. అట్లే విద్య, ధనము, ధర్మముగూడ క్షణక్షణము కణకణము చొప్పున సాధించుకొనవలెను. —హితోపదేశము

---

[1] Most men want knowledge not for itself, but for the superiority which knowledge confers.

—Sidney Smith

* విద్య అనునది ఒక మంచి చెలికాడు. దానిని ఎట్టి దురదృష్టము అణచజాలదు; ఎట్టి నేరము నాశనము చేయజాలదు. ఏ శత్రువు దూరము చేయజాలదు ; ఏ నిరంకుశత్వము బానిసగా మార్చ జాలదు.[1] —వర్లే

* అభ్యాసమువంటి విద్యయు, అనుభవమువంటి గురువును లేరు. —సామెత

'విద్' అను మాటకు 'యా' చేర్చిన విద్యా అనే పదము ఏర్పడును. విద్ అనగా వెలుగు. యా అనగా ఏది. ఏది వెలుగును ప్రకాశమును అందించునో అది విద్యగాని అజ్ఞానమును అంధకారమును అందించేది విద్యకాదు. —సత్యసాయిబాబా

బోధన బడితో ఆఖరు; విద్యార్జన జీవితంలోనే ఆఖరు.[2] —పి.ఇ. రాబర్ట్‌సన్

---

1 Education is a companion which no misfortune can depress: no crime destroy: no enemy alienate no despotism enslave. —Varle

2 Instruction ends in the school, but education ends only with life. —P.E Robertson

* మనుష్యునికి తెలుసుకోవాలనే జిజ్ఞాస సహజంగా ఉన్నది. అందు నగం కుతూహలంకొరకు, మిగతాది ప్రదర్శనకొరకు.

—ఎస్. బట్లర్

* విద్యయొసగును వినయంబు, వినయమునను
బడయుపాత్రత, పాత్రతవలన ధనము
ధనము వలనను ధర్మంబు, దానివలన
నైహికాముష్మిక సుఖము లందు నరుడు.

—భర్తృహరి నీతిశతకము

* చదువుకొనకపోవుటకంటె అసలు జన్మించకపోవడం మంచిది. ఎందుకంటే దురదృష్టానికి మూలహేతువు అజ్ఞానం.[1]

—ప్లేటో

* స్పర్థయా వర్ధతే విద్యా
(పోటీవలన విద్య వర్థిల్లును) —సూక్తి

* భారతదేశపు విద్యలో అధికభాగం అభివృద్ధికి వ్యతిరేకమైనది. నీవు నీ చేతులు మట్టిచేసుకోవద్దు అనే మనస్తత్వాన్ని అది పెంచుతూ వుంటుంది. రష్యా, స్వీడన్, అమెరికాలలోని ఇంజ

1. It is better to be unborn than untaught, for ignorance is the root of misfortune. —Plato

నీర్లు బల్లలముందు కూర్చొని చేసే ఉద్యోగాలు మాత్రమే చేయ గోరి, యంత్రముల నడుమకు వెళ్ళి పనిచేయ నిరాకరించి నట్లయితే ఆ దేశము ఈనాడున్న స్థితికి వచ్చేదికాదు.

—ప్రొ॥ గున్నర్ మిర్డాల్

* ఇమ్ముగ చదువని నోరును ....
కుమ్మరి మనుత్రవ్వనట్టి గుంటర సుమతీ.

—సుమతీశతకము

* "లోకజ్ఞాన రహితమైన విజ్ఞానం తప్పు మార్గం పట్టిస్తుంది; సహృదయత లేనిచో అది మూర్ఖత్వానికి దారితీస్తుంది; మత విశ్వాసం లేని విజ్ఞానం మరణంతో సమానం" అని లీ అను నతడు అన్నాడు.

దీన్ని మరొకరీతిలో చెపితే, లోకజ్ఞాన సహితమైన విజ్ఞానం వివేకాన్ని, క్రమ విధానంతో గూడినచో శక్తిని, కారుణ్య దృష్టితో గూడినచో ఉదాత్త జీవనమును, మతముతో గూడినచో శీలము శాంతి సుభిక్షములను కలిగిస్తుంది.[1] —ఫారర్

---

1. **"Kgowledge, without common sense" says Lee, "is folly; without kindness, it is fanaticism, without religion it is death".**

**But with common sense, it is wisdom: with method it is power; with charity it is beneficience, with religion it is virtue and life and peace**

**—Farrer**

* సంశయములనెల్ల తొలగించునది, చూడని విషయముల నెన్నిటినో స్పష్టముగ తెలుపునది, లోకమునకంతకును లోచనమువంటిది యగునది శాస్త్రజ్ఞానము. అట్టిది లేనివాడు నిజముగా గ్రుడ్డివాడే. —హితోపదేశము

* సజీవులు నిర్జీవులు కంటె ఎంత అధికులో, విద్యావంతులు నిరక్షరాశ్యులకంటె అంత అధికులు[1] —అరిస్టాటిల్

* సంపదవలె విద్యగూడ దేనికొరకు వినియోగించుట కుద్దేశింపబడునో దానినిబట్టి కీడు గాని మేలుగాని కలిగించును.

—జోసెఫ్ మాజినీ

* మంచి విద్య కంటె ధనములేదు; అపకీర్తికంటె చావులేదు.

—సంస్కృత సూక్తి

* విద్యార్థి యగువాడు కామమును జయింపవలెను; నాల్కతీపి మరువవలెను; తనకొక అక్షర ముపదేశించినను అట్టివానిని గురువుగా, దేవతాసమునిగా పూజింపవలెను.

—మహామంత్రి చాణక్యుడు

---

1. Educated man are as much superior to uneducated men as the living to the dead.

—Arsstotle

* సుఖము కోరువాడు విద్యను వదలు కొనవలసిందే; విద్యనే కోరువాడు సుఖమును త్యజించవలసినదే. సుఖార్థులకు విద్య యెక్కడ, విద్యార్థులకు సుఖమెక్కడ? —పూర్వకవి

* అందుకని, విద్యయొసగును అనే పద్యాన్ని "విద్య యొసగునవి నయం బవినయమునను బడయు పాత్రత" అది దిద్దివెయ్యడమే బ్రతుకుతెరువంటాను. అనగా, ఈ విద్యవల్ల అవినయమున్నూ (అభినయమున్నూ అని పాఠాంతరం), దానివల్ల చేతికి పాత్రయూ వస్తాయని అన్వయించుకోవాలి.

—భమిడిపాటి కామేశ్వరరావు

* విద్య జీవితానికి.,జీవనానికికాదు.

(**Education is for life and not for living**)

—శ్రీ సత్యసాయిబాబా

* సరస్వతీదేవి సాక్షాత్కారం తపస్వికి లభిస్తుంది కాని విలాసినికి కాదు. —వస్తాద్ బడే గులాం అలీఖాన్

* పుర్రెకెక్కని చదువులు వల్లెవేసేవాడు
పుస్తకాలను మోసే గాడిదకు సైతోడు.

—ఖలీల్ జిబ్రాన్ (అనువాదం : సి.నా.రె.)

* దొరలు దోచలేరు, దొంగలెత్తుకుపోరు
భ్రాతృజనము వచ్చి పంచుకోరు
విశ్వవర్ధనంబు విద్యాధనంబుగా. —కరుణశ్రీ

* విద్యలో రాజకీయాలు ఎక్కువైనాయి; రాజకీయాలలో విద్య తగ్గిపోయింది. —డా॥ వి.వి. జాన్

* విద్యాలయాలలో నేర్చుకున్నది యావత్తూ మరచిపోయిన పిదప ఒక వ్యక్తిలో ఏదైతే మిగిలిఉంటుందో అదే విద్య[1].
—ఆల్బర్ట్ ఐన్‌స్టీన్

* స్వభావ సిద్ధంగా మానవుడు ఒక జంతువు. పరిసరాల వలన విద్య వలన అతడు మనుష్యుడవుతాడు, —ప్రొ॥ లాండిస్

* విద్య లేకుంటేను విభవమ్ము రోత
వినయమ్ము లేకుంటె విద్యలూ రోత. —జానపదవాణి

* శీలసంపదను పెంపొందించలేని విద్య పరిమళములేని పువ్వు లాంటిది. అట్టి విద్య నిరర్థకం, అనర్థకం.
—మహాత్మాగాంధీ

---

1. Education is that which remains when one has forgotten everything he has learnt at school or in the university.

### విద్యాబోధన

* నియమాల వలన నేర్చుకొనే మార్గం సుదీర్ఘమవుతుంది; ఉదాహరణలవల్ల అది అందిపుచ్చుకున్నట్లుంటుంది.[1]

### విద్యార్థి

* విద్యార్థులు విషయార్థులు కారాదు.

—శ్రీ సత్యసాయిబాబా

* మంచి విద్యార్థికి చెడ్డ విద్యార్థికి తేడా ఏమిటంటే, మంచివిద్యార్థి చదివినదాన్ని పరీక్షల అనంతరం మరచిపోతాడు; చెడ్డవిద్యార్థి పరీక్షలముందే మరచిపోతాడు.

–డా॥ వి. వి. జాన్

### విద్యాలయం

* ప్రతి యిల్లూ ఒక విశ్వవిద్యాలయం; తల్లిదండ్రులు దానిలో ఉపాధ్యాయులు. —మహాత్మాగాంధీ

### విపరీతం

* ఊరుకంటె స్మశానం పెరిగినట్లు. —సామెత

---

1. Rules make the learner's path long; examples make it short and successful. –Seneca

## విప్లవము

* విఫలమైన అన్ని తిరుగుబాట్లూ విద్రోహచర్యలవుతాయి; సఫలమైన తిరుగుబాట్లు విప్లవాలవుతాయి.[1]

—ఇంద్రమల్ హోత్రా

## వినోదము

* ఆలోచించలేనివానికి ఆనందం చేకూర్చేది వినోదం.

—అలెగ్జాండర్ పోప్

## విమర్శ

* విమర్శ సీకొక త్రాసువంటిది. కత్తిరించడం వలన పూల కుంచెలు మరింత శోభాయమానములైనట్లు విమర్శ వలన మనం ప్రకాశిస్తాం. —స్వామి రామతీర్థ

* పండ్లున్న చెట్లమీదనే రాళ్ళు విసరుతాడు.

—ఫ్రెంచి సామెత

* చీకటితో రణమొనర్చి చీకటిని పోగొట్టజాలవు. ఒక చీకటి గది లోకిపోయి అన్ని దిశలను రాళ్ళురువ్వి కిటికీలను పగులగొట్టి కుర్చీలు విరిచి బల్లలు తన్ని తిట్టినచో చీకటి తొలగునా? దీపము పెట్టుము; చీకటి పోవును.

—స్వామి రామతీర్థ

---

1. All unsuccssful revolts are acts of treason. All successful ones revolutions. —Inder Malhotra

* గాజు యిండ్లలో నివసించువారు పరులపై రాళ్ళు విసరకూడదు.

—ఆంగ్ల సామెత

## విమర్శకుడు

* అందరి హృదయముల దూరువాడు కవియైయుండ విమర్శకుడు కవి హృదయమున దూరువాడు.

—పానుగంటి లక్ష్మీనరసింహారావు

: విమర్శకుని మన యింటిలో కుటీరము వేయించి ఉంచుకొన వలెను. అతడు మనలను నీరు సబ్బు లేకుండానే శుభ్ర పరుస్తాడు. —కబీరు

విమర్శకుడవగా పరుగెత్తడం గురించి బోధించే కాళ్ళు లేని వ్యక్తి.[1] —చానింగ్ పోలక్

· విమర్శకుడు చేటవంటివాడు. తాలుగింజలనుండి శుభ్రమైన ధాన్యాన్ని విడదీస్తాడు. —మన్నవ గిరిధరరావు

---

1. A critic is a legless man who teaches running,

—Channing Pollock

## విలువ

* బఱ్ఱె చచ్చిన పిదప పాడి బయటపడుతుంది. —సామెత

* బావిలోని నీరు ఎండిపోయినప్పుడే వాటి విలువ తెలుస్తుంది.
—బెంజమిన్ ఫ్రాంక్లిన్

## వివాహము

* తెలియనపుడు మెడలో వేయించుకొని తెలిసిన తరువాత బాధపడడానికి గుర్తు మంగళసూత్రం.
—రావూరు సత్యనారాయణరావు

* అత్త ఆడబిడ్డ లేనిచోట మనువాడిన మగువదే మంచిపెళ్ళి.
—స్పెయిన్ సామెత

* వైవాహిక జీవితం ఒక వలలాంటిది. క్రొత్తవారు అందులో దూరాలని ఆరాటపడతారు. లోపలవారు బయటికి పోవాలని కోరుకుంటారు. —మాంటేగు

* పెళ్ళి స్త్రీకి ఒక సోషల్ సెక్యూరిటీ; ఒక సాంఘిక భద్రత నిస్తుంది. పూలసంకెళ్లలా కనిపించినా, నిజానికి పెళ్ళి పురుషుడి స్వాతంత్ర్యానికి యించుమించు ఇనుపసంకెళ్ల తగిలిస్తుంది.
—ఆధరాపురపు తేజోవతి

* వివాహం అనేది బుగ్గన పెట్టుకొనే 'చూయింగ్ గమ్' లాంటిది. మొదట్లో మధురంగా వుండి, తుదకు రుచీ పచీ లేని అంటుడు దినుసుగా మిగులుతుంది.[1]

డా॥ డి. భాస్కరరెడ్డి

* వివాహంలో వేరే నీతి ఏమీలేదు. అది నిన్ను అవినీతి నుండి రక్షిస్తుంది. —బాబూరావ్ పటేల్

* కూతురు పల్లకి ఎక్కితే తండ్రి కుక్కి మంచం ఎక్కాడు.

* తాళి గట్టింతర్వాత జోతె కట్టుకునైనా పోషించాలి.

* కళ్యాణం వచ్చినా కక్కు వచ్చినా ఆగదు.

—సామెతలు

* పడుగూ పేకా కలిస్తే బట్ట, ఆలు మగలు కలిస్తే ఇల్లు.

—సామెత

* వివాహమైన మిత్రుడు మిత్రుడు కాకుండాపోతాడు.[2]

—ఆంగ్లసామెత

---

1. **Marriage is like a chewing gum which is sweet in the beginning and sticky at the end.**

**—Dr. D. Bhaskara Reddy**

2 A friend married is a friend lost.

—English Proverb

* వివాహం కాని పురుషుడు అరసున్నాతో సమానం.

—జమ్ములమడక మాధవరామశర్మ

* తనకన్న గొప్పయింటి పిల్లను పెళ్ళి చేసుకోవడం తన స్వతంత్రాన్ని అమ్ముకోవడమే. — మెసెంజర్

## వివేకము

* హే భగవాన్ !

నేను మార్చలేని విషయాలను భరించుటకు వలయు నిబ్బరాన్ని యివ్వు

నేను మార్చగలిగిన వాటిని మార్చుటానికి కావలసిన సాహసాన్ని యివ్వు

ఈ రెండింటి నడుమ వ్యత్యాసాన్ని తెలుసుకొనే వివేకాన్ని యివ్వు. —డాక్టర్ రీన్ హోల్డ్ నీబుర్

* కర్మలో అకర్మను, అకర్మలో కర్మను గాంచగలవాడు వివేకవంతుడు.[1] — భగవద్గీత (4-18)

---

1 **He who sees inaction that is in action and the action that is in inaction is wise indeed.**

**—Bhagavad Gita**

* చెక్కతో చేసిన చెంచా ఆహార పదార్థంలోని మాధుర్యాన్ని గ్రహించనట్లే, వివేకం లేకపోతే విద్యావంతుడైనా జీవిత ప్రయోజనాన్ని అర్థం చేసుకోలేడు. —సంస్కృతసూక్తి

## వివేకానందుడు

* వివేకానందుని బోధనలు చదివినందువల్ల నాకు మాతృదేశంపై ప్రేమ వెయ్యింతలు పెరిగింది. —మహాత్మాగాంధీ

* వివేకానందుడు ఈ 20వ శతాబ్దపు పరిస్థితులకు అనుగుణంగా ఆలోచనా శక్తిని, ఆధ్యాత్మిక శక్తిని సమన్వయ పరచాడు. ఈ సంయోగం వల్లనే మనం ఇప్పటి సమస్యల నెదుర్కొన గలుగుచున్నాము. —యుధాంట్

## విశ్వాసం

* ప్రతి పండుకు ఒక పువ్వు కారణమైనట్లే, ప్రతి మంచి పనికి ఒక విశ్వాసం కారణమవుతుంది. —వేట్లి

## విశ్వనాథ సత్యనారాయణ

* విస్వనాథ విజయగాథ, అదో గొప్ప కావ్యం
అది నవ్యం, అది భవ్యం, అతని కవిత కడుదివ్యం
కాళిదాసు మరలపుట్టె కాబోలనిపించు నతడు
వాల్మీకియె మరల భువికి వచ్చినట్లు తోచు నతడు

జడుపు గిడుపు లేనివాడు తొడచరిచే మొనగాడు
చిన్నవారి నైనగాని మిన్నగ చూచేవాడు
అతనికతడె సాటి ! అతనికెవడు పోటి ?
వాణి వీణపాట పలికె నతని నోట ! —దాశరధి

## వృద్ధాప్యం

* శరీరము ముడుచుకొనిపోతుంది; పాదముల నడక తప్పుతుంది ; దంతము లూడుతవి ; కనుల ముందు చీకటులు కమ్ముతాయి ; చెవులు వినపడవు; నోట చొంగలు కారుతాయి ; జనులు మాట వినిపించుకొనరు ; భార్య దగ్గరకు రాదు ; పుత్రుడు శత్రువును చూచినట్లు దూరంగాపోతాడు; వృద్ధుని కష్టములిలా వుంటాయి.

—భర్తృహరి

* గత కాలమే బాగున్న దనిపించడం వృద్ధాప్యపు చిహ్నం.

—జి. కృష్ణ

## వేశ్య

* పులిపాలు తెచ్చి యిచ్చిన
నలవడగా గుండెకోసి యఱచే నిడినన్
దలపొడుగు ధనము పోసిన
వెలయాలికి గూర్మిలేదు వినరా సుమతీ.

* ఓ భోగందానా! నీవు సంఘానికి వేస్తుపేపరు బాస్కిటువా?

—వరాభి

* వీరు ధనము నిమిత్తము నవ్వుదురు; ఏడ్తురు. పురుషులను నమ్మింతురు; తాము వారిని నమ్మరు. కాబట్టి కులశీలములు గలవాడు వేశ్యలను వల్లకాటియందు పువ్వువలె విడువవలెను. "వేశ్యాశ్మశాన సుమన ఇవ వర్జనీయాః" —భర్తృహరి

## వైఫల్యం

* వేసింది ఒక గంతు, విరిగింది ఒక కాలు. —సామెత

## వైద్యుడు

* వైద్యుడయితే నోరెత్తి మాట్లాడనవసరం లేకుండానే మానవాళి కెంతో సేవచేయగల అవకాశం లభిస్తుంది.

—అల్బర్ట్ ష్వైజర్

* ప్రకృతి, కాలము, ఓర్పు అనేవి మూడూ ముగ్గురు వైద్యులు.

—ఆంగ్ల సామెత

* ఇరుగువారింట్లో గొల్లుమంటే వైద్యుడింట్లో గల్లుమన్నది.

* రోగాలు ఊరికే వచ్చాయని డాక్టర్లు ఊరికే వస్తారా ?

—సామెతలు

## వైరాగ్యం

* తలలు బోడులైన కలపులు బోడులా ? —వేమన

* పురాణ వైరాగ్యం; ప్రసూతి వైరాగ్యం; శ్మశాన వైరాగ్యం. —సామెత

## వైవిధ్యము

* ఇద్దరు వ్యక్తులు ఒకే మంచంపీద నిద్రించినా వారి కలలు వేరు వేరుగా ఉంటాయి. — చైనా సామెత

## వోటరు

* వోటరు : పోలింగ్ స్టేషనుకు కారులో వెళ్ళి కాళ్ళతో తిరిగి వచ్చేవాడు. —గోళ్ళమూడి గోపాలకృష్ణమూర్తి

## వ్యర్థము

* సముద్రమున కురిసిన వర్షము, ఆకలి తీరినవారికి భోజనము, ధనికున కిచ్చే దానము, దరిద్రుని యందలి యౌవనశోభ-ఇవి వృధాయగుచున్నవి. —హితోపదేశము

* ప్రేమములేని కామము, కవిత్వములేని పదాలు, 'శిక్షణా ధామము' లేని గ్రామము, 'విధానసభల్' కనరాని రాజ్యముల్ తామసియౌ గురుండును, మతాల కులాల చరించుజాతి, చింతామయమై నశించుగద. —దాశరథి

* ఆత్మశుద్ధిలేని యాచార మదియేల
భాండశుద్ధిలేని పాక మేల
చిత్తశుద్ధిలేని శివపూజ లేలరా. —వేమన

* వాసనలేని పువ్వు, బుధవర్గము లేని పురంబు, భక్తి వి
శ్వాసము లేని భార్య, గుణవంతుడుగాని కుమారుడున్, సద
భ్యాసము లేని విద్య, పరిహాసము లేని ప్రసంగవాక్యమున్,
గ్రాసములేని కొల్వు, కొఱగానివి పెమ్మయ సింగ ధీమణీ
—పూర్వకవి

* స్వారిచేయని గుఱ్ఱంబు, చదువ నట్టి
పుస్తకంబును, సేవింపబోని మందు,
ఆరగింపని వంటక, మనుభవింప
నట్టి ధనమును వ్యర్థంబు లనుట వినరె
—కాళ్ళకూరి నారాయణరావు

* బోడి తల అంట వేడుక, రానివారి పిలువ వేడుక.

* శివరాత్రి ఇంటికి ఏకాదశి భోజనానికి వెళ్ళిందట.

* శవమున కలంకారము లేల ?

* సానికిపెట్టినదబ్బు, గోడకువేసినవెల్ల.

* రాటానికి చెవులున్నాయి, వాడికి చెవులున్నాయి, ఎందుకు ?

* జల్లెడలో పాలుపితికినట్లు. —సామెతలు

## వ్యసనములు

* వ్యసనాలకు బానిసయై
వసిడిని కోల్పోవు నరుడు
పగటిపూట చంద్రునివలె
పాలిపోడె కళలు తరిగి

—హిందీకవి రహీం. (అను : మల్లిపెద్ది వెంకటరావు)

## శత్రువు

* శత్రువులనుజూచి భీతి చెందకు. గుర్తుంచుకో, గాలి పటము గాలి యొక్క వ్యతిరేకతవల్ల పైకిపోతుందేగాని అనుకూలతవల్ల గాదు.[1] —మాబీ

* పగవాడే నీకు పాఠాలు బాగా చెప్తాడు.

—మావ్-సే-టుంగ్

* బలవంతుడైన శత్రువునుజూచి భీతిచెందకు, బలహీనుడైన శత్రువును నిర్లక్ష్యం చేయకు. —అంగ్లసామెత

* అగ్ని శేషము, శత్రుశేషము, ఋణశేషము ఉంచరాదు.

—సామెత

---

[1] Do not be afraid of opposition. Remember a kite raises against, not with, the wind. —Mabie

* పగకలిగి బ్రతకడం పామున్న ఇంట్లో బ్రతకడం ఒకటే.

—సామెత

## శరీరం

* శరీరము క్షణభంగురము; గుణములు కల్పాంతస్థాయులు. ఇట్టి శరీరమును అపేక్షించి కీర్తిని పోగొట్టుకొనవచ్చునా ?

—నీతిచంద్రిక

* తనువు నశించి దుమ్మగుట తథ్యము, నీవు పసిండి ముద్దవా జనులొకసారి పూడ్చి మరుసారి నినుం బెకలించి యెత్తగన్.

—ఉమర్ ఖయాం

* బ్రహ్మ నా తండ్రి, మాయ నా తల్లి, వారి ఐక్యం వల్ల నాకీ దేహం ప్రాప్తించింది. —షిర్డీ సాయిబాబా

* ఈ శరీరం విసరివంటిది. దీనిపై రుచికరమైన పదార్థాలన్నీ పెట్టుకొని తింటాం. భోజనానంతరం విస్తరి జాగ్రత్త చేసుకుంటామా? దాని పని తీరగానే అవతల పారేస్తాం. శరీరమూ అంతే. —రమణమహర్షి

* ప్రతి జీవునకు మూడు శరీరములు కలవు. కండ్లకు కనిపించునది స్థూలశరీరము. ఆలోచనలు నడిపించునది సూక్ష్మశరీరము.

అనేక జన్మలనుండి వచ్చుచున్న సంస్కారములను కలిగి యున్నది కారణ శరీరము.

—బ్రహ్మచారి శ్రీ ప్రసన్న చైతన్య

* శరీరం సజీవ యంత్రం. అవకాశమిస్తే తన రోగాన్ని తాను నయం చేసుకుంటుంది. —డా॥ బి. వెంకట్రావు

## శాంతము

* దీర్ఘశాంతము చేత న్యాయాధిపతిని ఒప్పించవచ్చును. సాత్విక మైన నాలుక యెముకలను నలుగకొట్టును.

— బైబిలు-సామెతలు 25-15

## శిక్ష

* ఉరితీయుటద్వారా మనం సరిదిద్దేది నేరస్తునికాదు, మిగతావారిని.

—ఆంగ్లసూక్తి

## శాంతి

* శాంతి యనగా సోమరితనముకాదు; ఏకాగ్రత. అవిదిత వేద్యాంతరముగా ఏదేని ఒక వస్తువునందు చిత్తము నిలువగలుగుట. బహు భేదములచే భిన్నమగు ఈ ప్రపంచమునందు అభేదానుభవమును సంపాదించుట. ఇట్టి అవస్థ ఆనందమయము.

—రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ

## శీలము

* శీలంలేని మనిషి చిల్లులకుండ వంటివాడు.

—శ్రీ సత్యసాయిబాబా

* పొడుగు నడత బూను
ఇడుము గడచి పోను.

—పెద్దబాలశిక్ష

* శీలానికి అగ్నిపరీక్ష పెట్టేవి అందం, ధనం.

—ఉమాపతి పద్మనాభశర్మ

* సత్ప్రవర్తన మెపుడు తన్ను తానుద్ధరించుకొని సుఖపడుటకే గాని వేరొకటిగాదు. కత్తిని రాతిపై నూరుట కత్తిని పదును పెట్టుకోటానికేగాని రాతిని నునుపు జేయుటకు కాదు.

—ఎక్కిరాల కృష్ణమాచార్య

* లావుగల వాని కంటెను
భావింపగ నీతిపరుడు బలవంతుండౌ
గ్రావంబంత గజంబును
మావటి వాడెక్కినట్లు మహిలో సుమతీ.

—సుమతీశతకము

* ఒక కొండశిఖరం నుండి క్రిందికిదూకి శరీరమును తునాతునకలు చేసికొనుట మంచిది, విషదంష్ట్రములు గల సర్పము యొక్క

నోటిలో చెయ్యిపెట్టుట మేలు, లేదా అగ్నిలోకి ఉరుకుట మంచిది, కాని మానవుడు తన శీలమును విడచుట ఎన్నడును శ్రేయస్కరముకాదు. —భర్తృహరి

## శ్రమ

* నొప్పిలేకుండా చికిత్సలేదు, ముళ్ళు లేకుండా సింహాసనం లేదు. దూషణ లేకుండా కీర్తిలేదు, శిలువలేకుండా కిరీటం లేదు.[1]

—విలియం పెన్

* కొండ గుండెల నుండే సెలయేరు పుడుతుంది
హాలాహలం తర్వాతే అమృతం అందుతుంది.

—ఎస్. మునిరత్నం

* కాంతి కావలిస్తే, నిప్పు పట్టుకోవాలి.[2] —జ్వాలాలుద్దీన్ రుమీ

## సంకటస్థితి

* 'తాంబూలా లిచ్చివచ్చాను, తన్నుకుచావండి' అన్నట్లు.

—'కన్యాశుల్కం' నుండి సామెత

---

[1] No pain, no balm; no thorns, no throne; no gall, no glory; no cross, no crown. —William Penn

[2] One must take fire in order to get light.

—Jalaluddin Rumi

* తిట్టబోతే అక్కకూతురు, కొట్టబోతే గర్భిణి. —సామెత

* శివలింగంపై తేలు వున్నది;చెప్పుతో కొడదామంటే అపచారం, చేత్తో తీసివేద్దామంటే కుడుతుంది.

* నాయనను చూపు లేదా తద్దినం పెట్టు.
(గంగానదినద్ద పండాలు చెప్పేమాట) —మరాటీసామెత

* ఆకాశమంత ఆకలి, సూదిబెజ్జమంత గొంతుక. —సామెత

## సంకుచితత్వం

* సంకుచిత మనస్తత్వం సంస్కృతీ రాహిత్యానికి సంకేతం, అందరినీ కలుపుకొనే మనస్తత్వం పెరుగుదలకు సోపానం.
—జవహర్లాల్ నెహ్రూ

* ఇల్లేతీర్థం, వాకిలే వారణాసి, కడుపే కైలాసం. —సామెత

## సంగీతం

* సంగీతం మనిషికీ దైవానికి వారధి లాంటిది.
—నీలంరాజు లక్ష్మీప్రసాద్

* పాలుత్రాగేబిడ్డ, ప్రపంచజ్ఞానంలేని గొడ్డు, విషంగ్రక్కేసర్పము గూడ మధురమైన సంగీతాన్ని వింటే మైమరచిపోవడం కద్దు.[1]
—సంస్కృతసూక్తి

---

[1] శిశుర్వేత్తి పశుర్వేత్తి
వేత్తి గానరసం ఫణి —సూక్తి

* సర్వ జాతిలో షడ్జము, ఋషభము, గాంధారము, మధ్యమము, పంచమము, ధైవతము, నిషాదము అని ఏడు స్వరాలున్నవి. వీటినే స-రి-గ-మ-ప-ద-ని అనే సంకేతాక్షరాలతో వ్యవహరిస్తున్నారు. —గుమ్మలూరి సత్యనారాయణ

* సంగీతం మానవుల సర్వసామాన్య భాష. —జాన్ విల్సన్

* "గీతం వాద్యంచ నృత్యంచ త్రయం సంగీతముచ్యతే" నృత్యము, గీతము, వాద్యములను మూడును సంగీతముయొక్క రూపములు. —సూక్తి

* సంగీత సాహిత్యములు రెండును సరస్వతీదేవి స్తనద్వయము. అందు సంగీతము వినినంతనే ఆనందము కలిగించును. సాహిత్యము ఆలోచించిన అమృతము లభించును.[1]

—సంస్కృతసూక్తి

---

1. సంగీత మపి సాహిత్యం
సరస్వత్యా స్తనద్వయమ్
ఏక మాపాత మధుర
మన్య దాలోచ నామృతమ్

## సంఖ్యలు

* క్రికెట్ ఆటలో అస్తి కోల్పోయినవాడు తుట్టతుదకు అంకెలను ఇలా తిట్టాడు: "శూన్యం : యిత్తడిసిబ్బి; ఒకటంకి : చాపలేని కొయ్య; రెండంకి: ఉదత మదత; మూడంకి : మంచం పక్క; నాలుగంకి : గోడకుర్చీ; అయిదంకి : వదులు పిలక; ఆరంకి : హాకీ కర్ర ముక్క; ఏడంకి ; ఒంటిగోడ సిమెంటు బాల్కనీ; ఎనిమిదంకి; అరగ్గా నిల్చిన పొత్రం; తొమ్మిదంకి : ముంతకొప్పుసాసు. —భమిడిపాటి కామేశ్వరరావు

## సంఖ్యాబలం

* పదుగురాడుమాట పాటియై ధర జెల్లు
ఒక్కడాడుమాట యెక్కదెందు. —వేమన

## సంఘసేవ

* ఏ ఉద్యమంలో నీవు పనిచేసినా చేయిజాచి ఎవరినీ అడుగబోకు. సంస్థనుండిగాని వ్యక్తులనుండిగాని చిల్లిగవ్వ పుచ్చుకోకుండా నీ సంపాదన మార్గాన్ని నీవు చూచుకో. దైన్యంతో చేయిజాపితివా కొండంత తపస్సుని గుడ్డిగవ్వకు కొనేస్తారు. ఒక్కొక్కసారి ఆ గవ్వను చేతికివ్వకుండానే చూపించే కొనివేస్తారు జాగ్రత్త. —భోగరాజు పట్టాభి సీతారామయ్య

## సంస్కృతి

* గతమనెడి తల్లి వర్తమానమనెడు శిశువునకిచ్చు స్తన్యమే సంస్కృతి. —సి. నారాయణరెడ్డి

* నీకు ఆకలవుతుంది. అన్నం తింటావు. అది ప్రకృతి.

నీకు ఆకలవుతుంది. మరొకడిని చావగొట్టి వాడి అన్నం తింటావు. అది వికృతి.

నీకు ఆకలవుతుంది. నీ అన్నంలో కొంత మరొకడికి పెడుతూ నీవు తింటావు. అది సంస్కృతి.

—వినోబా భావే

## సంసారం

* సంసారమొక శాపము కాదు. దురవస్థ అంతకన్నా కాదు. సంసార మనునది వ్యష్టి సమిష్టిని ఆలింగనము చేసుకొనేందుకు ఉపకరించు ఒక ప్రక్రియ మాత్రమే.

—స్వామి సుందర చైతన్యానంద

* ఇష్టమున్న సంసారం అరవైమూడు, ఇష్టంలేని సంసారం ముప్పై ఆరు. -సామెత

(63 అను సంఖ్యలోని అంకెలు ఎదురెదురు చూస్తున్నాయి; 36 లోని అంకెలు ఎదమొగము పెడమొగముగా నున్నాయి.)

* ఇంట్లో విత్తుల్లేవు; ఇద్దరికీ మాటల్లేవు. —సామెత

* కొయ్యను సహితము తొలుచు బంభరము సాయంసమయము

నందు పద్మకోశాంతరమునందు చిక్కుకొన్నట్లు మానవుడు సంసార చక్రమునందు బంధితుడగుచున్నాడు.

—మహామంత్రి చాణక్యుడు

* కాళ్ళు తడవకుండా సముద్రాన్ని దాటినవాడు కూడ కళ్ళు తడవకుండా సంసారాన్ని దాటలేడు. —సూక్తి

* సంసారం గుట్టు; వ్యాధి రట్టు.

* రెండూళ్ళ వ్యవసాయం, ఇద్దరు భార్యల సంసారం.

—సామెతలు

* సంసారం బారెడు, ఖర్చు బారెడు. —సామెత

* భార్యాభర్తల తగాదా లాలూచీ కుస్తీ. —పుచ్చా పూర్ణానందం

(చూడుము : భార్యాభర్తలు)

## సంస్కారము

* రెండు అణాలు విలువచేసే ఇనుము సంస్కారములచే మూడు వందల విలువగల గడియారముగా మారును. కనుక సంస్కారమునకే విలువగాని పదార్థమునకు గాదు.

—సత్యసాయిబాబా

## సజ్జనులు

* చెట్లు రసఫల భారముచే వంగియున్నవి. జలభారముచే మేఘ

ములు వంగియున్నవి. సుజనులు సర్వసంపదలతో గూడిన వారైనను గర్వించరు. —భర్తృహరి

* మహాత్ములు సంపద కలిగినప్పుడు అపుడు వికసించిన తామర పువ్వువలె నుందురు. అపదల నెదుర్కొనునపుడు పెద్ద కొండ యొక్క గండశిలవలె ధైర్యము చెదక యుందురు.

—భర్తృహరి

* తనను నమ్ముకొనియున్న ఎట్టి సామాన్యునైనను గుణవంతుడు విడిచిపెట్టడు. ధర్మరాజు స్వర్గమునకు పోవునపుడు తనతో వచ్చిన కుక్కను దేవతలు విస్మయము చెందుచుండ విమానము నందు కూర్చుండబెట్టుకొని గొనిపోయినాడుగదా.

—భాస్కర శతకము

* "బంధన మాయాన్తి శుకాః యథేష్టసంచారిణః కాకః" -చిలకలకే పంజరములో బంధన మేర్పడును. కాకులెప్పుడును యధేచ్ఛగా తిరుగుచుండును. —సంస్కృతసూక్తి

* సజ్జనుడు ఎల్లపుడు ప్రియవచనములే పలుకును. ఒకానొకప్పుడు కఠోరవాక్యములు పలికినను అవి కీడుచేయవు. మేఘములు ఒకానొక సమయమున వడగండ్లు కురిసినను అవి రాళ్ళుకావు, చల్లని నీరేయగును. —భాస్కరశతకము

* తన కార్యంబు పరిత్యజించియు పరార్థ ప్రాపకుల్ సజ్జనుల్.
—భర్తృహరి

* సహృదయుల కోపము తెల్లని గుడ్డమీద పడిన నీటిబిందువులా వుంటుంది. —గురూజీ గోల్వాల్కర్

* సజ్జనుడు జీవితంలో క్రిందపడినను బంతివలె పైకిలేస్తాడు. మందుడు క్రిందపడి మట్టిముద్దవలె అణగియుంటాడు.

—భర్తృహరి

## సత్యము

* సత్యమును మాటలాడవలెను; ప్రియము పలుకవలెను. అప్రియమైన సత్యమును పలుకరాదు ; అసత్యమగు ప్రియమును చెప్పరాదు. ఇది సనాతనమైన ధర్మము.[1] —సూక్తి

* ఈ విశ్వాసానికి ఒక 'లయ' వున్నది. ఆ లయే దానిని నిలబెడుతూ వున్నది. దీనినే సంస్కృతకవులు 'రిత' అన్నారు. రితం కానిది అనృతం. అనృతమంటే విశ్వంలోవున్న లయకు విరుద్ధంగా వర్తించడం. సత్ప్రవర్తనులు లయకు అనుగుణంగా నడిచేవారు. దుష్ప్రవర్తనులు లయతప్పిన మనుష్యులు. అందువల్ల వారి జీవితం దుఃఖభాజకమవుతుంది.

—త్రిపురనేని గోపీచంద్

* తీయని నీటితోనిండిన నూరు నూతులకంటె ఒక దిగుడుబావియు నూరు దిగుడుబావుల కంటె ఒక యజ్ఞమును, నూరు యజ్ఞముల

---

1 సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయాత్ న బ్రూయాన్ సత్యమప్రియమ్ ప్రియంచ నానృతం బ్రూయా దేష ధర్మ సనాతనః

కంటె ఒక పుత్రుడును నూర్గురు పుత్రులకంటె ఒక సత్యవాక్యమును శ్రేష్ఠమైనవి. —మహాభారతము

* సత్యము చనిపోయే మనుష్యుల పెదిమలపైకూర్చొని వుంటుంది.[1] —మాథ్యూ ఆర్నాల్డ్

* తుట్టతుదకు సత్యము, నూనె, పైకి తేలుతాయి. —ఆంగ్లసామెత

* సత్యము తరచుగా గందరగోళం నుండి గాక తప్పుల నుండియే వెలువడుతుంది.[2] —ఫ్రాన్సిస్ బేకన్

* సత్యాలను మనం నిర్లక్ష్యంచేస్తే అవి రెట్టింపు శక్తితో కక్ష సాధించుకుంటాయి [3] —సర్దార్ వల్లభాయిపటేల్

* వాద ప్రతివాదముల నుండియే సత్యమను వెలుగు ఉదయించును. (వాదే వాదే జాయతే తత్త్వబోధః) —సంస్కృతసూక్తి

* నిజమైన బంగారం నిప్పుకు వెరువదు.

* నిజము కురచ, బొంకు పొడవు. —సామెతలు

---

[1] Truth sits on the lips of dying men. —Mathew Arnold

[2] Truth emerges more readily from error than from confusion. —Francis Bacon

[3] If we ignore facts, they will take vengence with redoubled vigour. Sardar Patel

## సత్సాంగత్యం

* మంచి సాంగత్యం మాత్రమే ఈ జీవితాన్ని భరింపదగినదిగా చేస్తుంది.[1] —స్పానిష్ సామెత

* సాధుసంగమమున సామాన్యుడును గూడ
మంచి గుణములను గ్రహించు చుండు
పుష్ప సౌరభంబు పొందదా దారంబు —కరుణశ్రీ

## సన్యాసము

* క్లుప్తంలో వర్ణించాలంటే మరణం మీద ప్రేమే సన్యాసం ! లౌకికులు జీవితాన్ని ప్రేమిస్తారు. సన్యాసి మరణాన్ని ప్రేమిసాడు. అంటే ఆత్మహత్య చేసుకోవడం కాదు.

మరణాన్ని ప్రేమించడమంటే ఏమిటి ? మనం ఎప్పటికైనా మరణించక తప్పదు. కనుక ఒక మంచి కార్యంకోసం మరణిద్దాం. మన చర్యలన్నీ త్యాగానికే వినియోగింపబడుగాక !

ఆహారం తినడం ద్వారా నీ శరీరాన్ని పెంచుతావు. కాని పరుల శ్రేయస్సుకు వినియోగ పడని ఈ శరీరం ఎందుకు ? గ్రంథపఠన ద్వారా మనస్సును వికసింపజేసుకుంటావు. లోకోపకారంకోసం ఆ మనస్సును వినియోగించనిచో నీచదువు వ్యర్థము.

ఈ చిన్న శరీరాన్ని పెంచుకోవడం కన్న లక్షలాది సోదరుల కోసం దాన్ని వినియోగించి, ఆ వినియోగంలోనే సహజ

---

[1] **Pleasant company alone makes this life tolerable.**
**—Spanish Proverb**

మైన మరణాన్ని పొందడం ఆనందదాయకం. తద్వ్యతిరేకంగా శరీరం మీద ప్రేమను పెంచుకున్నకొద్దీ మరణం భయంకరంగా గోచరించి దుఃఖ కారణమవుతుంది. —స్వామి వివేకానంద

* లింగ భేదం, రూపభేదం, స్పర్శభేదం లేనివాడు సన్యాసి.
—మాతృశ్రీ అనసూయాదేవి

## సమానత్వం

* అందరూ అన్నివిధాలా సమానులు కాకపోవచ్చు. కాని అందరూ సమానంగా మానవులే.[1] —హ్యూగైట్ స్కెల్

* విద్యావినయములు కలిగియున్న బ్రాహ్మణునియందును, గోవునందును, ఏనుగునందును, కుక్కయందును, కుక్కమాంసము వండుకొని తినువానియందును సమదృష్టి గలవారే జ్ఞానులు.[2]
—భగవద్గీత (5-18)

* వల్లకాడు స్మృతికి రాగానే
త్రుళ్ళిపడతావెందుకు
సమతాపాఠం నేర్చుకోవాలంటే
శ్మశానమే సహజకావ్యం సుమా. —సి. నారాయణరెడ్డి

---

1. It may be that men are not equal in all respects, but they are equally men. —Hugh Gaitskell

2. విద్యావినయ సంపన్నే బ్రాహ్మణే గవి హస్తి
శునిచైవ శ్వపాకేచ పండితాః సమదర్శనః —భగవద్గీత

* కలమెత్తిన హలమెత్తిన
మలమెత్తిన వాని నొక్కమైఁ జూడవలెన్
వలతియు నలతియు లేదిటఁ
బలువృత్తులు సాగినపుడె బ్రతుకులు సాగున్.

—తుమ్మల సీతారామమూర్తి చౌదరి

* ఆరడుగుల నేల అందరినీ సమానం చేస్తుంది.

—ఆంగ్ల సామెత

* నిండార రాజు నిద్రించు నిద్రయు నొకటే
అండనే బంటు నిద్ర అదియు నొకటే
మెండైన బ్రాహ్మణుడు మెట్టు భూమి యొకటే
చండాలు డుండేటి సరిభూమి యొకటే
కడగి ఏనుగుమీద కాయు యెండొకటే
పుడమి శునకము మీద పొలయు నెండొకటే

—తాళ్ళపాక అన్నమాచార్యులు

## సలహా

* సలహా అముదం వంటిది. ఇవ్వడం సులభం, పుచ్చుకోవడం ప్రాణాంతకం.

—ఆంగ్ల సామెత

* నవ్వుతూ అనుభవించేవాడి దగ్గరకు ఏడుస్తూ అనుభవించేవాడు సలహాకు వస్తాడు.

—మాతృశ్రీ అనసూయాదేవి

## సవతితల్లి

* తన చెయ్యి కాలుతుందని సవతిబిడ్డ చేత్తో కలియబెట్టిందట.

—సామెత

## సహకారము

* కనురెప్పలవలె, నోటిలోని దంతముల వరుసలవలె, రెండు చేతులవలె, రెండుకాళ్ళవలె, పరస్పరం సహకరించుకోవడానికే మనం జన్మించినాము. ఒకరికొకరు విరుద్ధంగా వ్యవహరించడం ప్రకృతికి వ్యతిరేకం. —మేరియస్ ఆనీతియస్

## సహజము

* కడుపుతో ఉన్నమ్మ కనక మానునా ? వండినమ్మ తినక మానునా ?

* చింత చచ్చినా పులుపు చావదు. —సామెతలు

## సహనము

* కోరుకోవోయ్ మనిషి కోటగోడ సహనాన్ని
తన ఒళ్ళు చిల్లులు పడుతున్నా తన వారిని బ్రతికించాలని.

—సి. నారాయణరెడ్డి

## సహృదయత

* మానెడు విషంకంటె ఒకబొట్టు తేనె ఎక్కువ ఈగలను చేరుస్తుంది. —అబ్రహాం లింకన్

## సాంప్రదాయము

* అంతకడివెడు పాలపై
ఒక్కింత మిగడ పేరినట్లుగ
మనకు మిగులును గతములోపలి
మంచి; అదియే సాంప్రదాయము. —సి. నారాయణరెడ్డి

## సామ్రాజ్యవాదము

* ఆనాటి సామ్రాజ్యవాదము కప్పము వసూలు చేసింది ; ఈనాటి సామ్రాజ్యవాదం వడ్డీకి అప్పులిస్తుంది.
— హెచ్.యన్. బ్రెయిల్స్‌ఫోర్డు

## సామెత

* మాటకు ముందు సామెత, భోజనానికి ముందు ఊరగాయ.
-కన్నడ సామెత

## సాహసము

* సాహసములేనివాడి కత్తి సరిగా తెగదు. —సామెత

## సాహిత్యం

* వాఙ్మయం అంటే మాటల కూటిక అని అర్థం.
సారస్వతం అంటే అర్థం రసంతో కూడుకున్నది అని.
సాహిత్యం అంటే హితంతో కూడుకొన్నది అని.
—ఎస్. సంజీవదేవ్

* సారస్వతమూ సాహిత్యమూ కూడా వాఙ్మయంలోని రెండు శాఖలన్న మాట. ఒకటి ప్రియాన్నిచ్చేది, రెండవది శ్రేయాన్నిచ్చేది. —ఎస్. సంజీవదేవ్

* భాషకు వ్యాకరణం, కవిత్వానికి ఛందస్సు, కావ్యానికి లక్షణాలు పరిణామక్రమంలో అవరోధాలుగా పరిణమించాయి. కాని ప్రగతిగామి అయిన సాహిత్య స్రవంతి ఈ ప్రతిబంధకాలను బద్దలు కొట్టి స్వేచ్ఛా పథంలో ముందుకు సాగిపోయింది.

—ముంగర శంకరరాజు

* సాహిత్యం ఒక పరమార్థ సాధనకు సాధనమాత్రమేగాని, అదే పరమార్థం కాదు. మహాకవులెవ్వరూ సాహిత్య సంసార లంపటులు కారు. ఈ సత్యం గురజాడ అప్పారావు పంతులు గారిలో సార్థకమయింది. —గుంటూరు శేషేంద్రశర్మ

* సంఘం తన కురులు దిద్దుకొనే దర్పణమే సాహిత్యం.

—మాలతీ చందూర్

* సాహిత్యమంటే వాయుగుంఠనకాదు. అది మహోజ్వల కాంతి పుంజం.... కలం అంటే కర్రపుల్లా కాదు, గడ్డిపరకా కాదు; కీర్తి శిఖరాన్ని ఎక్కించే నిచ్చెన కాదు. అది కాంతిచక్రాలు విరజిమ్మే ఒక వజ్రాయుధం. దీనికి పానుగంటివారి సాక్షే సాక్షి.

—గుంటూరు శేషేంద్రశర్మ

* Re-reading కు నిల్వని బుక్ లిటరేచర్ కాదు.

—పుచ్చా పూర్ణానందం

* కావ్యం హృదయాన్ని కదిలిస్తే వ్యాసం మేధను మేల్కొలుపుతుంది.

—ఎస్. సంజీవదేవ్

## సిగరెట్

* సిగరెట్ ఒక స్థూపాకార వస్తువు. దానికి ఓ చివర నిప్పు, రెండో చివర మూర్ఖుడు వుంటారు.[1]

—జాన్సన్

## సినిమాతారలు

* సినిమాల్లో నటిస్తూ, పాపం, జీవితంలో గూడ విధిగా నటిస్తేనే గాని బతకలేని బతుకులు వాళ్ళవి.

—బి. ఎస్. రాజు

* మా తిండి మేం తినలేం. మా బట్టలు మేం కట్టుకోలేం. మా మా మాటలుకూడా మేం మాట్లాడుకోలేం. అంతా అరువు, ఎరువు.

—దాసరి నారాయణరావు

## సుఖం

ఎక్కువ కష్టంలోనుంచి తక్కువ కష్టంలోకి రావడమే సుఖం అంటే.

—మన్నవ గిరిధరరావు

---

1. Cigarette is a cylendrical thing haviug fire at one end and fool at the other end. —Johnson

* మనవల్ల ఒకరు సుఖపడుతున్నారనే తృప్తిలోనే వుంది సుఖం.
—చక్రవర్తి రంగస్వామి

* అర్ధగంట భోగం, ఆరునెలల రోగం. —సామెత

**సుఖదుఃఖాలు**

* శ్రమ అనేడి వెల చెల్లించకుండా సుఖం లభించదు. క్రమమైన సుఖానికీ అక్రమమైన సుఖానికీ తేడా ఏమంటే, సక్రమ సుఖానికి వెల ముందుగా చెల్లిస్తావు; అక్రమమైన దానికి వెల తరువాత చెల్లిస్తావు. —జాన్ ఫాస్టర్

* పరిపూర్ణ సుఖము లధికబాధల కొరకే.
సుమతీ శతకము

* అగాధమౌ జలనిధిలోన ఆణిముత్యమున్నటులే
శోకాల మరుగునదాగి సుఖమున్నదిలే.
—శ్రీ శ్రీ (వెలుగునీడలు సినిమాలో)

* పోలిక వలన మనిషికి సుఖమూ దుఃఖమూ కలుగుతాయి.[1]
—ఆంగ్ల సామెత

---

1. It is comparison that makes men miserable or happy. —English Proverb

* లేనిదాని కొరకు ఆశించేది దుఃఖము, ఉన్నది చాలనుకొనేది సుఖం. —మాతృశ్రీ అనసూయాదేవి

* మీరు 'భోగ' మను మంత్రి నాహ్వానింతురేని, అతని యాంతరంగిక కార్యదర్శియైన 'రోగ'మును దర్శించి అతనిని మర్యాద చేయవలెను. అది తప్పదు. మంత్రిని సైతము లెక్కచేయక మిమ్మెక్కువగా బాధించును.

కాబట్టి మీరు 'త్యాగ' మను మంత్రినో, లేక 'యోగ' మను మంత్రినో ఆహ్వానించి నపుడు 'భోగము' అంతరంగిక కార్యదర్శిగా వచ్చును. మీరు నిర్భయముగను సంతోషముగను వానిని సందర్శింపవచ్చును. అతడు మంత్రులకు విధేయుడై వారి యాజ్ఞల ననుసరించి మీ అభీష్టములను యథోచితముగ నెరవేర్చుచుండును. —సత్యసాయిబా

* మనము పూర్తిగా సుఖపడలేక పోవడానికి కారణం ఒక్కటే – మనకున్నదానిపై నిర్లక్ష్యం, లేనిదానిపై ఆరాటం.

—రియో

* మేఘము, వర్షము లేకుండా ఇంద్రధనస్సుపుండదు.[1]

—జె. హెచ్. విన్సెంట్

---

1. There can be no rainbow without a cloud and a storm. —J. H. Vincent

* మానవులనుభవించు ప్రాపంచిక సుఖములు కేవలం తాము ఎదు ర్కొను బాధలమీద ప్రతిక్రియలు మాత్రమే. నీకు దాహమయి నపుడు నీరు త్రాగుతావు; ఆకలయినపుడు అన్నం తింటావు. అది నీకు సుఖమనిపిస్తుంది. ఇది సహజమైన సుఖంకాదు. ఆకలి, దప్పికయొక్క బాధలను తొలగించడం మాత్రమే.[1]

—సత్యసాయిబాబా

## సున్న

* సున్న అనే పదం సంస్కృతంలోని శూన్యం అనే పదాన్నుండి ఆవిర్భవించింది. ఆ శూన్యానికి ఆకారం చక్రాకారం. చక్రం అనేది ఆద్యంతములు లేనటువంటిది. పరిపూర్ణమయినటువంటిది. ఏమీ లేకపోయినా, సర్వమునూ ఇముడ్చుకోగలిగినటువంటిది. నిర్గుణమైనది. ఇవన్నీ భగవల్లక్షణాలు. తత్త్వమీమాంసకులకు ఈ సున్న యొక్క లక్షణాలలో వేదాంత రహస్యాలు గోచ రిస్తాయి. భగవత్తత్వం, సృష్టి రహస్యం ప్రస్ఫుటమవుతాయి. శూన్యమైన ఆకాశంనుండి తేజస్సు, అందుండి వాయువు,

---

1. The worldly pleasures are nothing but counter-actions against pain. You feel thirsty, then you drink water. You are hungry, you then eat food. It is not positive pleasure that you have. But you negate the pangs of thirst and hunger.

—Satya Sai Baba

అందుండి జలము, అందుండి పృథ్వి ఉత్పత్తి అయినట్లు ఈ శూన్య సంఖ్యనుండి, ఒకటి మొదలు తొమ్మిది వరకు గల సంఖ్యలు ఆవిర్భవించాయి. —కె.ఆర్.కె. మోహన్

## సృష్టి

* పరస్పర సహాయమే సృష్టియొక్క మూలతత్త్వము.

—రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ

* రూపం లేనిది రూపం ధరించడమే సృష్టి.

—మాతృశ్రీ అనసూయాదేవి

## సేవ

* సేవ జీవితమునకు ఆనందమును, రుచిని కలిగించే లవణము వంటిది. సేవలోనే వున్నది పవిత్రత. సేవ ద్వారా ప్రేమ అనుభూతిలోనికి వస్తుంది. —శ్రీసత్యసాయిబాబా

* ప్రేమకు మించిన ఆధ్యాత్మిక సాధనలేదు. ప్రేమ యొక్క పరాకాష్ఠ సేవ. సేవయొక్క స్ఫటిక రూపం త్యాగం. నువ్వు ధ్యానంలో వున్నా సరే, నీ సహాయం కోరి ఎవరైనా వస్తే తక్షణం వెళ్ళి చేయగలిగిన సేవ చెయ్యి.

—శ్రీ సత్యసాయిబాబా

## సోమరితనము

* సోమరితనము ఆకలికి తల్లి, మరియు దొంగతనానికి పెద్ద సోదరుడు. —ఆంగ్లసూక్తి

* రేపు అనేది సోమరులు పనిచేసేరోజు. —ఆంగ్ల సామెత

* దున్ననక్కర లేకుండా ఊడ్చితే, కొయ్యనక్కర లేకుండా పండుతుంది. —టర్కీ సామెత

* సోమరిమనసు దయ్యాల భవనము. సోమరితనము సాలె గూళ్ళతో ప్రారంభించి సంకెళ్ళతో అంతమగును. తుప్పు ఇనుముయొక్క ఆయువును తగ్గించునట్లు అలసత్వము మానవుని ఆయువును కృంగదీయును. —స్వామి రాజేశ్వరానంద

## సోషలిజం

* ఉత్పత్తి సాధనాలను మారకపు సాధనాలను సమిష్టి యాజమాన్యంలో వుంచి, వాటిద్వారా యావన్మందికి సమానంగా ప్రయోజనాలు కలిగించే వ్యవస్థయే సోషలిజం.[1]

—రాబర్ట్ బ్లార్డ్

---

1. Socialsm is the common holding of the means of production and exchange and the holding of them for the equal benefit of all. —Robert Blard

* ప్రతిమొక్కరు ధరించడం వలన తన ఆకారాన్ని కోల్పోయిన హ్యాటు వంటిది సామ్యవాదం. —జోడ్

## స్వభావము

* పెద్దమనుషులు ఏది న్యాయమో చూస్తారు; అల్పుడు ఏది లాభమా అని చూస్తాడు. —కన్ఫ్యూషియస్

## సైన్సు

* సైన్సు ఇచ్చే జ్ఞానాన్ని శక్తినీ వాడుకొనే బుద్ధి, వివేకం సైన్సు నుండి దొరకవు అని తెలుసుకోవాలి.

—ఆల్బర్ట్ ఐన్‌స్టీన్

## సైన్సు-మతము

* విజ్ఞాన శాస్త్రజ్ఞులు, సిద్ధ పురుషులు పరస్పర వ్యతిరేక దిశలలో వర్తులాకార బాటమీద పయనిస్తున్న వారివలె ఉన్నారు. ఆధునిక మానవునికి ఇరువురి ఆలోచనలతో అవసరమున్నది.[1]

—ప్రొ॥ జయంతి ఆర్. జోషి

---

1. Scientists and the mystics are like two men who are walking in opposite directions along a circular path and modern man needs the insights of them both. —Prof. Jayant R. Joshi

* సైన్సు జీవితాన్ని పొడిగిస్తుంది; మతం జీవితానికి లోతులు చూపుతుంది.[1] —యార్లగడ్డ సుబ్బారావు

## స్వాతంత్ర్యం

* బానిసకు బాధలెక్కువ, స్వతంత్రుడికి బాధ్యతలెక్కువ

—మాతృశ్రీ అనసూయాదేవి

* స్వాతంత్ర్యం ఒక చాలా సున్నితమైన పువ్వు
చాల వాడైన కత్తి, విలువైన వజ్రం
స్వాతంత్ర్యం తెచ్చే వెన్నెన్నో బాధ్యతలు
సామర్థ్యంతో నిర్వహిస్తామని సంకల్పం చెప్పుకుందాం.

—శ్రీరంగం శ్రీనివాసరావు

## స్వార్థం

* నన్ను తప్పించి ఆకాశమంత పిడుగు పడాలి అన్నట్లు.

* అసలే గొడ్డుగేదెరా అంటే నావరకైనా చేపదా అన్నాట్ట.

* చద్ది అన్నం తిన్నమ్మ మొగుడి ఆకలి ఎరుగదు.

* తనకుమాలిన ధర్మం మొదలు చెడ్డబేరం.

—సామెతలు

---

1. Science prolongs life, religion deepens it.

## స్వార్థపరుడు

* స్వార్థపరుడి శక్తి సామర్థ్యాలు పరిమితంగా ఉంటాయి.[1]

—ఏకనాథ్ రానడే

## స్వావలంబన

* వ్యక్తులుగాని దేశాలుగాని తమ కాళ్ళమీద తాము నిలబడాలి. తమ మనుగడకే ఇతరులపై ఆధారపడే దేశాలు పతనంగాక తప్పదు. —స్వామి వివేకానంద

* "ఉద్ధరే దాత్మ నాత్మానం"
(తన్ను తానే ఉద్ధరించుకొనవలెను.)

——భగవద్గీత (6-5)

## స్త్రీ



* స్త్రీ జాతిని రెండు వర్గాలుగా చెప్పొచ్చు. మాతృమూర్తులు, ప్రేయసీ మూర్తులు అని. ప్రకృతిపరంగా చెప్పాలంటే, తలి వర్షఋతువు, ప్రేయసి వసంతఋతువు లాంటివారు.

వర్షం నీటిని ప్రసాదించి ఫల స్వరూపాన్ని అందజేస్తుంది. వేడిమి తగ్గించి చల్లదనం యిస్తుంది. దివినుండి కరిగిపోతూ దిగి వచ్చి భువిలోని కరువు కాటకాల నంతమొందించి సమృద్ధం చేస్తుంది.

---

1. A Selfish man has limited energies.

—Ekanath Ranade

మరి ప్రేయసి సమ్మోహనాస్త్రంలాంటిది. తియ్యని తన్మయత్వం కలుగజేస్తుంది. తన చురుకైన స్వభావంతో రక్తాన్ని ఉరకెత్తించి గంగ వెర్రులెత్తేటట్లు జేస్తుంది. అంతవరకు రాగమెరుగని మూగవీణను సున్నితంగా మీటించి హృదయస్పందన కలిగిస్తుంది. మాటలకందని మధుర భావాలు రేపి,మనోహరంగా ఉయ్యాలలూపుతుంది. మనస్సుమీద మత్తుమందు చల్లి మైమరపిస్తుంది. —రవీంద్రనాథ్ టాగోర్

* దేవుని చేతిలోనున్న సృష్టితంత్రమంతయు మీ గర్భగోళములందుంచుటచే మీరే భూలోకదేవతలు.

—పానుగంటి లక్ష్మీనరసింహారావు

* పదిహేను పదహారేళ్ళవయిస్సు వచ్చేటప్పటికి తల్లిదండ్రులను వదలి పరాయి ఇంట్లో, కొత్తవాళ్ళమధ్య మసలుతూ కాపరం చెయ్యడానికి ప్రౌఢిమ స్త్రీకి వచ్చేస్తుంది. కాని అదే వయస్సులో ఉన్న పురుషుడికింకా ప్రపంచజ్ఞానం పూర్తిగారాదు. మంచీచెడ్డా, ఎలా మాట్లాడాలో, ఉండాలో ఇవన్నీ స్త్రీ గ్రహించినంత సూక్ష్మంగా పురుషుడు గ్రహించలేడు.

—వోలాప్రగడ సత్యనారాయణమూర్తి

* అనాలోచన అరవైపాళ్ళు, అసూయ నలభైపాళ్ళు వెరసి, కలసి, ఆడదయిందట. —బి.యస్. రాజు





* చాంచల్యమా ! నీ పేరే స్త్రీ. (Frailty, thy name is woman).
—షేక్స్పియర్

* ఆడది తనకు మొగవాడు రక్షణ ఇస్తున్నాడనే భావముతో ఎన్ని అఘాయిత్యాలనైనా భరిస్తుంది.
—లత

* పూబోడుల పుస్తకము ప్రపంచము. వారు ప్రపంచం వలన తెలుసుకొనునంతగా పుస్తకములవలన తెలుసుకొనరు.
—రూసో

* కామిని సౌందర్యమునే దర్పవతి యగును. పవిత్ర గుణములచే ప్రశంసనీయ యగును. లజ్జాశీలముచే దేవియగును.
— షేక్స్పియర్

* ప్రపంచంలో అత్యధికంగా దోపిడీకి గురిచేయబడేది స్త్రీ, తరువాత కార్మికుడు.
— లెనిన్

* ఇల్లులేనమ్మ హీనంచూడు, మగడులేనమ్మ మానంచూడు.
—సామెత

* కలకంఠికంట కన్నీ రొలికిన
సిరి యింటనుండ నొల్లదు సుమతీ.
—సుమతీ శతకము

* ఆకర్షించగలగటం స్త్రీకి ఒకవరం. ఆ వరాన్ని బహు తెలివిగా వాడుకోగలగాలి. అలాకాక తనే నిగ్రహం కోల్పోయి ఏ

బలహీన క్షణాన్నో పొరబాటు జరిగితే, స్త్రీకున్న అపురూపమైన వర : కాస్తా భస్మాసుర హస్తమయి కాల్చేస్తుంది.

—అధరాపురపు తేజోవతి

* అసలు - వెన్నెలా, పువ్వులు, సువాసన. లేడిచూపులు, సెలయేటి పరుగులు, వీణాస్వరం - ఇవన్నీ కలిస్తే స్త్రీ అవుతుంది. స్త్రీలో ఇవన్నీ ఉండాలి నిజానికి.

—రాపూరు సత్యనారాయణరావు

* సగలొల్లని నారిగలదె పరికింపంగన్. —పూర్వకవి

* అసూయ ముందు, ఆడది వెనుక పుట్టింది. —సామెత

* స్త్రీ హృదయం నవనీతం.... గట్టిపడిందా దానిముందు వజ్రం ఎందుకూ పనికిరాదు. —చలం

## స్త్రీ పురుషులు

* పురుషుల సహచర్యం లేని స్త్రీలు వాడిపోతారు; స్త్రీ సహచర్యం లేని పురుషులు మూఢులవుతారు. —చెకోవ్

* బంగారానికి పరీక్ష అగ్ని; స్త్రీకి పరీక్ష బంగారం; పురుషునికి పరీక్ష స్త్రీ. —బెంజమిన్ ఫ్రాంక్లిన్

* మగవాడు తన విజయాన్ని మరచిపోడు, స్త్రీ తన అపజయాన్ని మరచిపోదు. ఈ పరస్పర విరుద్ధ స్వభావాలే స్త్రీ పురుషుల మధ్య అంతుదొరకని అగాధాలుగా మారుతున్నాయి.

—లత

* నవ్వే ఆడదాన్ని ఏడ్చే మగవాణ్ణి నమ్మరాదు. —సామెత

## స్నేహము

* రెండు శరీరాలలో నివసించే ఒకే ఆత్మ స్నేహితుడు.
—అరిస్టాటిల్

* బంధుత్వంలో ఉండే ప్రతిబంధకాలూ పంతులూ సాధింపులూ స్వార్థాలూ బాధ్యతలూ ఎవరో నిర్ధారణ చేసిన పట్టింపులూ స్నేహంలో ఉండవు. స్నేహబంధాన్ని ఎంతదూరంగా ఎంత వదులుగా ఉంచుకోవాలనిపిస్తే అలా ఉంచుకోవచ్చు. బంధువుల చేతఒక మంచిమాట అనిపించుకోవటం కంటె స్నేహితులచేత అనిపించుకోటం తేలిక. —కొడవటిగంటి కుటుంబరావు

* జంతువులు ఎంత మంచి స్నేహితులు! అవి ప్రశ్నలడిగి బాధించవు; విమర్శచేసి నొప్పించవు. —జార్జి ఇలియట్

* స్నేహితుడనగా మరియొక "నేను"[1] —జీనో

* క్షీరముతో నీరు చేరుటవలన పాలు తన గుణములను నీటి కొసంగినది. పిదప, ఆ పాలు కళపెళ కాచబడుటచే, నీరు దుఃఖించి ఆ దుఃఖముచేత మంటలోదురికినది. తన మిత్రుడైన నీటికి అట్టి విపత్తు కలిగినందున పాలుగూడ నిప్పులో

1. A friend is another I. —**Zeno**

దూకుటకు సిద్ధమైనది. అంతలో పొంగుచున్న పాలపై నీటిని చల్లగా, నీరు తనను చేరుచున్న కారణముచేత పాలు పొంగుట తగ్గి శాంతించెను. మహాత్ముల స్నేహ మీ రీతిగా నుండును.

—భర్తృహరి

* స్నేహితుడే అయితే సూదిబెజ్జమంత దారే చాలును. బాధ్యత లేనివానికి ప్రపంచమంత వెడల్పున్నా ద్వారం చాలదు.

—పర్షియన్ సామెత

* స్నేహితుడు కంటికి రెప్పా, కాలికి చెప్పూకూడా అయ్యేవాడు.

—సామెత

* స్నేహము దుఃఖాన్ని భాగిస్తుంది; ఆనందాన్ని హెచ్చిస్తుంది.[1]

—ఆంగ్లసామెత

* స్నేహితుని పొందే ఏకైకమార్గం తాను స్నేహితుడు కావడమే.

—ఎమర్సన్

* ఎరుక పిడికెడు ధనం —సామెత

* కుజనుల స్నేహము ఉదయకాలమందలి నీడవలె మొదట పెద్దదిగా నుండి క్రమముగా తగ్గిపోవును. సుజనుల స్నేహం

---

1. Friendship multiplies joys and divides griefs.

—Proverb

మిట్టమధ్యాహ్నపు నీడవలె మొదట చిన్నదిగానుండి క్రమముగా హెచ్చును. —భర్తృహరి

* మనలోవున్న లోపాలవంటి లోపాలుగల వారితోనే నిజంగా మనం స్నేహంగా ఉంటాము. —జార్జిజీన్‌నాథన్

అడవి గాల్పువేళ నగ్నికి సాయమై
నట్టిగాలి దీపమార్పివేయు
బీదపడినవేళ లేదురా స్నేహంబు. —కరుణశ్రీ

అప్పుచేయడం ప్రారంభమైనపుడు మైత్రి అంతమవుతుంది. —సూక్తి

## స్వేచ్ఛ

స్వేచ్ఛ మనిషికి మొదటిశ్వాస; అది నీ రక్తపు సజీవభాష; భూమి నుండి నీవు నీ అడుగు తీసేవరకూ నిలుపుకోవలసిన ఒకే ధ్యాస. —గుంటూరు శేషేంద్రశర్మ

వ్యక్తి స్వాతంత్ర్యం లేని సంఘం నియంతృత్వం. సంఘ నయమ బద్ధంకాని వ్యక్తి స్వాతంత్ర్యం అరాచకం. —హెచ్. జి. వెల్స్

మనకు ప్రాణంపోసిన భగవంతుడు దానితోబాటు స్వేచ్ఛ గూడా యిచ్చాడు. —థామస్ జఫర్‌సన్

# ఇందలి సూక్తుల సేకరణకు

# తోడ్పడిన గ్రంథముల పట్టిక

1. కచ్ఛపీ శ్రుతులు — శ్రీ ఆదిభట్ల నారాయణదాసు
2. తెల్లమబ్బులు — శ్రీ యన్. సంజీవదేవ్
3. పండిత పరమేశ్వరశాస్త్రి
   వీలునామా — శ్రీ త్రిపురనేని గోపీచంద్
4. రక్తరేఖ — శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ
5. సాక్షి (సంపుటములు) — శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు
6. ఋణానందలహరి — శ్రీ ముళ్ళపూడి వెంకటరమణ
7. ఖండకావ్యము — శ్రీ గుఱ్ఱం జాషువా
8. కౌసల్య — శ్రీ పోలాప్రగడ సత్యనారాయణమూర్తి
9. అగ్నిగర్భ: సాహిత్య వివేచన — డాక్టర్ కె. సుప్రసన్నాచార్య
10. విష్ణుశర్మ ఇంగ్లీషు చదువు — శ్రీ విశ్వనాథ సత్యనారాయణ
11. నార్లవారిమాట — శ్రీ నార్ల వెంకటేశ్వరరావు
12. శ్రీ సత్యసాయి వచనామృతము — శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి
13. జగద్గురుబోధలు — శ్రీ కంచి కామకోటి జగద్గురువులు
14. మాటవరస: మడతపేచీ: తనలో:
    రెండు రెళ్ళు — శ్రీ భమిడిపాటి కామేశ్వరరావు
15. వేమన శతకము — బ్రౌన్ దొర

16. బండ్లమూడి మాట- —శ్రీ బండ్లమూడి సత్యనారాయణ
17. సినీవాలి! త్వమేవాహం —"ఆరుద్ర"
18. ఆషామాషీ; పదగళ్ళు —శ్రీ రావూరి సత్యనారాయణరావు
19. ఉత్తిష్ఠత ; జాగ్రత ! ! —స్వామి వివేకానంద
20. శ్రీ రామకృష్ణ బోధామృతం —శ్రీ చిరంతనానందస్వామి
21. వెన్నెలకురిసిన రాత్రి —శ్రీ దేవరకొండ బాలగంగాధరతిలక్
22. ప్రాసక్రీడలు —శ్రీశ్రీ
23. మీసాల సొగసులు —శ్రీ పుచ్చా పూర్ణానందం
24. భాస్కర శతకము —శ్రీ మారద వెంకయ్య
25. నీలినీడలు (కవల) —లత
26. నిజమైన నిర్వచనాలు —శ్రీ గోళ్ళమూడి గోపాలకృష్ణమూర్తి
27. శిఖరాలు-లోయలు —డా॥ సి. నారాయణరెడ్డి
28. స్వామి రామతీర్థ ఉపన్యాసములు —స్వామి కేశవతీర్థ
29. తెలుగుబాల —'కరుణశ్రీ'
30. భగవద్గీత
31. వాస్తవ స్తవము —శ్రీ ఉమాపతి పద్మనాభశర్మ
32. గాలిబ్ గీతాలు, దాశరథీ శతకం —డా॥ దాశరథి
33. నాగొడవ —శ్రీ కాళోజీ నారాయణరావు

34. ప్రిన్స్ —మెకియవెల్లీ

35. గీతాభిజ్ఞానము —శ్రీ యార్లగడ్డ రంగనాయకులు చౌదరి

36. నీలగిరి వేసవి వెన్నెల —శ్రీ సత్యసాయిబాబా

37. అనుభవము; వారసత్వం; ఐశ్వర్యం, ఎండమావులు —శ్రీ కొడవటిగంటి కుటుంబరావు

38. ఇల్లుకట్టిచూడు, పెళ్ళిచేసిచూడు (నవల) —శ్రీమతి మాదిరెడ్డి సులోచన

39. పరిశుద్ధగ్రంథము —ఇండియా బైబిలు సొసైటీ

40. వరవిక్రయం —శ్రీ కాళ్ళకూరి నారాయణరావు

## మొదలగు గ్రంథములు

### గమనిక

"మణిపూసలు" గ్రంథమును రాష్ట్రంలోని అన్ని పాఠశాలల గ్రంథాలయాలకు తెప్పించుకొనుటకు అనుమతిస్తూ ఆంధ్ర ప్రదేశ్ విద్యాశాఖ డైరెక్టర్ 24-6-1977 తేదీ R.C.No. 14-4CA/3/77 ఉత్తరువు జారీ చేశారు.

# మా ప్రచురణలపై అభిప్రాయాలు

## కాంతిరేఖలు (మొదటి భాగము)

"ఐకమత్యమే జీవన సూత్రం, స్వరాజ్యం గురించి అవగాహన, పనిలోనిమాధుర్యం, ఎందరో మహనీయులు, చిన్న కథలలో పెద్దగుణ పాఠం, మాటా-మంతీ, దేశంయొక్క ప్రాతిపదికలు, అన్న శీర్షికల క్రిందఉన్న అన్ని రచనలూ విజ్ఞానదాయకంగా, వివేకాన్ని పెంపొందించేవిగా ఉంది నిజంగా పాఠకునికి ఒక్కొక్క రచనా ఒక్కొక్క కాంతిరేఖగా అనిపిస్తాయి."

—ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## కాంతిరేఖలు (రెండవ భాగము)

"కాంతిరేఖలు కావ్యంకాదు ; నాటకంకాదు ; కథకాదు ; నవల కాదు; సాహిత్య విమర్శన కానేకాదు. మరేమిటి ? చైతన్యాన్ని ప్రసాదించే ఒక సుందర సువర్ణ సుప్రభాతం. అజ్ఞానాన్ని పోగొట్టే ఒక విజ్ఞానసర్వస్వం."

—'కరుణశ్రీ' జంధ్యాల పాపయ్యశాస్త్రి

## పనికొచ్చే కథలు

త్యాగం, కష్టాలు, కోరికలు, క్రియాశీలత, గురుశిష్యులు, తల్లిప్రేమ, దేశభక్తి, ధర్మం, పని, పరోపకారం, భగవంతుడు, మరణం మోసం, విద్యార్థి, స్వశక్తి మొదలైన అంశాలమీద 116 కథలున్నాయి ఈ పుస్తకంలో. ఈ కథాత్మక విజ్ఞాన సర్వస్వం అందరికీ పెన్నిధి. నిజానికి పేరులోనే ఉంది పెన్నిధి.

—"జాగృతి" వారపత్రిక